# భారతి

మాసపత్రిక



సంపాదకుడు:

శివలెంక శంభుప్రసాద్



అక్టోబర్ 1969



సంపుటము : 46 : సంచిక : 10 :

విడిపత్రిక వెల ఒక రూపాయి



# విషయానుక్రమణిక

## అక్టోబరు 1969

# ఘటకర్పరుని-సందేశకావ్యము

## శ్రీ చింతలపాటి నరసింహదీక్షిత శర్మ

[శ్రీ విక్రమాదిత్యదేవుని యాస్థాన నవరత్న కవులలో ఘటకర్పర మహాకవి సుప్రసిద్ధుడు యమక రచనయం దీ కవి యందెవేసిన చేయి. ఈ కావ్యము చిన్నదైనను గుణగౌరవమున మిన్న. కాళిదాసుని మేఘసందేశము దీనికి మార్గదర్శి. అందు సందేశమంపువాడు నాయకుడు. ఇందు నాయిక. అందులోని యమక మిందు గమకము. దీని రచనా విశేషమునకు ముగ్ధుడనై ఆంధ్రీకరించితినిగాని, యమక రచనా ప్రావీణ్యము కలిగిగాదు. సహృదయులీ సాహసమును మన్నించి నా పరిశ్రమను గుర్తింతురని నమ్మిక—]

### 1

కావ్యారంభమున వస్తునిర్దేశాత్మక మంగళాచరణము:—

కలికి నవాంబుదంబు, లురుగర్జలఁ బ్రోషిత భర్తృకా మనో
దళన కళా ధురీణములు—దట్టముగా దివి నావరించె, దు
మ్ములు తొలిజల్లు పెల్లునను భూతలమందయడంగి యుండె, గ
న్నులకు సుధాకరోష్ణకిరణుల్ పొడసూపరు సుంతయుం, జెలీ!

### 2

హంసాది వినోదమునుగూడ దైవము సహించుటలేదని నాయిక చెలితో—

ఉఱిమెడు క్రొమ్మొయిళ్లఁగని యుల్కుచుఁ బర్వులు వారు హంస, లీ
తరుణమునందు పందెలు సుధాకరశూన్యములై తగున్; విక
స్వర నినద ప్రచారముల భాతిలు జాతి మయూరజాతి, తొ
ల్కరి చిఱు జల్లులం బొడము గర్వభరంబునఁ; గుందదంతిరో!

### 3

సహాయ హీనమగు నాకు మహాభీతి కలుగుచున్నదనుట:

రాతిరి నీలనీరదపరంపర పైకొనెఁ, దారకావళీ
ద్యోతము మాసి యాకసము తోఁచదుసుంత—సుఖోపభోక్తృఁ గం

జాత విలోచను న్నిదుర శయ్యకుఁ దార్చెను, సేంద్రచాప గ
ర్జాతత వారిదాళియు రుషం గలిగించు మదేభపాళికిన్—

## 4

నాయిక నిజభీతిని వెల్లడించి అంగుళితో గిరులను జూపుచు పలుకుట:

మించులన్మించు మొగులు వర్షించినంత
జలము— గర్జాతి భీత భీషణ ఫణీంద్ర
సాంద్ర శైలేంద్ర శృంగాగ్ర సరణి జాటి
చెలి! లలిత కందరీ భాగములకుఁ జేరె—

## 5

సంయోగులకు సుఖము, వియోగులకు దుఃఖము దీన సూచితము:

రతికలహైకకోపితములన్ జవరాండ్ర మెఱుంగు మోములన్
గుతుక విలాస రేఖలనుగూర్చు నొకానొకఁ డిట్టివేళ; గ
ర్జితయుత మేఘము ల్పథికహృత్తటి నుత్కలికల్ ఘటించుఁ, ద
త్సతుల మనంబులం దసదృశంబును శోకమునించు, నెచ్చెలీ!—

## 6

ఇదంతయు నెవ్వరెప్పుడనుచున్నది కవి తెలుపుచున్నాడు—

తమిస్ర దొరకాంతి యాచ్ఛాదితమ్ము గాఁగ—
గగన పతితంబు కంబు శోకంబు పెంప—
కాయజుఁడురేఁగి హృదిఁద్రుంపఁ గతి 'నూఱఁ
బ్రోషితాంగన యిట్లు వాపోఁ దొడంగె —

## 7

మేఘములతో వియోగిని పలుకుమాట—

పతియు నేను గలసి బ్రతికెడు వేళల
నెచటదూఱినార లీరు ఘనులు!
ప్రియుఁడు కరుణమాలి పెఱసీమలన్నేడు
నెగడ నన్నుదెగడ నిగిడినారె?—

## 8

యిక సవినయముగా భర్తకు సందేశమంపుచున్నది.

జలదములార! పాంథగణ జాల్మని, మ్రుత్ప్రియు జేరఁబోయి, యీ
రలఘుగతి ప్రవీణు లిటులాడిన నానుడు లెల్లఁదెల్పఁగా
వలెఁ 'బరదేశమందె చిరవాసము మేలొ? సుఖప్రదంబు నా
కలయిక మేలొ? విస్తరముగా వివరింపుఁడు జీవనప్రదుల్—

## 9

వరుసగా మూడు పద్యాలలో సందేశ వచనము—

స్వామి! మరాళ జాల మిదె సాగెను నేఁడు వియత్తలాన ని
త్యామల వారి పూరిత ముదారము మానస సీమకున్; తృషా
ధామము చాతకంబు, పరితాపమునం జల మానఁగోరు, నీ
కామిని దుఃఖవార్ధిఁ బడెఁ! మునిఁగెం దయ నేలుకోఁ గదే!—

## 10

కాంత! వెలుంగు బాల తృణకాండము కోమలలీల, విప్పుడ
త్యంతము నిర్మలాంబువుల నానఁగడంగెను జాతకంబులున్—
కాంతవృదాక్సులన్ శిఖిగణంబులు పల్కఁ బయోధరాప్తి; నా
చెంతనుబాసి నీవు సుఖసేవధి నౌ టెటులో వచింపుమీ!—

## 11

గర్జితస్వన ముదిత శిఖండి గణము
ప్రోషితా భీతి కృన్మంత్రమును బఠించు—
ప్రావృడారంభ కృశను, దుర్వరుఁడు మరుఁడు
దీన దీనాతిదీన వ్యథింపఁబూను—

## 12

సందేశావసానమున మఱలఁ బ్రియునకుఁ మేఘముఖమున దెలుపుచున్నది.

పాండుర గండమండలముపై నసియాడుచు నీలిముంగురుల్
మెండుకొనంగఁ నేఁడు విఫలీకృత కాంక్షలఁ బొక్కి ప్రేయసిన్
చండుడ! జాలి మాలి యెడ సల్పితి—శోక సముద్ర వీచికల్
నిండిననేమి? నీ స్మరణలే బ్రతికించుఁ గృశించు కోమలిన్—

## 13

మేఘములకిట్లు తెలిపి ఊర్ధ్వ మవలోకించి దీనయై పలుకుచున్నది—

పూచిన కొండమల్లియలఁ బొల్పువహించెను గానలెల్ల న
య్యో చిరపాంథ! మత్ప్రియ! వియోగి జనంబు సముత్సుకానన
శ్రీచణమయ్యె నేడుః కలుషీకృతమయ్యె నదీ జలంబు, న
న్నేఁచెదవేల నింక? రసవిత్తమ! మత్తదశావశోత్తమా!

## 14

ఇపుడు దారులతీరుల నిరూపించుచు నాయిక యువవనమున కేగుచున్నది—

జలదజలప్రవాహములు జాల్కొన దుర్గములయ్యె మార్గముల్
చెలువుఁడు నవ్విడంగని స్పృశించె మరుండు శితేషుచాపమున్
కలఁత ఘటించు మేఘ కటు గర్జన తర్జన, మెట్లు త్రోయఁగాఁ
గలనొ సఖీ! సుదుస్సహముఁ గాంత వియోగజశోకతాపమున్—

## 15

వన సందర్శనమునఁ గలఁకగొన్న నాయిక పలుకుచున్నది.

నవ నవ వారిబిందు పతనమ్మున వెల్గులు చిమ్ముచున్, గభీ
ర వర రవాబ్ద మారుత పరంపర నూఁగుచుఁదూఁగుచున్, మనో
భవ నవ కేళికా భవన పంక్తులనై కనువిందు సేయుచున్
పవురులు పెంచుఁ గైతక వనంబు లుదాత్త ఘనాగమంబునన్—

## 16

వనమున మద్దిచెట్టును గని తట్టుకొననోపక నాయిక పలుకుచున్నది.

పూలగుత్తుల వనభూజమౌళివంట
యువక నేత్రోత్సవ శ్రీల నొసఁగుదంట!
సాల! కామాలవాల! సత్సాలముగను
ధాత నిను సృష్టిచేయు టెంతయును లెస్స—

## 17

పూర్వార్ధమునఁ గడిమిని మ్రొక్కి యుత్తరార్థమున నీసెక్కి కుటజమును మ్రొక్కుట.

ఓ వనకదంబ! తలవంతునోయి నీకు
నీ సుమశ్రేణి మదనుండు నిలుచుకతన—

ఏల కుటజ! సుమించి వ న్నేరి పఱుతు
చరణముల వ్రాలుదాన దుస్సహుఁడవీవు—

## 18

నీపమును జూచి కోపమున రేచి పలుక్కుచున్నది.

నీప వనీపమా! సతము నీ పదమందు శిరంబునుంతు నం
తాపము రేప నీకు సరదాయగునా? ననువంటివారి; కే
నే పదమందు నీ విరుల నించుక గాంచుదు నాక్షణంబె ప్రా
ణాపద నొందుదానఁ గదరా! మదవ ప్రదర ప్రసూనకా!—

## 19

నాయిక మెల్లగా నడవి మొల్లనుగాంచి పలుకుచున్నది—

జలద ముక్తాంబులవలబ్ధ లలిత రుచుల
నలరు తెలిపూలఁ జెలువొందు నడవి మొల్ల
తీవియను ముద్దుగొనసాగెఁ దేటి తేఁడు
నీలిమబ్బుల వన్నె చిన్నెలఁ గరంగి—

## 20

నాయిక గృహశిఖిముఖియై చెలితోఁ బలుకుచున్నది—

కలితనవేంద్రచాపఘన గర్జన దుర్దిన వేళలందుఁ గో
ర్కులు కులుక న్నిజప్రియులఁగూడి రతోత్సవలీలఁదేలు భా
మల కనుకూల మీ ఋతువు—మానసకామితదాయకంబు, నె
చ్చెలులును సావ్యవైఖరులు చెందుట లీ ఘనవేళలంగదా?—

## 21

ప్రియుని గృహాగమనమును తెలియఁజేయుచున్నాఁడు—

విరహకృశానుతాపపరిపీడితయౌ చెలి పల్కులిట్లు వా
ర్దరములు వోయి తెల్పిన ముదంబున నాయకుఁ డాలకించి, యా
దర భరితాంతరంగుఁడయి, తాఁ ద్వరమై నిలుసేరవచ్చె ము
ప్పిరిగొను కామినీ ప్రణయ వృత్త రసామృతధార లారఁగన్ —

## 22

కవి స్వప్రతిజ్ఞను వెల్లడించుచున్నాఁడు—

ఈ యమకరీతి నను గెల్పనేకవీంద్రుఁ
డాతని గృహంబునను నంబు సాక్షికంబు
స్వానురక్తాంగనారతిమాని, నీరు
తెత్తు ఘటకర్పరమునం బ్రతిజ్ఞ యిద్ది—

## 23

సరసము, మధురము, ఘటక
ర్పర కావ్యముఁ దెల్గు బాస భాసిలఁ జేసెన్
"నరసింహ దీక్షితుఁడు,, కై
సరులకు, బుధవరుల కిద్ది సమ్మద మొసఁగున్ —

---



# లక్ష్మీ - భీమపరాగ్రహార దానశాసనం

శ్రీ ముసునూరి సాంబశివరామమూర్తి

ఇది యొక సంపూర్ణమైన తామ్రశాసనము. ఇది రాజమండ్రి తాలూకా, బూరుగపూడి - రాజానగరము జంక్షను రోడ్డుపైనున్న వందరాడ గ్రామ కాసరస్థులును, సంపన్న గృహస్థులునైన శ్రీ అడుసుమిల్లి రామప్రభుగారికి, ఆ యూరికి ఈశాన్యదిశను 3 కి. మీ. దూరమున ఉన్న దోనేపల్లి (పాటి) దిబ్బయందు, రెండు సంవత్సరముల క్రితము (బయల్పడుటచే) దొరికినది. వారు దీనిని జాగ్రత్తగ శుభ్రపరచి పదిలపరచి యున్నారు. ప్రస్తుతము ఈ శాసనపు ప్రతిబింబములను, నకలులు తీసి ప్రచురింప ప్రోత్సాహ మిచ్చినందులకు వారి కెంతయు కృతజ్ఞుడను.

**శాసనస్థితి :**

శాసనము సంపూర్ణముగా ఉన్నది. ఏమాత్రము చెక్కుచెదరలేదు. అయితే శాసనమందలి అయిదవ రేకు మొదటిపుట 8-7 పంక్తులకు సంబంధించిన అక్షరములపై 2 సె. మీ. పొడవున లోతుగ (గునపపుపోటును గుర్తించు) గాడిగలదు. కాని ఆ అక్షర స్వరూపములు పూర్తిగ చెడలేదు.

శాసనపురేకులకు బంధించిన రాగికడియము మాత్రము 6 సె. మీ. పొడవుగల ముక్క విరిగి పోవుటచే కానరాలేదు. అంతేగాక ఈ కడియము రాజముద్రికకు $1\frac{1}{2}$ సె. మీ. దూరమున పూర్వ మెప్పుడో నరుకబడియున్నది. దీనిని గమనింప అల్లాడ వేమ భూపవరము (పినపళ్ల) తామ్రశాసనమువలెనే పూర్వమెప్పుడో (చాల చాలకాలము క్రిందట) ఈ శాసనము పరిశీలకుల చేతికంది కడియము నరుకబడి పరిశీలింపబడినదనియు, తిరిగి యేకారణముననో (ఒక రేకైనను జారి పోకుండ కడియము రాజముద్రికలతోగూడ) ఒకశతాబ్దము కాలమైనను భూగర్భమునదాగి, తిరిగి నేటికి తలయెత్తినదనియు నవగాహన యగుచున్నది. అందుచే ఇంతవరకు తెచ్చుటను గానరాని యీ వంశపురాజులు, వారి రాజ్యము, కీర్తి, దానము మొదలగు చరిత్రము బయల్పరుప మొదలిడ వీలుకలిగినది.

**శాసన స్వరూపము :**

ఇందు ఏడు రాగిరేకులు గలవు. వాటి కొలతలు $22.5 \times 10$ సె. మీ; ప్రతిరేకునకును ఎడమభాగమున 1. 5 సె. మీ. దూరమున 1. 3 సె. మీ. వ్యాసముగల రంధ్రము గలదు. ప్రతి రేకునకును చుట్టును ఉబ్బెత్తుగల జవకలదు. అందుచే అక్షరములు అరుగుటగాని దెబ్బతినుటకు గాని అవకాశ మేర్పడలేదు. కడియముచే బంధింపబడిన రేకులు తాటాకు పొత్తమువలెనే సులువుగా పుటలుత్రిప్పి చదువ ననువుకలిగి యున్నవి. మొదటి రేకు మొదటిపుటయందు ఏమియు వ్రాయబడ లేదు. మిగత పుటలయందు ఆరవరేకు - రెండవ పుటకును, ప్రతిపుటకు 11 పంక్తుల చొప్పున; ఏడవరేకు మొదటిపుటను 12 పంక్తులును, ఏడవ రేకు రెండవపుటను 5 పంక్తులును శాసనము వ్రాయబడుటచే మొత్తము $-11 \times 11 + 12 + 5 = 138$ పంక్తుల శాసనమై యున్నది. ఇదిగాక

ఆఖరున 137 పంక్తి 'శ్రీ రామచంద్రాయనమః' అనియు 'వల్లభుత్రాలు' అను హస్తముద్రికయు గలవు. వ్రతి రేకునకును గల రెండవ పుటయందు ఎడమవైపువగల రంధ్రమువద్ద ఆ రేకుయొక్క వరుసగల అంకె గుర్తించబడినది. అందుచే శాసనము చదువువారు శాసనపు రేకుల వరుస తరుముకొన నక్కఱలేక పోయినది. ఈ శాసనము మొత్తము తూకము 3,000 గ్రా.

రాజముద్రిక—కడియము :

రాజముద్రికగల కడియమును రాగిదే. దాని వెలుపలి కొలతలు 8 సె. మీ; లోపలి కొలతలు 6. 5 సె మీ. ఆ కడియము నంటియే 3. 5. సె. మీ ఉబ్బయు, 1 సె. మీ ఎత్తునుకలిగి, పరిపూర్ణమైన 3 చుట్టలు కలిగిన త్రాచుపాము 1 సె. మీ. ఎత్తును 1 సె మీ. వెడల్పునుగల పడగను విప్పి గంభీరమైన లోచనములు కృష్ణ పాదములు గలిగియుండుటచే రాజకీవిని గలిగి ఎక్కువగా ఆకర్షణ గలిగించుచున్నది. కాని కడియము నందు 6 సె. మీ. ముక్కవిఱిగి కనబడకుండుటయు, మఱి 4. 5. సె. మీ. వఱకు నలిగిపోవుటయు గమనింపదగ్గ విషయము.

శా స న లి పి :

ఈ శాసనలిపియు 13, 14 శతాబ్దము లందలి వేంగీదేశపు శాసనలిపివే (చాలవఱకు) పోలి యున్నది. అయితే అల్లాడ వేమభూపాలపు తామ్రశాసనలిపియంత గంభీరతలేదు. అయినను శాసనాక్షరములు గుండ్రముగను, పంక్తి వరసను వీడలేదు. (శాసనభాష సంస్కృతమైనను లిపి మాత్రము తెలుగు.)

శా స న భా ష :

శాసనభాష యంతయూ సంస్కృతమే. నిర్గద్య. 80 శ్లోకములు. గ్రామనామములు, సరిహద్దు సీమలు, అందలి తరు, వృక్ష, లతాగుల్మాదులు, తటాకములు, కాలు, మార్గములు మొదలగునవన్నియు సాంస్కృతికములే. దానప్రతిగ్రహీతల గోత్ర, నామ, విద్యా, భాగాదులన్నియును సంస్కృత శ్లోకములందే వ్రాయబడినవి. తొయ్యేరు, వేములవాడు, దోనేపల్లి, వాల్లంక, గండవాడ, కాలు, వఱకం మొదలగు అచ్ఛికములును సంస్కృతీకరింప బడియే వాడబడినవి

శాసన విషయములు :

శ్లో. 1-5. దైవప్రార్థన; 6-8 పురాణ వంశప్రశస్తి; 8. వంశోద్భవము-నివాసము; 10-12 దేశము, రాజ్యము, రాజధానీవర్ణన; 18-45 వంశవర్ణన; 46-50 దానప్రశస్తి; దానస్థల నిర్ణయము; 51 దానకాల నిర్ణయము; 52 గోత్ర, నామ, విద్యా, భాగనిర్ణయ విధానము; 53-88 దానప్రతిగ్రహీతలు; 80-87 గ్రామద్వయమైన అగ్రహారసీమానిర్ణయము; 70 దానపాలనా విజ్ఞప్తి. ముగింపు. దేవతానమస్కారము-హస్తముద్రిక.

# శా స న పా ఠ ం
## మొదటిరేకు-రెండవపుట

1. ఓం । యం సర్వ్వేలోకాః ప్రణీ(ణి)త్య[1] సర్వ్వకార్య్యేషు సిద్ధిం సహసా లభంతే । పు
2. ష్ణాతు లక్ష్మీం సముదావలాస్యో గౌరీశ చిత్తాబ్ధి విధుర్ద్విచంద్రః ॥1॥ శ్వేతో వరాహః
3. శివమూతనోతు లీలావతారః పురుషోత్తమస్య । యదీయ్యదంష్ట్రాంకురదండలగ్నా
4. ధాత్రీ లసచ్ఛత్రవిలాసిలాతి ।2। ఆశాదలాఢ్యాకనకాం[2]ద్రికర్ణికా మందాకినీ మంజు

---

ఛందస్సు:—1, 2, 3. ఇంద్రవజ్ర; 4, 5 అనుష్టుప్; 6. వైపరీత్యోపజాతి. (1, 3, 4, ఇం. వ. 2 వంశస్థం) 7. వైపరీత్యోపజాతి. (1. వంశస్థం; 2, 3, 4. ఉపేంద్రవజ్ర)
సవరణలు:—(1) ప్రణీత్య=ప్రణిపత్య; (2) కనకాంద్రి = కనకాద్రి;

5. మరందపూరితా । ఫణీశ్వరారూఢ మృణాలరమ్యా సేయం ధరిత్రీ శ్రియమా
6. తనోతు ।3। కలాచాంద్రమసీభూయా ద్విజపస్య ప్రవర్ధనీ । శంకరస్య జటా
7. జూటభూషా శుద్ధా వపా(యి)నీ ।4। వాగ్దేవీం శిరసానత్వా వక్ష్యే గ్రామస్య శాసనం । ప్రవ
8. ంశ శబ్దగంభీరవాచ్యహార విభూషితాం ।5। నాభిసరోజా దురోభూత్ ప్రజాపతిః పరో
9. జనాభస్య తదీయ్యమానసాత్ । తతో మునీంద్రో భవ దత్రినామా తదీయ్య నేత్రా దుదభూత్సు
10. ధాంశుః[4] ।6। తతో బుధః సౌమ్యవిశేషమూర్తిః పురూరవా ముఖ్యసుతా నజీజనత్[5] తదన్వ
11. యే సకలసర్వజనాశ్రయా భూవన్ననంతవర్మాణః సహి చక్రవర్తిః ।7। రాజ్ఞీచ తస్యా భవదంబు

## రెండవతేకు-మొదటిపుట

12. జాక్షీ భోగావతీనామ నృపేశ కన్యా। పురేవ తస్మిన్ మణినాగనామ్ని తతో క
13. రోద్రాజ్య మరిందమశ్చిరం ।8। ఫణీశ్వరాకారతయా నృగర్భజాతోపి రాజ్ఞీతపసా
14. నృపోభూత్ । తదాప్రభృత్యేవ స నాగవంశః సర్వోత్తమో భూదితి సుప్రసిద్ధం ।9। ఏ
15. వంవిధే నాగకులే స భీమభూపో భవ త్కాశ్యపగోత్రభూషా। ఆసీత్తత స్తస్య నివాస
16. భూమిర్మనోహరో వేములనాడిదేశః ।10। సాపచ్యమానైః ఫలితస్యతస్యైరారా
17. మ దేవాలయ దీర్ఘికాభిః । అరణ్యనాగేంద్ర ఘటాశ్రయాఢ్యైః[7] స్తపోవనైః
18. పుణ్యతపో ధనానాం ।11। [8]ర భాఖ్య తీర్థానాం సహి రామనాధ శ్రీగౌతమీ వాలెటి గ
19. [9]డ్డ కుల్యా । [10]జయంతి విం ధ్రాద్రే[11] నివాసజాతదోషం జనానాం వినివారయంతం ।12
20. । నిసర్గరమ్యం జాతే తస్మిన్ దేశే భీమమహీభుజః । ఆసీ ద్రంభాపురీ రమ్యా ద్వితీయ్యా పాల
21. కా తతః ।13। సా గండ్లవాడా భువి సుప్రసిద్ధా పురీ పురాణాం ప్రథమా విభాతి । నా
22. గేంద్ర వంశోత్థ మహీపతీనాం పట్టాభిషేకార్థ వినూత్నవేదీ ।14। పదాతిహస్త్య

## రెండవతే[కు]-రెండవపుట

23. శ్వరథాది కానాం గతాగతైర్యత్ర నితంబినీనాం । నిరంతరైరవ్యవకాశశూన్యా
24. శ్చైవోర్ధ్వమార్గా విపులా భవంతి ।15। యా హట్టవిన్యస్త సువర్ణముక్తామాణిక్యధా
25. న్యాగరు చందనాద్యైః । కస్తూరికాకుంకుమ చంద్రపుష్పసీరైర్మనోజ్ఞా మధురేవ

---

సవరణలు—: (3) దుదభూ తే=దుదభూత్; (4) త్సుధాంశు; త్సుధాంశః, (5) సుతానజీజనత్ : సుతానజీజనత్ (6) తదన్వయే న సర్వే=తదన్వయే సర్వే (7) స్తపోవనైః=తపోవనైః; (8) రభాఖ్య=రంభాఖ్య; (9) వాలెటిగడ్డ-వాలేటిగడ్డ (10) జయంతి: జయన్తి; (11) వింధ్రాద్రే=వింధ్యాద్రిః

ఛందస్సు:-8. వైపరీత్యోపజాతిః (1, 2. ఇం. వ; 3. ఉ వ;) 4 వంశస్థం; 9. వ్యత్యస్తోపజాతి:—(బేసి. ఉ. వ; సరి=ఇ. వ;) 11, 12 ఇ వ; 13 అనుష్టుప్; 14. ఇ. వ. 15. వైపరీత్యోపజాతి. (1, 2, 3 ఉ వ. 4. ఇ. వ) 16 ఇ. వ. 17. ఉపజాతి (బేసులు. ఇ. వ; సములు ఉ. వ) 18, 19, 20, 21, 22 అనుష్టుప్.

26. భాతి |16| చంద్రార్క మాణిక్యనిబద్ధభిత్తి సితాచ్ఛభాసా నగరే కదాచిత్ | నాభూ
27 ద్దివారాత్ర విభక్తి రుచ్చైశ్శీషద్వికాసా త్క్రమలోత్పలానాం |17| అధిజ్యధన్వ
28. నః[12] స్తస్యరాజ్యశ్రీ రమితాచలా | తొయ్యేటి చౌళముఖ్యాని పురా
29 ణ్యన్యాని చాభవన్ |18| తతో భీమ మహీపాలో లబ్ధ్వా వల్లభం సుతం | అరిందమ
30. [13]మధోతస్య జాతకర్మాణ్య ద్యకారయత్ |19| పురోధసా తతో విద్యా మధ్యాప్యాథ నృపా
31. త్మజాం | శియ్యమాంబాం వివాహ్యాస్య రాజ్యచిహ్నాని దత్తవాన్ |20| స్వయం తపో
32. బలాత్ప్రాప శేముషీ[14] మతాం శుభాం | అథాకరో చ్చిరం రాజ్యం వల్లభేంద్రో మహా
33. బలః |21| మణినాగపురాధీశే వల్లభేంద్రే సభాస్థలే | యతోముఖం సమా

## మూడవరేకు-మొదటిపుట

34. సీనే వలాయంతే తతో నృపాః |22| తతో వల్లభ రాజేంద్రః పాలయన్ స మహీ
35. తలం | [15]అమాత తనయన్ దేవ్యా మైళ్ళభీమ మహీభుజం |23| జాతాదికర్మ వి16
36. వ్వర్త్య తస్యరాజ్యం ప్రణీయచ | యజ్ఞార్థం దీక్షితోప్యాసీ దేతదేవ కులవ్రతం |
37. 24 | తతో భిషిక్తస్సహి భీమభూపః శశాస ధాత్రీ మమలప్రతాపః | ప్రతిక్షితి
38. శాఖిలసింధు సేతు ద్వారాధినాథో [17]ధవళంకభీమః |25| అథ రాజ్ఞీ త్రయ
39 ంతస్య శక్తిత్రయ మివా భవత్ | మల్లమాంబా కొప్పమాంబా లక్ష్మీదేవీతి
40. సుందరం |26| [18]కంసల్యా రామచంద్రం దశరథనృపతే [19]స్తత్యమా మల్లమా
41. ంబా తత్కీర్తిశ్రీకాంతం త్రివుక్కడింద్రం స్వలభతనయం[20]తరసమా భీమభూపాత్ | కైకేయా[21]
42. భ్రాతృభక్తం భరతమివమతం కొప్పమా మల్లినాథం సౌమిత్రిం సా సుమిత్రా
43. గుణగణనిలయం వల్లభేంద్రం హి లక్ష్మీః |27| కుమారజనాన్మృతవరుష[22]
44. నోక్షిణా వసిష్ఠకల్పేన పురోహితేన | మహేశచిహ్నాని విహాయ సర్వా మా

## మూడవరేకు-రెండవపుట

45. హూయ విప్రా నవదంనృపాలః |28| వేదత్రిశాస్త్రాఖిల నీతి కావ్య పురాణ
46. ధర్మాది సమస్తవిద్యాః | ప్రాప్తాః కుమారా అపి పూర్వజన్మ సంస్కారదార్ఢ్యాదివ తే
47 చిరేణ |29| దేవం[23] మరుత్వానివ సర్వమంజూశాం భువం సగంగాహిమసేతు మ
48 ధ్యమాం | న్యాయేన శాసం[24] జరయా సుశిక్షితః కాలేన చాపే దధ భీమభూపతిః |30|

---

సవరణలు.–(12) స్తస్య=తస్య; (13) మధోతస్య? (14) శేముషీ మతాం=శేముషీమ్మహితాం. (15) అమాత తనయన్–అనూత తనయం (16) కర్మనివృత్య=కర్మనిర్వృత్య; (17) ధవళంక=ధవళాంక; (18) కంసల్యా=కౌసల్యా; (19) స్తత్యమా=స్తత్సమా; (20) భతనయంతరసమా=భతతనయం తత్సమా (21) కైకేయా=కైకేయీ; (22) వరుష=వర్ష. (23) దేవం=దివం; (24) శాసం=శాసన్

ఛందస్సు:–23, 24 అనుష్టుప్; 25. ఉ. వ; 26. అనుష్టుప్; 27. స్రగ్ధర; 28. వైపరీత్యోపజాతి 1. వంశస్థం. 2, 3 ఉ. వ. 4 ఇం. వ) 29. ఇం. వ; 30 వైపరీత్యోపజాతి (1, 2 వంశస్థం, 3, 4 ఇం. వ;)

49. తం క్షత్రముఖో[25] చితకీర్తిమంతం సామ్రాజ్యభారోచిత మిమ్మడీంద్రం । [26]జ్యేష్ఠను
50. తం విప్ర మహరిముఖ్యైః[27] పట్టాభిషిక్తం కృతవాన్ వృధీరః ।31। తతః పరద్యా[28]భి
51 రజ్ఞిహోత్రైర్దార ప్రముఖ్యైరపి భీమభూపః । పురోపకంఠోపవనే ము
52 నీంద్రో భూత్వా చిరం కాల మతిష్ఠ దుర్వ్యాం ।32। తతో భిషిక్తః సంస్రాజ్యే రాజ్య మి
53. మ్మడి భూపతిః । కుర్వ న్నావిరభూద్రాజ్ఞాం ద్విజానా మివ చంద్రమాః ।33। అస్తే
54. స్వహ[29]స్తేప్తేత ఖడ్గవల్లరీ విక్షేప విత్రస్త విరోధి మండనః । స్వబాహుకండూతి వి
55 మర్దదక్షం కాంక్షం త్సదా యుద్ధమసౌ నృపాలః ।34। సతకరగండో సితకరరే

## నాలుగవరేకు - మొదటిపుట

56. జో బిరుదరగండ స్సరపతిపుణ్యః । గుణగణగణ్యః క్షితిపతిరణ్యః
57. ఫణిపతివంశో బుధజనసేవ్యః ।35। అథాంబికాయాం తనయావదేవ్యా
58. ం శ్రీ చక్రవర్తీ సహి భీమరాజః । జాతౌ భుజంగేంద్ర కులస్య భూత్యై తావిమ్మ
59. డిశస్య కుమారకల్పౌ ।36। జాతయమ్మాడి సిర్వర్త్య విద్యాశ్చాధ్యాప్య చైతయోః । శా
60. సన[30] ప్రస్పృష్ట వసుధాం చిరాయ ప్రచయోభవన్ ।37। ససంమ్మతింత్వింమ్మడి
61. రాజవర్యః పుత్రస్యచావ్యహి చక్రవర్తిః । నిజానుజం వల్లభరాజ చ
62. ంద్రం పట్టాభిషేకార్హ [31]మయుంస్త మాంన్యయన్ ।38। సునీతి [32]మాంమిమ్మడి రాజ
63. వర్యః కాలేన భూత్వా ప్రవయాస్స విద్వాన్ । నిజానుజం వల్లభరాజవర్యం పట్టాభి
64. షేకార్హ మమంస్త రాజ్యే ।39। కాంతాసుకామం స్సుజనేషు[33] సోమం రణే
65 షు పార్థం విభవేషు విష్ణుం । భూపేషురామం విమతేషుభీమం స్నేహేషు లో
66. కేషు సమం సమీక్ష్య ।40। ఆధాభిషి [34]చ్యాభి దాత్మవిద్యావరాయణః క్షితిర్త

## నాలుగవరేకు - రెండవ పుట

67. శరీర శేషః। తతోయువా వేముతినాడి రాజ్యే పట్టాభిషిక్తస్సహి వల్లభేంద్రః।
68. 41। యదీయ్య సేవావసరం[34a] ప్రదీప్య తిష్ఠంతిభూపా నగరాంగణేషుః। జీయ్యా
69. దసౌ వల్లభ రాజచంద్రః ప్రతిక్షితీశోత్పలషండభానుః ।42। లోకే ధవలితే తస్య
70 యశసాని చయానియాన్। మార్గమాణా ఇవాద్యాపి భ్రమంతి తపనాదయః।

---

సవరణలు : (25) ముఖోచిత=ముఖ్యోచిత; (26) జ్యేష్ఠ=జ్యేష్ఠం; (27) మహరిముఖ్యైః= మహర్షిముఖ్యైః; (28) పరధ్యాభిరజ్ఞి–పరధ్యయిభిరగ్ని; (29) హస్తేప్తేత-హస్తస్థిత. (30) శాసన ప్రస్పృష్ట–శాసనప్రస్పృష్ట; (31) మయుంస్త–మమస్త (32) మాంమిమ్మడి – మానిమ్మడి (33) కామంస్సుజనే - మంసుజనే (34) చ్యాభిదాత్మ— భవదాత్మ (34A) ప్రదీవ్యం-ప్రతీక్ష్య.

ఛందస్సు:- 31. ఇ వ; 32. వ్యత్యస్తోపజాతి. (బేసులు ఉ వ; సములు ఇం. వ·) 3. అనుష్టుప్; 34. వ్యత్యస్తోపజాతి (1, 2 వంశస్థం; 3, 4 ఇ వ) 35. కుసుమ విచిత్రం; 6 ఇం. వ; 37, 38, 39 అనుష్టుప్; 40. ఇ వ 41 ఉపజాతి (1. ఇ. వ. 2, 3, 4. ఉ. వ.)

71. 43। 34b సీధు గోవింద బిరుదే శరవంధాన మానసే । 34c ప్రవిశ్యం తీది భూపాలాః పిం
72. 4. ధుంవా సంధి మేవవా ।44। యత్ప్రసాదలవలబ్ధ వైభవానాయకా
73. ప్పకల దేశవాయకాః। రాజ్య మ్పద్యమతులం34d స్సుభంజ్జతే తస్య రాజ్య విభ
74. వః ఃఃe ముచ్ఛతే ।45। తతోవల్లభ రాజేంద్రో దత్వా దావాది కోటిశః। ఇష్టాపూర్తాని
75. విప్రార్థ్యా గ్రామదాన సరోభవత్ ।46। 35త్రైర్గ్గ చ శాస్త్రాణి యదీయ్యా బుద్ధే వాగాలంగు
76. బాధ్యం ప్పపురోధ ముఖ్యం। విద్వక్సింద్రాశ్రిత పారిజాతం36 మల్యాదినూరిం పు
77. రత్నప్పిష్య ।47।37 అథా చద్వేదశాస్త్రాది విద్యాసు సుపరీక్ష్యచ। సంతోభ38 ద్ధిరానే

## అయిదవతేసు - మొదటి పుట

78. యా స్తైర్వ్యధ తథాకృతం ।48। శ్రీ వల్లభే శ్వేంగుఱునాడి దేశే శ్రీ గోతవిా
79. పూర్వ్వా తటేభిరామే। గవ్యూతి దూరే నరసింహనాన్మ39a కొఱుకొండ దేశస్య పు
80 రోపకంఠే ।49। గ్రామద్వయం40 వాలంకటోనెపల్లిం కృత్వైక సీమం విదుషాంవ
81. రేణ్యం। ఐశ్వర్య భోగాష్టక వృద్ధిరమ్యం పంచాశతే దత్వా సపంచకా యై।
82. 50। శాకాబ్దే రసరంధ్ర భానుగుణితే నాభస్య చంద్రగ్రహే41 పిత్రో ప్రీతి మ
83. నూపమాంసకల యువ్వానూయ్యా చంద్రావసిం। స్వపాదా దురగేంద్ర
84. సత్కులభవ క్ష్మీశ ముఖో42 ముదా లక్ష్మీ క్షేమ వర్యాగ్రహార తిలకం శ్రీవల్ల
85. భక్ష్మాపతీ43 ।51। వక్ష్యేథ భాగినాం విద్యానామగోత్రాంశమానకం।44 శ్లోకనాదేనవ పా
86. దేన కింవి దూనే45 వాస్ఫుటం। శ్రీవత్స గోత్ర సంభూతాః పెద్దిసీరాన్న యాప్వయాః। వి
87. శైక భాగా శ్చత్వారో యా46చుష్క గుణసాగరాః ।43। అద్ధాంశో గంగయ శ్రీమాం న్యా
88. జుష్క వత్సగోత్రజః। రామయః పెద్దిబోస్యశ్చ వాధూలకుల సంభవః ।54। ఆద్యే

---

సవరణలు: (34B) సీధు=సింధు; (34C) ప్రవిశ్యంతీది=ప్రవిశంత్యరి, (34D) స్సుంభజతే–సుభంజతే; (34E)ముచ్ఛతే=ముచ్యతే ( 35) త్రైర్గ్గచ=త్రైవర్గ్గ, (36) విద్వక్సింద్ర=విద్వత్కసింద్ర; (37) అధాచ–అవోచ (38A) సంతోద్ధిరానేవే–సంతోషాద్ధిరపేనే (39) నాన్మ=నామ్నా (a) కొఱుకొండ; కోఱ్కొండ; (40) వాలంక=వాల్లంక; (గణభగము) (41) పిత్రో ప్రీతి: పిత్రోః ప్రీతి (42) క్ష్మీశముఖో=క్ష్మీశముఖ్యో; (43) క్ష్మాపతి–క్ష్మాపతిః (44) శ్లోకనాదేనవ=శ్లోకేనాదేనవ; (45) దూనే నస్ఫుటం=దూనేనవా స్ఫుటం (46) యాచుష్క=యాజుష్క

ఛందస్సు : 42. ఉపజాతి (1. 2 3. ఇ. వ. 4. ఉ. వ ) 43. 44 అనుష్టుప్; 45. రథోద్ధతం (వరాంతిక) 46. అనుష్టుప్. 47. ఇ. వ... 48 అనుష్టుప్; 49. 4. 5. ఇం వ. 50. శార్దూల విక్రీడితం; 52, 53, 54 అనుష్టుప్.

## అయిదవరేకు - రెండవ పుట

89. భాగీయజుర్వేదీ పరో భాగాష్ట మాంశవాన్। అధీయ్యేతే యజుర్వేదం లక్ష్మీ
90. నారాయణా న్నవా ।55। ప్రత్యేక భాగినావత్ర పౌద్రశ్వకులసంభవౌ మంచ
91. నో రామయాయ్యార్యశ్చ భారద్వాజస గోత్రజౌ ।56। బహ్వృచౌ భాగవానాద్య
92. పరో భాగద్వయాధిపః। తలుః కమలనాభశ్చ భారద్వాజ కులోద్భవౌ ।58। ఆ
93. ద్యో జ్యౌతిషకో భాగీ శాబ్దికో భాగవాన్పరః। మల్లయః పెద్దిభట్టశ్చ యజుర్వే
94. దవిదాం వరౌ ।59। ప్రత్యేక భాగినా వత్ర భారద్వాజస గోత్రజౌ। స్వా
95. మీ భాగాష్టమాంశస్య భారద్వాజోత్ర మాధవః ।60। సగార్గ్యః పెద్దిభట్టోత్ర భా
96. గీయజుషి కోవిద।46a హారితస్యకులోద్భూతాః ప్పెద్ది శింగయ మల్లయాః ।61। య
97. జుర్వేదవిదామాద్యా47 త్రయ ప్రత్యేక భాగినః। అధ్యర్ధ భాగీ యాజుష్కః సూర
98. యో హారితాన్వయః। 62 హారితో భాగవా స్వేదీ వదితే సతతంబుధం ।62। గోవిం
99. దో భాగవాన్। గోవిందయ్యో యజుర్వేదీ భాగవాన్నతి గోత్రజః। ।63।

## ఆఱవరేకు - మొదటిపుట

100. శాలంకాయనగోత్రాం47a శింగనాయ్యో మహాయశాః। యాజుష్కో వర47b
101. హారి భాగీ కామ కొమ్మన గోత్రవాన్ ।64। యాజుష్కో మల్లయ శ్రీమాన్ వి
102. శ్వామిత్రకతాన్వయః। సపాదభాగ షట్కస్య స్వామీ ధార్మిక పుంగ్గవః ।65। త్రయ
103. ః కుశికసంభూతాః కేశనాప్పయకొమ్మయాః। ఏకైకభాగా స్సూత్రాద్యో యాజుష్కా ■
104. హ్వచః పరః ।66। అర్ధభాగీ యజుర్భూమీ మల్లయః కౌశికాన్వయః। శింగ్గయో ధీ
105. మయన్నూరు రధీయంతే వ్రహం యజుః।67। కశ్యపశ్యసగోత్రాస్సు త్రయ ప్రత్యే
106. క భాగినః। శింగయ్య మల్లాప్పయ తల్పగ ప్త్యః పంచాత్ర చైషాం ప్రథమోర్ధ భాగీ
107. పాదా48 భార్ద్వధ కశ్యపాన్య భాగాష్టమాంశా వితరౌచ శిష్టౌ ।68। వెన్నయశింగ్గయాయ్య
108. శ్చ యాజుషౌ కశ్యపాన్వయౌ। ఆద్యోగానాష్టమాంశః49 స్సుత్రాన్యః పాదభాగవాన్।69
109. 49a బుగ్వేదః క్రమచుంభూభామత్ర దీప్తయమల్లయౌ। ఏకైకభాగకేస్యాతాం కశ్యపస్య
110. సగోత్రజౌ ।70। వసిష్ఠ కులసంభూతా మల్లయాక్కయపోతయాః। 49b త్రయప్యాద్వేంశవా

---

సవరణలు: (46A) కోవిద-కోవిదః (47) మాద్యాత్రయ ప్రత్యేక మాద్యాఃత్రయః ప్రత్యేక. (47A) గోత్రాం-గోత్రాంశో (47B) వరహారి-న్నహారి. (48) భార్ద్వ ధకశ్యపా-భాద్వాదకకశ్యపా (49) అష్టమాంశః స్సు-అష్టమాంశః స్త (49A) బుగ్వేదః క్రమచుంభూభా మత్ర-బుగ్వేదక్రమచుంబూభా వత్ర (49B) స్యాంద్వేంశవా-స్యాద్వ్యంశవా

ఛందస్సు: 55, 56, 57, 58, 59, 60, 61 అనుష్టుప్; 62. అనుష్టుప్ (మొదటి పాదములో, 6, 7 అక్షరములను, 2 వ పాదమును వ్రాయమఱచెను.) 64, 65, 66 అనుష్టుప్; 67, ఉపజాతి (1వ వ, 2. 3, 4. ఉ.వ) 68, 69, 70. అనుష్టుప్

## ఆఱవతేకు - రెండవపుట

111. వేము శిష్టౌ ద్వా వర్ధ భాగినౌ |71| భుంజేదర్ధభాగం యాజుష్కోనారుః పారాశరా
112. వ్యయః అప్పయో మల్లయార్యశ్చ విస్సయోమల్లయస్తథా| 72| ఏకైకభాగా యాజు
113. ష్కాశ్చత్వారః కుండినాన్వయాః| సపాదభాగద్వయవాన్ [50] వ్యజభూర్మమ[51] వ్వినాథసూ్య
114. రిగహిమానితార్ధి| కౌండిన్యగోత్రోన్నతకీర్తికేతు ప్రభానురాజ్ఞాం విదుషాం ప్రవక్తా |73|
115. న్నమో[51A]న్నరహరిశ్చైవ కౌండిన్య కులసంభవౌ| అద్యాగ్రవేదీభాగేశః పరోభాగాష్ట
116. మాంశమాన్ |74| దేవయో ఎక్కయః పెద్దిరలాడిః కుండినాన్వయః| అద్య
117. ఃపాదోనభాగోత్ర శిష్టాః స్యుః పాదభాగినః |75| ఏ[52] వేదంభువితంత్ర శాస్త్రమధిరవ్యాఖ్యాన
118. సింహాసనం స్వారుహ్యాఖిల వేదవాక్య విషయో వ్యాఖ్యాయతే సుందరం| కౌండిన్యాన్వయ
119. భూషణం విజయతే శ్రీపెద్దిసూరీతరాం| వక్తా చాస్యహి శాసనస్యమచిరంభాగీ సభా
120. గ్యోదయః |76| అలంకేవ[53]గౌరీ ముకుటేచ గంగా పార్శ్వే కుమారశ్చ వినాయకాద్యాః|
121. సురాసురాద్యారిసగోత్ర శరాన్యో[54] యస్యైక భాగీసహిచోతదేవః |77| యద్గోత్రమ్యవ

## ఏడవతేకు - మొదటిపుట

122. యస్సవేశ యద్విద్యానామనిత్రయః| యంనాభి పంకజాత్సృష్టా దేవో భాగీ స
123. కేశవః |78| ఏవం సంఖ్యాత్రభాగానాం పంచాశత్పంచ చైవతు| హృషీకేశముఖ్యానా
124. ంభాగినాం షష్టిరుచ్యతే| 79 అథసీమాన ఉచ్యంతే ప్రాగాదీనాం దిశాంక్రమాత్ శత్రకతో
125. దిశి| ప్లక్షః సీమా కల్పితరూపమః| 80 అగ్నేరశ్మశమీగడ్డావరకక్షేత్ర దక్షిణే| భోగేసేతు యమా
126. ప్యాథధిశ్చస్సేతురోఫలాత్| 81| తస్యభాగేస్యాద్గావాపీమాపి చాశ్మనః| తస్యాపిదక్షిణే దే
127. శే విస్ఫురంతి మహాశిలా |82| నైరుత్యామథ పాషాణస్తస్య దక్షిణతోదృషత్| తతః కల్గుదు
128. మోవేణువ్యగ్రోధస్తింత్రిణీపునః |83| న్యగ్రోధశ్చ శవేత్సీమాసీవమంజాల దీఘికా|
129. పాశినో వ్యథవాశాయాం న్యగ్రోధో మధుసంమితః |84| ఊషరకృతటాకస్యావ్యాయవ్యాను
130. ధకథ్యతే| పిలసిరతటాకశ్చ తింత్రిణీ తిందుకస్తతః |85| కపిద్ధః శాకటః పంధానందచాపీశాను
131. యః| కౌబేర్యాం తింత్రిణీ వేణుగుంజాః పాలోవ తింత్రిణః |86| గాండలోలన్యమార్గసాం
132. విర్వింది పిచుమందకౌ| న్యగ్రోధశ్శింకలపూండి మార్గస్తు పిచుమందకః |87| ఐశాన్యా
133. మథతన్మార్గే న్యగ్రోధః ప్రపుకనతః| నీవారవ్యాల ప్రవక్ష్యంతి సీమావినిర్ణయః| 88 సంధ్యా

---

సవరణలు : (50) ద్వయ వాన్యజ=ద్వయవాన్యజ; (51) మన్వినాధమారిగహి=మననాధ. సూరిస్సహి (51A) దనరహరి=నృహరి (52) టువేదం–యేవేదం (53) అలంకేచ=అంకేచ; (54) నహచోత=సహిచాత్ర.

ఛందస్సు : (71) అనుష్టుప్; (72) అనుష్టుప్ (1. పాదము, 2. పాదములో మొదటి నాలు గక్షరములు వ్రాయవలెను) (73) (3 ఇ. వ. 4 ఉ. వ) వైపరీత్యోపజాతి; 74, 75 అనుష్టుప్ (76) శార్దూల విక్రీడితం. (77) వ్యత్యస్తోపజాతి. (1, 3, 4, ఇ. వ. 9. ఉ.వ) 88. అనుష్టుప్

## ఏడవ తేకు - రెండవ పుట

134. మంటప దేవతాలయసరోధన్యాలయైః రంకితో రమ్యారామగణశ్చ సద్విజవర
135 వ్యాఖ్యానశాలాంచితః । దోనేవల్యభిధః పురావిజయతే వాలాంకపల్లీయు
136. తో లక్ష్మీభీమవరాగ్రహారతిలకో గ్రామోధునాకీర్త్యతే ।89। సామాన్యోయ
137. ం ధర్మసేతు నృపాణాం కాలేకాలే పాలనీయో భవద్భిః। ఇత్థం జల్పన్ భావిన
138. ః పార్థివేంద్రాన్ భూయో భూయో యాచతే రామచంద్రః॥90
139. 7 శ్రీరామచంద్రాయనమః. వల్లభుగ్రాలు—

### అ ను వా ద ం :

సర్వప్రాణులు ఎవ్వరిని సమస్కరించి సర్వ కార్యసిద్ధిని పొందుచున్నారో, గౌరీమనోహరుడైన ఈశ్వరుని చిత్తాంబుధిని పొంగించు వాడెవ్వడో ఆ శుభానమదు ఐశ్వర్యమును పోషించుగాక (1) ఎవ్వని దంష్ట్రాంకురముల దవిలి ఛత్రమువలె భూదేవి ప్రకాశించెనో అట్టి భగవల్లీలావతారుడైన శ్వేత యజ్ఞ వరాహుడు శుభములతో గాపాడుగాక (2) దిక్కులు పుష్పదళములుగాను మేరు పర్వతము కర్ణికగాను ఆకాశగంగయనెడి మకరందముతో గూడుకొన్నదిగాను నాగరాజైన వాసుకి తామరతూడు గను తేజరిల్లిన భూదేవి సిరులతో రక్షించుగాక. (3) సకలసస్యప్రవర్ధనియు శివజటాజూటము నకు అలంకారభూతమును పరిశుద్ధమును అవినా యియునగు చంద్రకళయగు జాబిల్లి సస్యవృద్ధిని కలుగజేయునుగాక (4) చమువులతల్లియగు పర స్వతికి కృతమస్తకాంజలినై తత్కృపాకటాక్షమున ప్రసన్నశబ్దములతోను గంభీరవాక్యములతోను యొప్పు చున్న గ్రామశాసనమును బలుకుచున్నాను (5) పద్మ నాభుని నాభికమలమునుండి బ్రహ్మయు, అతని మనసునుండి అత్రిమహామునియు, అతని నేత్రకమల ములనుండి అమృతకిరణమయుండగు చంద్రుడును. అతనివలన గొప్ప బుద్ధిమంతుడగుబుధుడును. అతనికి అజేయుడైన పురూరవుడును గలిగిరి. (6-7)

ఆ వంశమున సర్వ జనాశ్రయ భూతుడైన అనంతవర్మయను చక్రవర్తి పుట్టెను. అతని(భార్య) రాణి భోగావతియను పేరుగల రాచబిడ్డ. అతడు తొలుత మణినాగపురమును ప్రతాపవంతుడై పాలిం చెను. (8) అతడు సర్పాకృతిగ మానవ గర్భమున జనించినను రాణీ భోగావతి తపఃఫలమున రాజై రాజ్యమేలెను. తదారభ్య ఆ వంశము 'నాగవంశము' అనుపేర ప్రసిద్ధమయ్యెను. (9) ఇట్టి నాగవంశ మున 'కాశ్యప' గోత్రభూషణుడైన 'భీమరాజు' ఉదయించెను. అతని నివాసభూమి 'వేములనాడు' దేశము. (10) అయ్యది పరిపక్వ ఫలములతో గూడు కొన్నదియు, తోటలు దేవాలయములు సెలయేళ్లతో గూడుకొన్నదియు, వనగజములు (అడవి యేనుగులు) గుంపులతో గూడుకొన్నదియు పుణ్యవంతమైన తపోవనమునై యున్నది. (11) వింధ్యాద్రి నివాసమున గల్గు దోషములను పరిహరించునటిదియు నైన 'రంభ' అనుపేరుగల దివ్యతీర్థము తీర్థనాథునితో గూడుకొన్నదియై గౌతమీనది సెలయేటియొద్దున గలదు. (12) భీమ మహీపతి శోభాయుక్తమైన ఆదేశమున చక్కని రంభాపురమును రెండవ రాజ ధానిగా జేసెను (13) తొలుదొల్త ప్రసిద్ధికెక్కిన 'గండవాడ' అనుపట్టణమును ఆపిదప రంభాపురము క్రొత్త రాజధానిగను నాగవంశరాజులకు పట్టాభి షేకార్హమై విరాజిల్లినవి. (14) అచ్చట రథహస్త్య

ఛందస్సు : 89. శార్దూల విక్రీడితం. 90. ఇ. వ.

శ్వపదాతులగు చతురంగ బలములతో నిరంతర మెడ
తెరపిలేనిదై చక్కని శుద్ధాంత సౌధములతో
గూడిన రాజమార్గములును గలవు. (15) చంద్ర
సూర్యకాంతమణులచే నిర్మింపబడిన శుద్ధాంతభిత్తి
కలాపంబులచే ప్రకాశించుటవలన కలువలు తామరలు
కొద్దిగా వికసించుట మూలమున దివారాత్రి
విభాగములు వారికి తెలియులేదట (16) ఆతని స్థిర
మైన రాజ్యలక్ష్మి సంపదలతో నతిశయించుటచే
'తాళ్యాటి' సరిహద్దు గ్రామములు ముఖ్యమైనవి
గాను, అనువైనవిగాను అయినవి. (17) ఆ భీమరాజా
వకు అజేయుడైన 'వల్లభుడు' అను పుత్రుడు కలుగగా
అతని జాతకర్మాదుల జేయించెను (18) వేద వేత్త
యగు పురోహితునిచే విద్యల నధ్యయనము జేయించి
'సితియమ్మ'ను వివాహముగావించి రాజ్య చిహ్నముల
ప్రసాదించెను. (20) నైసర్గికమగు తపోబలముచే
శేముషీ ధురంధరుడైన ఆవల్లభ మహారాజు బల
ప్రతాప వంతుడై చిరకాలము రాజ్యమేలెను. (21)
మణినాగపురాధీశుడగు వల్లభేంద్రుడుసభాస్థలిలో ఎటు
వైపు తిరిగి కూర్చొనిన అటువైపు రాజులందరును
పలాయితులైరి (22) వల్లభుడు ఆ విధముగా రాజ్య
మును పాలించెను. అతనికి 'ఎఱ్ఱభీమరాజు' అను కుమా
రుడు పుట్టెను. (23) అతని జాతకర్మాదికముల నెర
వేర్చి రాజ్యము నిచ్చెను. తన కులవ్రతాచారము ప్రకా
రము యజ్ఞదీక్షను బొందెను (24) అభిషిక్తుడైన
ఆ యెఱ్ఱభీమరాజు ప్రతివక్షులైన సింధుసేతు
మధ్యస్థ సకల ధరాధినాథులను శాసించి ప్రతా
పముచే ధనళాంకక్షీముడయ్యెను. (25) అతనికి
శక్తిత్రయమువలె మల్లమ, కొప్పమ, లక్ష్మీదేవులను
ముగ్వురు భార్యలు కలరు. (26) కౌసల్య దశరథ
మహారాజువలన రామచంద్రుని పొందినటుల మల్ల
మాంబ ఆ యెఱభీమునివలన కీర్తివంతుడగు 'ఇమ్మ
డింద్రుని' బడసెను కైకేయి భ్రాతృభక్తిగల భరతుని
వలె కొప్పమ 'మల్లినాథుడు' అను కుమారుని
గనెను. సుమిత్ర సర్వలక్షణ సంపన్నుడగు లక్ష్మణుని
గన్నటుల సకల గుణగణ సంపన్నుడగు వల్లభేంద్రుని
లక్ష్మిదేవి గనెను. (27) కుమారవృత్తాంతమును
విని రాజు వసిష్ఠసమానుడైన పురోహితునిచే బ్రాహ్మ
ణులను పిలిపించి తన రాజచిహ్నములుతప్ప తక్కిన
దంతయు దానమిచ్చెను. (28) వేదములు, అస్త్ర
ములు, శాస్త్రములు సమస్త నీతి శాస్త్రములు
కావ్యపురాణేతిహాసాది ధర్మశాస్త్రములు సకలవిద్యలు
పూర్వజన్మ సంస్కార ఫలితముగ నతిశ్రమము
గాక ఆ కుమారులు పొందగలిగిరి. (29) సర్వ
శుభులగు దేవతలందు ఇంద్రునివలెనే గంగా
హిమసేతు మధ్యస్థమైన భూమిని న్యాయముగ బరి
పాలించి కాలక్రమమున భీమరాజు జరాక్రాంతు
డయ్యెను. (30) ప్రముఖులైన రాజులచే పొగడ
బడినవాడును సామ్రాజ్యభారమును వహింపదగిన
వాడును, జ్యేష్ఠుడునైన ఇమ్మడింద్రుని ప్రముఖ
బ్రాహ్మణ మహర్షుల సమక్షమున పట్టాభిషేక
మొనరించెను. (31) అప్పటినుండియు ఆ భీమరాజు
తన భార్యలతో అగ్నిహోత్ర సహితుడై పురము వెలు
పలనున్న ఉపవనమునందు మునీంద్రుడై చిరకాలము
నివసించెను (32) అట్లు పట్టాభిషిక్తుడైన ఇమ్మ
డింద్రుడు ద్విజులకు చంద్రుడు సంతోషము కలి
గించునట్లు రాజలోకమును చక్కగా పాలించెను.
(33) తన చేతియందున్న ఖడ్గధారచే విరోధి వర్గ
మును తన భుజములలీటదీఱ నటుల విదళించి
యుద్ధముచేయుట కెల్లప్పుడును సిద్ధపడుచుండును.
(34) 'సితకరగండడు' 'సితకరరేబాడు' అను
బిరుదములతో గొప్పవాడు, ఇంద్రునివంటి పుణ్యా
త్ముడు గుణగణములచే గొప్పవాడు, రాజులతో యుద్ధ
మొనరించువాడు పెద్దలచే సేవింపబడినవాడు నాగ
(35) అతనికి రాణియందు చక్రవర్తి: భీమరాజు
అను ఇద్దరు పుత్రులు కలిగిరి. కుమారస్వామివంటి
ఆ పుత్రులకు జాతకర్మలను నిర్వర్తింపజేసి విద్యా
ధ్యయనాదులగావించి లోకమున చిరాయువుగా వర్ధిల్లు
నట్లు గావించెను. (36, 37) ఇమ్మడి రాజవర్యుడు
పుత్రునికలిగియున్న వాడైనను ఆ నాగవంశ

చక్రవర్తి తన యమజన్ముడైన వల్లభరాజును పట్టము గట్టుటకై తీసికొనివచ్చెను. (38) నీతి కోవిదుడైన ఆ ఇమ్మిడిరాజవర్యుడు తనకాలము దీఱగానే విద్యావంతుడును సోదరుడునైన వల్లభరాజును ఆ రాజ్యమునునుంచెను. (39) స్త్రీలకు మన్మథునివంటివాడు, సుజనులకు చంద్రునివంటి వాడు, యుద్ధమున అర్జునుడు, వైభవము శ్రీ మహావిష్ణువు, రాజులకు శ్రీరాముడు, శత్రువులకు భీముడు, సహచరులకు సర్వసముడుగా నొప్పెను. (40) ఆ వల్లభరాజవర్యుడు పిన్నవయసుననే వేములవాడ రాజ్యమునకు పట్టాభిషిక్తుడైనను, ఆత్మవిద్యాపరాయణుడు, కీర్తియే ఆకారముగాగల వాడునై వర్తిల్లెను. (41) నగర ద్వారములందు అవసరముల గనిపెట్టి సేవల జేయుటకై రాజులెల్లరు వేచియుందురు. ఈ వల్లభరాజు తనచే జయింపబడిన విరోధిరాజలోకమునకు ప్రచండ భానునివంటి వాడయ్యెను. (42) అతనికీర్తిచే లోకమంతయు ధవళకాంతులు వ్యాపించుటవలన క్రొత్తగా వచ్చినవారు మార్గముతెలియక అడుగుకొనవలసినవారై బాధపడుచుండిరి. (43) శరసంధాన సమయమున 'సింధుగోవింద' బిరుదాంకితుడై యుద్ధమున శత్రువుల సంహరించుటకో సంధిగావించి కాపాడుటకో శత్రు సమూహమున ప్రవేశించుచుండును (44) ఎవ్వని కృపాకటాక్షము లవలేశమైన కలుగునాయని యాచించు సకలదేశ నాయకులును వైభవమందుచున్నారో అట్టి ప్రతాపశాలియగు నా వల్లభరాజేంద్రుని వైభవమెవ్వరు వర్ణింపగలరు (45).

అట్టి వల్లభమహారాజు సమస్త శ్రేష్ఠమైన దానములను గావించి మనోరథసిద్ధికై గ్రామదానము జేయ నుద్యమించెను. (46) క్షయ, వృద్ధి, స్థానము లనెడి త్రివర్ణశాస్త్రనిపుణులై, కుశాగ్రబుద్ధులైన పురోహితముఖ్యులను, విద్వత్కవీంద్రాది ఆశ్రిత పారిజాతమైన మల్లినాథసూరిని జూచి (47) వేద, శాస్త్రాదివిద్యల జక్కగా బరీక్షించి మిన్నుముట్టిన సంతోషమున అట్టివారిని తీసికొనిరావలెనని ఆజ్ఞాపించెను. (48) శ్రీ వల్లభేశ్వరుడు 'వేంగురునాడు' దేశమున గౌతమీప్రాక్తటమున రెండుక్రోసుల దూరమందున్న కోరుకొండపురమునకు ముందుభాగమునందు (49) 'వాల్లంక', 'దోనేపల్లి' అను రెండుగ్రామముల నేకము గావించి అష్టైశ్వర్యములతో చక్కగా వృద్ధిపొందు నిమిత్తమై విద్వద్వరేణ్యులైన ఏబదియైదుగురకు ఇచ్చుటకు సంకల్పించెను. (50) శకసంవత్సరములు 1276 (క్రీ శ. 1276 + 78=1354) నందు శ్రావణమాసమున సంభవించిన చంద్రగ్రహణకాలమందు (నాభస్యచంద్రగ్రహే) తన తల్లిదండ్రులైన 'లక్ష్మిదేవి భీమరాజుల' ప్రీతికొఱకు సూర్యచంద్రులున్నంతకాలముండునటుల నాగవంశాభి వృద్ధి కలుగుటకై 'లక్ష్మి భీమవరాగ్రహారము' అనుపేరున దానముచేసెను. (51) ఆ భాగినులయొక్క విద్య, నామము, గోత్రము, అంశలను శ్లోకము, అర్ధ, పాదములచేగాని అంతకు కొంచెము హెచ్చుతగ్గులందుగాని స్పష్టముగా జెప్పబడును. (52)

| వరుస నెం | గోత్రం | నామధేయం | వేదం | సూత్రం | విద్య | భాగం | శ్లోకం |
|---|---|---|---|---|---|---|---|
| 1. | శ్రీ వత్సస | పెద్దయ |  |  | యాజుష్కః | 1 | 53 |
| 2. | ,, | వీరయ |  |  | ,, | 1 | ,, |
| 3. | ,, | అన్నయ |  |  | ,, | 1 | ,, |
| 4. | ,, | అప్పయ |  |  | ,, | 1 | ,, |
| 5. | వత్సస | గంగయ |  |  | ,, | $\frac{1}{2}$ |  |
| 6. | వాధూలస | రామయ | యజుః |  | జోస్యః | 1 |  |
| 7. | ,, | పెద్దయ |  |  |  | $\frac{1}{8}$ | 54 |
| 8. | ,, | లక్ష్మీనారాయణ | యజుః |  |  | 1 |  |
| 9. | ,, | అన్నమ |  |  |  | $\frac{1}{8}$ | 55 |
| 10. | భారద్వాజస | మంచనః |  | ప్రాదశ్వ |  | 1 | 56 |
| 11. | ,, | రామయః |  | ప్రాదశ్వ |  | 1 |  |
| 12. | ,, | తలుః |  | బహ్వృచ |  | 1 |  |
| 13. | ,, | కమలనాభః |  | ,, |  | 2 | 57 |
| 14. | ,, | శాద్వికః |  |  | జ్యోతిషః | 1 |  |
| 15. | ,, | పెద్దిభట్టః | యజుః |  |  | 1 | 58 |
| 16. | ,, | మల్లయః | ,, |  |  | 1 |  |
| 17. | ,, | మాధవః |  |  |  | $\frac{1}{8}$ | 59 |
| 18. | గార్గేయస | పెద్దిభట్టః | యజుః |  | యాజుష్కః | 1 | 60 |
| 19. | హరితస | పెద్దయః | ,, |  | ,, | 1 |  |
| 20. | ,, | సింగ్గయః | ,, |  | ,, | 1 |  |
| 21. | ,, | మల్లయః | ,, |  | ,, | 1 |  |
| 22. | ,, | సూరయః | ,, |  | యాజుష్కః | $1\frac{1}{2}$ | 61 |
| 23. | ,, | హరితః |  |  | బుచః | 1 |  |
| 24. | అత్రేయస | గోవిందః | యజుః |  |  | 1 | 62 |
| 25. | శాలంకాయనస | సింగనార్య్యః |  |  | మహోయశః | 1 | 63 |
| 26. | కామకాయనస | నరహరిః |  |  |  | 1 |  |
| 27, | వైశ్వామిత్రస | మల్లయః |  |  | యాజుష్కః<br>ధార్మికః | $6\frac{1}{4}$ | 64 |
| 28. | కౌశికస | కేశవః |  | బహ్వృచ | యాజుష్కః | 1 | 65 |
| 29. | ,, | అప్పయః |  |  | ,, | 1 |  |
| 30. | ,, | కొమ్మయః |  |  | ,, | 1 |  |
| 31. | ,, | మల్లయః | యజుః |  |  | $\frac{1}{2}$ |  |
| 32. | కాశ్యపస | సింగ్గయః | యజుః |  |  | 1 | 66 |
| 33. | ,, | భీమయః | ,, |  |  | 1 |  |
| 34. | పావాడస | సింగయః |  |  |  | $\frac{1}{2}$ | 67 |
| 35. | చాద్లాధస | మల్లయః |  |  |  | $\frac{1}{8}$ |  |
| 36. | కాశ్యపస | అప్పయః |  |  |  | $\frac{1}{8}$ |  |
| 37. | ,, | తల్పః |  |  |  | $\frac{1}{8}$ |  |
| 38. | ,, | అగస్త్యః |  |  |  | $\frac{1}{8}$ |  |
| 39: | ,, | వెన్నయః |  |  |  | $\frac{1}{8}$ | 68 |
| 40. | ,, | సింగ్గయః |  |  | యాజుష్కః | $\frac{1}{4}$ |  |
| 41. | ,, | దీప్తయః |  |  |  | 1 | 69 |
| 42. | ,, | మల్లయః | ఋగ్వేదః |  | క్రమం | 1 |  |
| 43. | వాసిష్ఠస | మల్లయః |  |  |  | 2 | 70 |

| వరుస సం | గోత్రం | నామధేయం | వేదం | సూత్రం | విద్య | భాగం | శ్లోకం |
|---|---|---|---|---|---|---|---|
| 44. | ,, | అక్కయః | | | | $\frac{1}{2}$ | |
| 45. | ,, | పోతయః | | | | $\frac{1}{2}$ | |
| 46. | పారాశరస | నారయః | | | యాజుష్కః | $\frac{1}{2}$ | 71 |
| 47. | కౌండిన్యసః | అప్పయః | | | యాజుష్కః | 1 | 72 |
| 48. | ,, | మల్లయః | | | | 1 | |
| 49. | ,, | విస్సయః | | | | 1 | |
| 50. | ,, | మల్లయః | | | | 1 | |
| 51. | ,, | మల్లినాథః | యజుః | | | $2\frac{1}{4}$ | 73 |
| 52. | ,, | అన్నమః | | | | 1 | 74 |
| 53. | ,, | నరహరిః | | | | $\frac{1}{8}$ | |
| 54. | | దేవయః | | | | $\frac{3}{4}$ | 75 |
| 55. | ,, | ఎక్కయః | | | | $\frac{1}{4}$ | |
| 56. | ,, | పెద్దయః | | | | $\frac{1}{4}$ | |
| 57. | , | అల్లాడిః | | | | $\frac{1}{4}$ | |

ఈవిధముగా తంత్రశాస్త్రవ్యాఖ్యానిసింహాసనాధిష్ఠితయు వేదవాక్యవిషయసుందరుడును కౌండిన్యగోత్రభూషణుడును పరులజయించినవాడునగు పెద్దసూరి ఈ శాసనవిభాగములజెప్పెను. (76) అంకమున గౌరీదేవియు, శిరమున గంగయు, పార్శ్వభాగముల కుమారస్వామి వినాయకుడు మొదలైనవారును సురాసురప్రమథగణయుక్తుడునగు కైలాసేశ్వరదేవునకు ఒకభాగము, (77) విద్యలకు నిలయులైన సమస్త మహర్షులుకలవాడును, నాభికమలమున సృష్టికర్త యగు బ్రహ్మను ధరించినవాడుమనగు అనంతపద్మనాభస్వామియగు కేశవస్వామికి ఒకభాగము, (78) ఈవిధముగా ఏబదియైదు సంఖ్యామాత్రమైన భాగములను ఈశ. కేశవ ముఖ్యభాగులగు అఱువది భాగస్తులకు జెప్పబడినది. (79) ఇక అవధులు తూర్పుదిశ మొదలు క్రమముగా చెప్పబడును. తూర్పున జువ్వి పేములు గలతావు; ఆగ్నేయమున తాలు, జమ్మిచెట్లుతో గూడిన తావు; దక్షిణమున ఉలిమిడి, చండ్రచెట్లుగలతావు; కొండరాళ్లుగలతావు; దానికి దక్షిణమున పెద్ద తాతిగడ్డ (82) నైరృతిని పాషాణము. దానికి దక్షిణమున తాతిగడ్డ; అచ్చట కలివృక్షములగు వెదురు, మఱి, చిన్తలు గలతావు; (83) రావి, కడిమిచెట్లుతో గూడిన దిగుడుబావి; పడమటను రావి, ఇప్పచెట్లు గలతావు. (84) వాయువ్యమున చవిటిపఱ్ఱవెరువు; మంచినీటి చెఱువు; చింత, తుమ్మచెట్లుగలతావు; వెలగ కలుజువ్వలతో గూడి బండ్లు నడచుటకు వీలైన తాతిత్రోవ; ఉత్తరమున చింత, వెదురు. గురువింద, పెద్దచింతలుగలతావు; పెద్దతాళ్లతోనున్న ఎర్రవంద వేపచెట్లు గలతావు. 'ఓంకాలపూడి' మార్గమందున్న మఱ్ఱి, వేపలుగలతావు. ఈశాన్యము జువ్వి చెట్లుగలమార్గము. నివ్వరి ధాన్యము పండెడి పల్లము ఇది సరిహద్దు నిర్ణయము. సంధ్యామంటము, దేవాలయము, సరోవరము, చక్కనితోటలు, బ్రహ్మవిదులైన బ్రాహ్మణులు, బ్రహ్మవిద్యాశాలురతో గూడిన 'వాల్లంకపల్లి'తో గూడిన 'దోనేపల్లి' అను గ్రామము 'లక్ష్మీభీమవరము' అన్నపేరున ప్రసిద్ధికెక్కెను (89) రాబోవుకాలమున పాలించు ప్రభువులు ధర్మపరాయణులై పాలింతురుగాక అని రాబోవు రాజులకు ప్రార్థనాపూర్వకమైన శ్లోకము వాల్మీకి విరచితము......శ్రీరామునకు నమస్కారము. వల్లభహస్తముద్రిక.

(సశేషం)

# ఫస్టు తారీఖు

## శ్రీ తాళ్లూరు నాగేశ్వరరావు

[గుర్నాథం ఇంటి వసారా. ఎదురుగ్గా ద్వారం ఉంటుంది. ఆ ద్వారానికి ఓ కర్టన్ గుడ్డ. ద్వారానికి అటు రెండు కుర్చీలూ ఇటు రెండు కుర్చీలూ వుంటాయి. అవి పాతకొయ్యకుర్చీలు. ఒకటి రెండు కుర్చీలకు చేతులుండవు. గోడమీద ఓ పాత కేలండరు వుంటుంది. రంగానికి ఎడమచేతివైపు వీధి వాకిలికి దారితీస్తుంది. సమయం సాయంకాలం. తెర లేచేసరికి స్టేజిఅంతా ఖాళీగా వుంటుంది.

కోటిలింగం ప్రవేశిస్తాడు. వయస్సు నలభై అయిదేళ్లుంటాయి. కట్టూ బొట్టూలో వ్యాపారి అన్న విషయం ఇట్టె తెలుస్తుంది]

**కోటిలింగం :** గుర్నాథంగారూ! గుర్నాథంగారూ!

**ఒక స్త్రీ :** (లోపల్నుంచి) ఎవరూ!

**కోటిలింగం :** నేనండీ!

**ఒక స్త్రీ :** (లోపల్నుంచి) ఏంటీ!

**కోటిలింగం :** అయ్యో, మీ విడ్డూరం విరగబడి పోనూ! నా గొంతును గుర్తుపట్టలేదటండీ!... కిరాణా కొట్టు కోటిలింగాన్ని. అయినా అప్పిచ్చిన వాడు పుచ్చుకున్న వారికెందుకు జ్ఞాపక ముంటాడులెండి — నా పిచ్చి కాకపోతే!

**ఒక స్త్రీ :** (లోపల్నుంచి) కూర్చోండి.

**కోటిలింగం :** నేను బస్సుదిగి మీ ఇంటికి బంధువుగా రాలేదు. నాకీ మర్యాదలేమీ అక్కర్లేదు. నాకు కావాల్సింది బాకీవసూలు. ఇవాళ ఫస్టు తారీఖని పుట్టెడాశతో వచ్చాను (చంకలో వున్న పద్దుల పుస్తకాన్ని తెరిచిచూస్తూ) పాతబాకీ పాతికరూపాయల పదిహేను పైసలూ కొత్తబాకీ పద్దెనిమిది రూపాయల పది పైసలూ మొత్తం వెరసి నలభై మూడు రూపాయల ఇరవై అయిదు పైసలూ ఇవాళటి రోజున యిచ్చేస్తామని గతనెల రెండో తారీఖునుంచీ చెబుతున్నారుగా! అంచేత కంచన్ గా రెక్కలుకట్టుకు వాలాను. బాకీ రద్దు చేయనిదే బయటికి వెళ్లేదిలేదు.

**ఒక స్త్రీ :** (లోపల్నుంచి ఇంకా వారు ఆఫీసునుంచి రాలేదండీ!

**కోటిలింగం :** ఆరుగంటలు కావస్తోంది. ఇంకా రాకపోవడమేమిటి? ఆశ్చర్యంగా వుంది.

**ఒక స్త్రీ :** (లోపల్నుంచి) వచ్చే వేళైంది. కూర్చోండి.

**కోటిలింగం :** (కుర్చీలో చతికిలబడుతూ) కూర్చుంటానమ్మా! కూర్చుంటాను. అరువు పెట్టిం

తర్వాత పరువుకోసం ప్రాకులాడి లాభం లేదు. బాకీ చేతికొచ్చేవరకూ బాశీపట్టి వేసుక్కూర్చోవల్సిందే!

(వెంకటప్పయ్య ప్రవేశం. వయస్సు యాభై యేళ్లు. ఇల్లు అద్దెకిచ్చినవాడు.)

వెంకటప్పయ్య : గుర్నాథంగారూ!

(వాకిటదగ్గరకువెళ్లి కర్టెన్ తొలగించి చూస్తాడు)

కోటిలింగం : ఇంట్లోలేరు. నేనూ వారికోసమేవచ్చి కుర్చీకి కూడాకులాగ అంటుకు పోయాను. మీ రెవరు?

వెంకటప్పయ్య : ఈ ఇంటి ఓనర్ని. ఇల్లు అద్దెకిచ్చి అరికాళ్లు అరిగిపోయేట్టు తిరుగుతున్న అభాగ్యుణ్ణి.

కోటిలింగం : ఓహో! ఇవాళ ఫస్టుతారీఖని పరుగెత్తు కొచ్చారా? బాగుబాగు.

వెంకటప్పయ్య : తమరొచ్చినపని తెలుసుకోవచ్చా?

కోటిలింగం : నేనొచ్చినపనీ, మీరొచ్చినపనీ ఒక్కటే! కాకపోతే కాలాలువేరు. కూర్చోండి. ఏం చేస్తాం? పుచ్చుకున్నప్పుడు పుత్రుడు పుట్టి నంత సంతోషం ఇచ్చేటప్పుడు ఇంటాయన పోయినంత దుఃఖంగావుంది వ్యవహారం.

వెంకటప్పయ్య : సహజంగా చెప్పారు.

కోటిలింగం : పామెతలకేం ఎన్నైనా చెప్పొచ్చు. పద్యు పుస్తకాల్లో జమలేపడడంలేదు. అప్పు తీసు కున్నవాడు పప్పుకూడు తింటున్నాడు. ఇప్పిచ్చిన వాడు ఉప్పునీరు తాగుతున్నాడు

వెంకటప్పయ్య : నూరుపైసలా నిజం పలికారు.

కోటిలింగం : అబద్ధంవల్ల ఆదాయం లేనప్పుడు వ్యాపారస్తుడెప్పుడూ నిజమే పలుకుతాడు... కూర్చోండి. అయ్యగారు ఆఫీసునుంచి వచ్చే దాకా ఆవలిస్తూ కూర్చోవల్సిందే!

వెంకటప్పయ్య : (నిట్టూర్పు విడుస్తూ కూర్చుం టాడు) ఈ రోజుల్లో ఇళ్లు అద్దెకివ్వడం కంటె ధర్మసత్రాలుగా మార్చి అర్ధ రూపాయో వసూలుచేసికోవడం మేలు. ఇట్లా ప్రతి ఫస్టుతారీక్కూ, ఆపైన ఎప్పుడు రమ్మంటే అప్పుడూ పెంపుడుకుక్కలాగ తిరగడం పూర్వజన్మలో చేసికున్న పాపమే.

కోటిలింగం : మా పనీ అట్లాగే. వుంది వానాకాలం వచ్చి ఎండాకాలం ఎచ్చిగా. అక్కడ టోకు వ్యాపారస్తునిదగ్గర వందలూ, వేలూ గుమ్మ రించి సరుకు తేవడం, ఇట్లా వాడకం దారులకు అరువులు పెట్టి బరువుగా గుండెలు బాదుకోవడం. వసూళ్లకయ్యే ఖర్చులు లాభాన్ని గూబలోకి తెస్తున్నాయి.

వెంకటప్పయ్య : అసలింతకూ ఈ మహానుభావుడు ఇవ్వాళ ఇంటికొస్తాడో, రాడో!

కోటిలింగం : (తుళ్లిపడి) అదేమిటి?

వెంకటప్పయ్య : జేబులో జీతం వుంటుందిగా. బుద్ధి ఏ బురదలోకో లాగవచ్చు. అటే ఆఫీసునుంచి ఏ క్లబ్బుకో నేరుగా వెక్కొయ్యొడుగదా!

కోటిలింగం : ఆ అలవాటుకూడా వుందేమిటి?

వెంకటప్పయ్య : అది అలవాటేమిటి!.........ఈ రోజుల్లో ఫ్యాషన్. సాంఘికమైన హోదా! పేకాటా, బుడ్డీ, బొమ్మా - ఈ మూడూ మోడరన్ మగవాడి లక్షణాలు. ఆ లక్షణాలు లేనిదే ఆధునిక సమాజంలో అడుగు ముందుకు వేయలేడు. మరి గుర్నాథం సంగతి నాకు నిజంగా తెలియదనుకోండి!

కోటిలింగం : తెల్సుకోవడం కష్టం! ఈ రోజుల్లో ప్రతివాడూ 'డబుల్ యాక్షన్' చేస్తున్నాడు. ఒకడే రెండు రకాలైన జీవితాల్ని అనుభవి స్తున్నాడు. ఒకటి పబ్లిక్కు, రెండోది ప్రైవేటు. పబ్లిక్కుగా భార్య వుంటుంది.

(ప్రైవేటుగా బొమ్మ వుంటుంది. పబ్లిక్కుగా సోడా తాగుతాడు. ప్రైవేటుగా ఆ సోడాను విస్కీలో కలుపుకుతాగుతాడు. పబ్లిక్కుగా పెద్దమనిషి. ప్రైవేటుగా పొట్టిమనిషి...... ఇంతకూ గుర్నాథం మీరికేపాటి బాకీ?

వెంకటప్పయ్య: మూడు మాసాల బద్దె ఇవ్వాలి. అంటే పది రూపాయలు తక్కువగా వంద. మీకు?

కోటిలింగం: అందులో సగం.

వెంకటప్పయ్య: పెద్దపద్దే.

కోటిలింగం: రెండు నెలలనుంచీ మొండిచెయ్యి చూపెడుతున్నాడు.

వెంకటప్పయ్య: నాకు మూడునెలలనుంచీ.

కోటిలింగం: అసలు గుర్నాథానికి జీతం ఎంతొస్తుంది?

వెంకటప్పయ్య: ఆఁ!......ఎంతోస్తుంది! అప్పర్ డివిజన్ క్లర్కు. అసలూ, ఇంక్రిమెంట్లూ, బత్తేలూ, భరణాలూ అన్నీ కలిపి మూడొందలు లోపే. పైగా ఇందులో ఇన్సూరెన్సూ, పి. యఫ్; సి. డి. యస్. నా బొందా బోలె మొదలైన కోతలూ, కట్‌లూ పోగా చేతికి ఏ రెండొందలొస్తాయో!

కోటిలింగం: మరి గుర్నాథానికి బల్లకింద బిజినెస్ ఏమైనా వుందా?

వెంకటప్పయ్య: అదుంటే అప్పులవాళ్లకి అవస్థలు దేనికి? మానవుడికి ఆ నేర్పులేదు. పచ్చి అమాయకుడు.నీళ్లనీళ్లే. పాలు పాలే. రెండింటినీ కలపడం చేతగాదు.

కోటిలింగం: మరెట్లా బతుకుతాడు? ఈ అప్పుల వూబిలోంచి ఎట్లా బయటపడతాడు?

వెంకటప్పయ్య: ఆ పరమాత్ముడికే తెలియాలి. అసలింకా గుర్నాథం ఆఫీసునుంచి రాకపోవడానికి కారణమేమిటి? జీతాలిచ్చేరోజుగదా— పెందలాడే రావాలి.

(గంటయ్య ప్రవేశం. వయస్సు ముప్ఫైఅయిదేళ్ళుంటాయి.)

గంటయ్య: గుర్నాథంగారు ఇంట్లో లేరా?

కోటిలింగం: ఆయన ఇంట్లోవుంటే మేం ఇక్కడ 'క్యూ'లో ఎందుక్కూర్చుంటాం?

గంటయ్య: ఇంకా ఆఫీసునుంచి రాలేదన్నమాట.

కోటిలింగం: అన్నమాటే!

వెంకటప్పయ్య: తమరెవరో, నామధేయమేమిటో, ఏ పనిమీద వేంచేశారో—తెలుసుకోవచ్చా?

గంటయ్య: వచ్చు. వచ్చు. నాపేరు గంటయ్య. మా నాన్నపేరు పెంటయ్య. మా నాన్నగారికి పూలదుకాణం వుండేది. పువ్వుల పెంటయ్యంటే ఈ పట్టణంలో ఆరేళ్ల పిల్ల దగ్గర్నుంచీ అరవైయేళ్ల పండుముత్తయిదు వరకూ పెదవులమీద కదిలే పేరే. ఆయన సుపుత్రుణ్ణి నేను. కాని నా బిజినెస్ వే . కట్టెల దుకాణం. నేను బి. ఏ చదివినా— కాలంకర్మం కల్సిరాకపోవటాన కట్టెలకొట్టే శరణ్యమైంది ఈ ఇంటి పెద్దమనిషి పోయిన శివరాత్రికి ఓ పావుటన్ను సర్వీకట్టెలు అప్పుమీద తీసికెళ్లాడు. అదుగో ఇదుగోఅంటూ ఆరునెల్లు గడిపాడు. ఈ ఫస్టుతారీఖుకు తప్పకుండా ఇస్తానన్నాడు. అందుకే వచ్చాను.

కోటిలింగం: (బరువుగా) ఒకళ్లకిద్దరు. ఇద్దరకు ముగ్గురు.

గంటయ్య: మీరూ నా పనిమీదే వచ్చారన్నమాట.

వెంకటప్పయ్య: వేరే చెప్పనక్కర్లేదు.........కాని అసలు మనిషే అయిపులేడు.

కోటిలింగం: అందరి కళ్ళూ ఆయనకోసం, ఆయన జీతంకోసం వెతుకుతున్నాయి.

గంటయ్య: జీతం ఎంతొస్తుందో!

వెంకటప్పయ్య: ఎంతొచ్చినా మన బాకీలకు చాలదు. హళ్లికిహళ్లి సున్నకుసున్న.

**కోటిలింగం :** అప్పు ఆదాయాన్ని మించిందంటే నిండా మునిగినట్లే!

**వెంకటప్పయ్య :** నిండా మునిగినవాడికి చలి వుండదు. చలిలేనివాడికి భయముండదు. భయంలేనివాడు మంత్రికంటె మొండివాడు. ఆ మొండివాడి దగ్గర్నుంచి మన బాకీ లెట్లా వస్తాయి?

**గంటయ్య :** ఆరు నూరయ్యేదీ నూరు ఆరయ్యేదీ— నా బాకీమటుకు వసూలుచేసితీరతాను. ఈ రోజు తప్పకుండా ఇస్తానన్నాడు. ఇవ్వకపోతే ఈ ఇంటిని తాకట్టు పెడతానన్నాడు.

**వెంకటప్పయ్య :** (చకితుడై) వాడెవడు నా ఇంటిని తాకట్టు పెట్టడానికి? ఈ ఇల్లు నాది.

**గంటయ్య :** అయితే తల తాకట్టు పెడతాడు.

**కోటిలింగం :** గుర్నాధం తలమీద వెంట్రుకల్లేవు. ఆ బట్టతలను ఎవడు తాకట్టు పెట్టుకుంటాడు?

**గంటయ్య :** ఏమైనా నా బాకీ నలభై రూపాయలు వసూలుచేస్తాను. ఇంతకంటె మొండివాళ్ల దగ్గరే ముక్కుపిండి, మూడు చెరువులనీళ్లు తాగించి వసూలుచేశాను. ఈ గుర్నాధం నాముందు గడ్డిపోచ

**వెంకటప్పయ్య :** నేనేనా అంతచేతులుచచ్చి కూర్చుంది! నా మూణ్ణెల్ల అద్దె ఇవ్వకపోతే—మూడు నిముషాల్లో ఇంట్లోని సామాన్లంతా జప్తు పెట్టిస్తాను.

**కోటిలింగం :** నేను గుర్నాధాన్ని అరెస్టుచేయించి, జైల్లోకి తోయిస్తాను.

**గంటయ్య :** అదేం లాభం? జైల్లో భోజనం మనమే పెట్టాలి. దమ్మిడీముండకు ఏగానీ క్షవరమన్నట్టు— పారుబాకీకి పైఖర్చులా?

**కోటిలింగం :** అయితే మనం ఒక నిర్ణయానికి రాకూడదూ?

**వెంకటప్పయ్య :** ఏమిటది?

**కోటిలింగం :** గుర్నాధానికి రెండొందలు జీతం వస్తుందనుకుందాం. సరీగ్గా మన అప్పులకు సరిపోతుంది. అందుచేత ఆ డబ్బు మనకివ్వడు. ఏదోరకంగా దాచివేస్తాడు. కాబట్టి వెంకటప్పయ్యగారూ! అతను ఇంట్లోకి వచ్చీ రావడంతోనే అతని జేబులోవున్న జీతం మొత్తాన్ని మీరు తీసేసుకోండి. మన ముగ్గురమూ పంచుకుందాం.

**వెంకటప్పయ్య :** మీరు చెప్పింది బాగానే వుంది. కాని యిది కర్కోటకుల పథకం. మన హృదయాలు పాషాణాలైనప్పుడు ఈ పథకాన్ని కఠినంగా అమలుపర్చవచ్చు. కాని మనం అంత కఠినాత్ములుగా మారడం న్యాయమా? అతని జీతం మొత్తాన్ని మనం తీసేసుకుంటే ఈ నెలంతా ఆయనా, భార్యా, నలుగురు పిల్లలూ బ్రతికేదెట్లా?

**గంటయ్య :** మన పేగులు ఇట్లా జాలిజ్వరంతో బాధపడుతూంటే—మన బాకీలు బ్రహ్మదేవుని చిట్టాలోకి ఎక్కవల్సిందే! వచ్చే జన్మలో వసూలు చేసికోవాల్సుంటుంది.

**కోటిలింగం :** నాకొక ఆలోచన తడుతుంది.

**వెంకటప్పయ్య :**
**గంటయ్య :** } ఏమిటది?

**కోటిలింగం :** గుర్నాధం అప్పులుచేసికొని బతికే మనిషి. మనంకూడా అప్పులిస్తూ వ్యాపారాలు చేసేవాళ్లం. ఈ నెలజీతంలో మన అప్పులన్నీ తీరిపోతే—రేపట్నుంచీ మళ్లీ మనమే అప్పులు పెట్టవచ్చు. గుర్నాధం ఇంట్లోకి కావాల్సిన సరుకులన్నీ నేను అప్పుగా యిస్తాను.

**వెంకటప్పయ్య :** నేను ఇంటిఅద్దె వచ్చేనెల వసూలు చేయను.

**గంటయ్య :** నేను మళ్లీ ఓ పావుటన్ను కట్టెల్ని అరువుమీద యిస్తాను.

**కోటిలింగం :** ఎట్లావుంది నా పథకం?

వెంకటప్పయ్య :
గంటయ్య : } బ్రహ్మాండంగావుంది.

కోటిలింగం : అమలుపక్షమే ఆలస్యం !

గంటయ్య : ఇంతకూ ఆ మహానుభావుడు ఇంటి మొహం చూస్తేనా?

వెంకటప్పయ్య : ఎప్పుడొస్తాడో ! ఏమిటో !...మళ్లీ సారి కనుక్కుందాం. (ద్వారందగ్గరకు వెళ్లి) పార్వతమ్మగారూ! పార్వతమ్మగారూ!... గుర్నాథంగారు అసలు ఇవాళ ఇంటికొచ్చేది వుందా, లేదా?

ఒక స్త్రీ : (లోపల్నుంచి) అదేమిటండీ! అలా అంటారు. ఇంటికి రాకుండా వీధిలోనే వుంటారా? ఈపాటికి రావాల్సిందే ! ఆఫీసులో ఓవర్ టైమ్ చేస్తున్నారేమో !...కొంచెంసేపు ఓపిక పట్టండి.

వెంకటప్పయ్య: ఓపికపట్టక చిందులుతొక్కి లాభమేమిటి? ఆ స్వామివారి దర్శనంకోసం చచ్చినట్టు తిష్ఠ వేసుక్కూర్చుంటాం.

గంటయ్య : లేకపోతే మనమే ఆఫీసుకు వెళితే—

కోటిలింగం : అప్పులవాళ్లు ఆఫీసులు చుట్టూ తిరిగితే పరువుప్రతిష్ఠలు పక్కదార్లు పడతాయి. మనం వెళ్లడం మంచిదికాదు. ఇళ్ల దగ్గరే బలాబలాలు చూసికోవాలి.

గంటయ్య : నా అనుమానం. ఆఖరిరోజా గుర్నాథం ఇంటికి రాడేమో ! ఇవాళ పస్టుతారీఖుగదా! ఇంటికొస్తే అప్పులాళ్లు పీక్కుతింటారని— ఎక్కడేనా కాలక్షేపంచేసి, మొహం తప్పిస్తాడేమో !

వెంకటప్పయ్య : ఇవాళ తప్పిస్తే తప్పిస్తాడేమో? రేపు ఎక్కడికి కెళతాడు?

కోటిలింగం: రేపు ఇంటిముందు కళ్లాపిసీళ్లు చల్లక ముందే వచ్చికూర్చోమూ !

గంటయ్య : కూర్చుంటామనుకోండి ! .........లాభమేముంది?...రాత్రే జీతం మొత్తం అప్పుల కింద జమకట్టానంటే— మన మొహాలకు సున్నమే మిగులుతుంది.

వెంకటప్పయ్య : అదీ పాయింటే !......గుర్నాథం ఇంకెంతమందికి బాకీ ఉన్నాడో !

కోటిలింగం : మరేం చేద్దాం?...మనమంతా ఒక మాటమీదవుంటే- గుర్నాథంగారి దగ్గర్నుంచి బాకీలను చెవులుపిండి వసూలుచేయవచ్చు... ఈ పస్టుతారీఖు తప్పిందంటే— గుర్నాథం తుపాకికికూడా అందడు.

గంటయ్య : మీరు చెప్పింది నిజమే !

వెంకటప్పయ్య : అర్ధరాత్రైనా, తెల్లవారఝామైనా, సూర్యుడు ఉదయించినా.......ఇక్కడే తిష్ఠ వేద్దాం...ఏదో ఒకవేళకు ఇంటికి రాకుండా వుండడుగదా ;

కోటిలింగం : మరి మన భోజనాలు...

గంటయ్య : చేసి, మళ్లీ వద్దాం.

వెంకటప్పయ్య: ఈలోపల వస్తే—.

కోటిలింగం : వస్తే—ఇంట్లోనే వుంటాడుగా !

(గుర్నాథం కొడుకు రామం పరుగెత్తుకొస్తాడు వయస్సు 14 యేళ్లు. వాడి మొహంలో ఆందోళన వుంటుంది.)

వెంకటప్పయ్య : అబ్బాయ్ !...మీ నాన్నగారు ఎక్కడున్నారు?

రామం : (ఏడ్పుమొహంతో) హాస్పటల్లో.

కోటిలింగం: హాస్పటల్లోనా?...ఏం జరిగింది?

రామం : లారీ యాక్సిడెంటు...

గంటయ్య : యాక్సిడెంటా?...ప్రాణాలతో వున్నాడా?

కోటిలింగం: శ్రీమతే రామానుజాయనమః

రామం : ఆఫీసునుంచి వస్తూంటే—చౌకులో లారీ

కింద పడ్డాడు...అమ్మా!అమ్మా! (అంటూ ఇంట్లోకి వెళతాడు)

కోటిలింగం : పాపం !...

వెంకటప్పయ్య : ఆ జేబులో జీతండబ్బులు ఉన్నాయో, లేవో...

గంటయ్య : అదీ పోయింటే !......ఆ పడటంలో ఏ రోడ్డుమీదో జారిపోయివుండొచ్చు.

కోటిలింగం : ఏంచేస్తాం?......మనకాలం బావుండ లేదు...అప్పులు వసూలయ్యే యోగం ఈ వారంలో లేదని నిన్న వారఫలాల్లో స్పష్టంగా రాసివుంది.

గంటయ్య : వెళదాం పదండి...వచ్చే ఫస్టుతారీఖు చూసుకోవాల్సిందే !

వెంకటప్పయ్య : అంతేనా?

కోటిలింగం : అంతగాక ఏముంది?

(ముగ్గురూ వెళతారు. కొన్నిక్షణాలు నిశ్శబ్దం. ఇంట్లోంచి గుర్నాథం రంగంమీదకు వస్తాడు.)

గుర్నాథం : పోయారు......ఈ నెలకు పీడ వదలి పోయింది. గుర్నాథంఅంటే ఏమనుకున్నారో !

(రామం వస్తాడు)

రామం : నాన్నా ! ఓ అర్ధరూపాయి ఇవ్వు.

గుర్నాథం : దేనికిరా?

రామం : నాటకమూడానుగా...అందుకు ఫీజు. సినిమా కెళ్ళాలి.

గుర్నాథం : (ఇచ్చి) పోరా !

(రామం గంతులేసుకుంటూ వెళతాడు. భార్య పార్వతమ్మ వస్తుంది.)

పార్వతమ్మ : మీ వ్యవహారం ఏమీ బావుండలేదండీ!

గుర్నాథం : ఏం?

పార్వతమ్మ : ఇలా నాటకాలాడి అప్పులు తీర్చకుండా ఎన్నాళ్ళు తప్పించుకుంటారు?

గుర్నాథం : తప్పించుకున్నన్నాళ్ళు. తప్పించుకు తిరుగువాడే ధన్యుడు సుమతీ అన్న పామెతను నువ్వు వినలేదా?

పార్వతమ్మ : ప్చ్. మీ పద్ధతి నాకేం బావుండలేదు! అప్పులుచేయడం. వాటిని ఎగవేయడానికి ఉపాయాల్ని వెతకడం ఇలాగైతే సంసారాన్ని ముందుకు లాగడమెట్లా? ఊళ్ళో పరువు ప్రతిష్ఠలు పోయాక, ఇంట్లో ఎంతకాలముంటాం? నామాట విని బాకీలన్నీ క్రమంగా తీర్చివేయండి.

గుర్నాథం : తీరుస్తానే...తీరుస్తామ ! మొత్తం బాకీలు ఎగవేయాలనే తలంపు నాకు కూడా లేదు.

పార్వతమ్మ : మరి ఈ తాత్సారం దేనికి? ప్రతిఫస్టు తారీఖ్కూ వాళ్ళను తప్పించుకోడం దేనికి?

గుర్నాథం : ఇంకెన్నాళ్ళు? వచ్చే ఫస్టుతారీఖ్కు ఈ బెడదంతా వొదిలిపోతుంది. అప్పుల్నుంచి బయటపడి లక్షాధికారు లవుతాం?

పార్వతమ్మ : అదేమిటి? ఎట్లా?

గుర్నాథం : (జేబులోంచి ఓ లాటరీటిక్కెట్టు బయటకుతీసి చూపెడుతూ) ఈనెల ఇరవైఅయిదో తారీఖున ఈ లాటరీ డ్రా. లక్ష ఇరవైఅయిదు వేల రూపాయల ఫస్టుప్రైజు మనకే. ఈ నెల గ్రహచారఫలంలో స్పష్టంగావుంది. అకస్మాత్తుగా ధనలాభముందని. అంతే గాకుండా మొన్న చిలకజోస్యంకూడా అదే సూచన తెలియబర్చింది. ఇంకా కొన్నాళ్ళు ఓపికపట్టవే ! మన జాతకమే తారుమారు కాబోతూంది.

పార్వతమ్మ : (నిట్టూర్పు విడుస్తూ) మీ ఆశలూ, ఆలోచనలూకూ బాగానే ఉన్నాయి. ఆకాశానికి

విచ్చినవేసి — నక్షత్రాలను అందుకోవాలని చూస్తున్నారు.

గుర్నాథం : వూరుకో పిచ్చిమొహమా !...అదృష్టం అందలమెక్కించబోతూంటే — బుద్ధి బురద లోకి లాగుతూన్నదట. అట్లా వుంది నీ వ్యవహారం.

పార్వతమ్మ : మీరేమైనా అనండి. పడతాను. మీ పద్ధతి బొత్తిగా బావుండలేదు. ఎప్పుడో వాన కురుస్తుందని—ఇప్పుడే కుండలో నీళ్లు పారబోసుకుంటామా?...మీరు ఇంటికి యజమానులు. ఏంవొచ్చినా మీరే చూసుకోవాలి? నా కెందుకొచ్చింది?

(పార్వతమ్మ ఇంట్లోకి వెళుతుంది గుర్నాథం కుర్చీలో కూలబడతాడు. బిలబిలమంటూ కోటిలింగమూ, వెంకటప్పయ్యా, గంటయ్యా వచ్చిపడతారు. గుర్నాథం పట్టుబడిన దొంగలా నిశ్చేష్టుడై నిలబడతాడు.)

కోటిలింగం, గుంటయ్య, వెంకటప్పయ్య : ఏం పెద్దమనిషివయ్యా ! నాటకమాడి మమ్మల్ని మోసంచేయాలని చూస్తావా?...ఇప్పుడెక్కడకు వెళతావు ! ఫస్టు తారీఖు !......

[తెర]



# హృదయ శైలి

## శ్రీ ముకురాల రామారెడ్డి

పరిచయముగల దారిలోపలనె బేల
నై దగాపడి లీలగా నవ్వుకొంటి;
చురుకుచురుకున నెత్తురు గురియు గుండె
గాయమును కంటినీటితో కడుగుకొంటి.

మెడలు వంచి గద్దెమీదికి ఎక్కగా
లేక, లొంగి బ్రతుకలేక, హృదయ
మిచ్చి పుచ్చుకొనెడి వృత్తి చెల్లనివేళ
పుడమి నప్రయోజకుడనె యైతి.

ఎవనిని నమ్ముకొన్న, మరి యే మతబోధలు విన్న, ఇంతెగా
అవతలివన్నిలొచ్చు, తన యార్భటమే పయిపెచ్చు, నూత్నహే
తువుల వితండగర్జనల దూకుడుపాటులు మూగి గొంతు లె
త్తవు పొరివోయి నేడు వరదాయిని! నీ ప్రియదర్శనంబునన్.

తెమలని అంధరాజ్యమున ద్వేషము దాగుడుమూతలాడు పం
దెములకు సైచిసైచి, తలదిమ్మన తారటలాడి వచ్చితిన్
అమవసచందమామనయి అన్నికళల్ దిగజారి; రోహిణీ
రమణినిబోలి సుంత అనురాగము తొల్కగ పల్కరింపుమా!

వికృత విప్లవశ్రుతికన్న, వికటహాస
పాత్ర తాండవములకన్న, ప్రగతిపేర
నడుపు విక్రాంతిలో శ్మశానములకన్న;
ఈ శిథిల శిల్పపరసర మెంతో హాయి!

మెరుపులు మబ్బులన్ కలసి మేలముఁలాడెను, నింగి చెక్కులన్
గిరిశిఖరాలు ముద్దులు గొనెన్, పరవళ్లను ద్రొక్కుచున్న ని

ర్ఝరులకరళ్ళ సాగరతరంగము లేకములైన తీరులో
పరవశమై చెలీ! బ్రతుకుబాటలు క్రొత్తగ వేసికొందమా!

సున్నవంటి నా యున్కిని జూచి, విలువ
నిచ్చి దాపలి యొంటువై నిలిచినావు.
నీ యడుగుజాడలో పయనించదలతు
ద్వైత జగదర్థమందు అద్వైతమట్లు.

నీ దృగంచలహాసము నిత్యనూత్న
కావ్యమై సరిక్రొత్త రమ్యార్థములను
అడుగుచున్నది నన్ను, వ్యాఖ్యాన సరళి
నోచుకొన జూచెదను నీ యనుజ్ఞ వడసి.

తోటనరులను లాగి మోకాటివరకు
కటికరొంపిని దింపి, ఆకాశమెక్క
గర్వపడబోనుగాని; నీ కనులచలువ
స్వర్గఖండమిలకు దింప సాహసింతు.

---



# దిగంబరకవిత - దాని స్థానం

శ్రీ నూతలపాటి గంగాధరం

భావభాషాచ్ఛందఃపరాలుగా మన కవిత్వంలో వచ్చిన మార్పులైతేనేమి, ఉద్యమాలైతేనేమి— వాటిని పరిశీలిస్తే మనకొక్కటి స్పష్టమవుతుంది. ఇవన్నీకూడా కవిత్వాన్ని సామాన్య ప్రజానీకానికి దగ్గరగా తీసుకువెళ్లే ప్రయత్నాలేనని. ఈ దృష్ట్యా మన సాహిత్యంలో వచ్చిన మార్పులనూ, ఉద్యమాలనూ జల్లెడపడితే భాషాపరంగా వ్యావహారిక భాషా ఉద్యమమూ, ఛందఃపరంగా వచనకవితా ఉద్యమమూ, భావపరంగా అభ్యుదయ కవితా ఉద్యమమూ మిగులుతాయి. ఇవి మూడూ సామాజిక చైతన్యం ప్రధాన లక్ష్యంగా కలిగినవే! శ్రేణి విషయంలో చూచుకున్నా వీటికే ప్రథమపట్టం కట్టవలసి ఉంటుంది.

వ్యావహారిక భాషనూ, అభ్యుదయ కవితనూ ఉద్యమాలుగా స్వీకరించడంలో ఎవరికీ ఎలాంటి విప్రతిపత్తిలేదు. కానీ, వచనకవితను ఒక ఉద్యమంగా అంగీకరించడంలో చాలామందిలో అభిప్రాయ భేదాలున్నాయి. అందుకు కారణం లేకపోలేదు. వ్యావహారికభాష ఒక్కసారిగా ఉప్పెనలా గిడుగువారిచేత ప్రారంభింపబడింది. అభ్యుదయ కవిత్వమూ అలాగే జరిగింది. పోతే వచన కవిత అలాకాదు. చెదురుమదురుగా అక్కడక్కడా ప్రారంభమై అంతాకలసి చివరికొక ప్రవాహరూపాన్ని దాల్చింది. మరొక కారణం గూడా ఉంది. ప్రాచీనంనుంచి ఛందస్సుకి ఒక నిర్ణీతమైన పరిధి ఉంది. వివిధ వృత్తాలను వివిధ రసావిష్కరణసాధనాలుగా మనవారు పరిగణిస్తూ వచ్చారు. నన్నయ వీరరసావిష్కృతికి ఏ ఛందస్సునైతే సాధనంగా గైకొన్నాడో, తర్వాతి కవులంతా అదేరసానికి అదే ఛందస్సును వాడటం సంప్రదాయమైపోయింది. ఈ సంప్రదాయానికి కట్టుబడ్డ కవి ఆయా ఘట్టాలలో వెనుకటి వాళ్లకంటె భిన్నమైన శిల్పవైవిధ్యాన్ని ప్రకటించడానికి వీలులేకపోయేది. ఈ సంకుచిత పరిధినుంచి బయటపడి భావతీవ్రత ఏ రూపంలోకి ఒదిగితే ఆ రూపంలో అనంతశిల్ప వైవిధ్యాన్ని ప్రకటించడాని కనువుగా ఆధునికకవి గ్రహించిన ఛందస్సే — వచనపద్యం! ఈ కారణంగా ఆధునిక కవికి ఛందఃశిల్ప వైవిధ్య ప్రకటనలో వెనుకటివారు లక్షించిన మార్గాన్ని 'కాపీ' చేయవలసిన పీడ వదలిపోయింది. అట్లా అని ఇందులో నియమాలూ, నిబంధనలూ లేవనుకోవడానికి వీల్లేదు. ఎవరికి వారు తన భావశిల్పాని కనువైన నియమాలు చేసుకుంటారు. అంటే — వెనుకటివారు తనమీద అనవసరమైన అధికారం ప్రకటించడానికి బదులు, తమకుతామే తమమీద అధికారాన్ని ప్రకటించుకుంటున్నారు. ఇది హేతువుగా వచన పద్యంలోని నడకా, నాణెమూ, ఒడుపూ, ఒయ్యారమూ ఏ కవికాకవిలో ఒక ప్రత్యేక ముద్రతో సాగిపోతుంటాయి. ప్రాచీన కవుల్లోలాగా నేటి కవుల్లో ఛందఃశిల్పవిషయంలో అనుకరణ దుర్గంధం మనకి సామాన్యంగా కనిపించదు. ఇలా దీని పద్ధతి అందరిలో ఒకరూపంగాకాక, ప్రతికవిలోనూ రూపపరిణామభేదంతో సాక్షాత్కరిస్తుండడం ఉద్యమభావ శైథిల్యానికి హేతువవుతూ ఉంది. ఇంకొకకారణం కూడా ఉంది. ఇది మూడవది. ఇందులో వర్ణనీయవస్తు విషయంలో నిర్ణీత పరిధి ఏమీ లేదు. వచన ఛందస్సులో అభ్యుదయకవిత్వం వ్రాస్తున్నారు. ఆధునికమైన భావకవిత్వం వ్రాసేవాళ్లు వ్రాస్తున్నారు. నీతులు చెప్పేవాళ్లూ, వక్రచిత్రాలుగీసేవాళ్లు, తత్వాన్ని ఉపదేశించేవాళ్లూ,

మార్మికధోరణిలో వ్రాసేవాళ్ళూ, ఇతివృత్త ప్రధాన కావ్యాలు నిర్మించేవాళ్ళూ—అందరికీ ఇది సాధనమై పోయింది. ఇలా వచన ఛందస్సు ఒక సంకుచితదశను విడనాడి బహుముఖాలుగా తనపరిధిని పెంచుకొని అనంతవైవిధ్యవిలసనంతో సాగిపోతూ, ఎవరికిష్టమైన వాటంలో వారికి సాధనంగా ఒదిగి పోవడం కూడా—దీన్ని ఉద్యమంగా అంగీకరించడానికి ఒక ఆటంకాన్ని ప్రదర్శిస్తోంది.

కానీ, వ్యావహారిక భాషా ఉద్యమానికీ, వచన కవితా ఉద్యమానికీ చాలా పోలికలున్నాయి. భాషోద్యమానికి గిడుగూ, గురజాడ లాగా ఈ ఉద్యమం గూడా ఏ ఇద్దరూ ముగ్గురూ వ్యక్తుల చేయూతతోనే వెలుగులోకి తీసుకురాబడింది. మొదట ఇది శ్రీశ్రీతో ప్రారంభింపబడింది. కుందుర్తి, తిలక్‌లతో దీనికొక సంపూర్ణ స్వరూపం ప్రసాదించబడింది. భాషోద్యమానికి గిడుగు లక్షణం, గురజాడ లక్ష్యమనే విషయం జగద్విదితం. అదేవిధంగానే వచనకవితకూ శ్రీశ్రీని లక్షణంగానూ, కుందుర్తి తిలక్‌లను లక్ష్యంగానూ స్వీకరించవచ్చు. ఆయాకారణాల నాధారంగా చేసుకుని వచనకవితను గూడ ఒక ఉద్యమంగా స్వీకరించడం జరుగుతోంది.

ఈ మూడు ఉద్యమాలకూ దిగంబర కవితోద్యమానికీ ఏదైనా సంబంధం ఉన్నదేమో పరిశీలిద్దాము.

భాష విషయంలో దిగంబరకవులు ఎలాంటి ప్రతిపలూ పలకలేదు. కానీ, వారు ఉపయోగిస్తున్నది వ్యావహారికభాషే! ఇందులో ఎవరికీ ఎలాంటి అభిప్రాయభేదాలు లేవు.

కానీ, వీరు వ్రాస్తున్నది వచనకవిత్వమే అయినా—'స్వరూపాన్నిబట్టీ, స్వభావాన్నిబట్టీ మేము వ్రాస్తున్నదానిని వచనకవితఅని మేమనదలచుకోలేదు. అననివ్వదలచుకోలేదు' అని శపథం చేశారు. 'అనదలచుకోలే'దని చెప్పడంలో వీరి అభిప్రాయాన్ని వెల్లడిస్తున్నారని అంగీకరించవచ్చు: 'అననివ్వదలచుకోలే'దని ఎదుటివారిమీద అధికారాన్ని ప్రకటించడం వీరి ప్రత్యేకతను తెలుపుతుంది. సమాజం మీద మొట్టమొదటిసారిగా అధికారం తీసుకున్నది వేమన. ఆ వెమ్మట గురజాడ. ఇప్పుడు వీరు. వేమన గురజాడల అధికారం వేరు. వీరి అధికారం వేరు. ఎదుటివాళ్ళను మట్టిముద్దల్నిచేసి, వాళ్ళ అభిప్రాయంతో నిమిత్తంలేకుండా 'అననివ్వదలచుకోలే'దనే రకానికిచెందిన అధికారం వీరిది.

'దిగంబరకవుల స్వరూపం ప్రీవర్సుదే. ఇంక స్వభావమా? మొదలు ప్రీవర్సు స్వభావం ఏమిటో తేలందే 'దిగంబర'కవుల స్వభావం అది కాదని ఎట్లా చెప్పగలం?' అని వరవరరావు అంటున్నారు. వచన కవితకేకాదు మరి ఏ ఛందఃప్రక్రియకైనా సామూహికంగా దాని స్వభావం ఇదీ అని నిర్ణయించడానికి వీల్లేదు. ఎందుకంటే అది ఛందోనిష్ఠమో, మరొకదాని నిష్ఠమో కాదు. 'స్వభావ' మెప్పుడూ కవినిష్ఠమై ఉంటుంది. ఎప్పుడు కవినిష్ఠమైందో, కవి వ్యక్తిత్వమే దాని స్వభావంగా రూపు దిద్దుకొంటుంది. కాబట్టి దిగంబర కవిత్వంలోని స్వభావం దిగంబరకవుల వ్యక్తిత్వానికి సంబంధించినదైనందువల్ల దాన్నిగురించిన పేచీ మన కక్కరలేదు. 'స్వరూప'మన్నపదం వారు ఉపకరణగా స్వీకరించిన ఛందోవిశేషానికి సంబంధించినది మాత్రమే! వారు స్వీకరించినది స్వరూపంచేత వచన గేయమేనని వరవరరావుగూడ ఒప్పుకొంటున్నారు. వరవరరావే కాదు అందరూ ఒప్పుకొంటున్నారు, ఒప్పుకోనిదల్లా వీరే!

మన సాహిత్యంలో ఏవైతే ప్రథమశ్రేణికి చెందిన ఉద్యమాలని మొదట చెప్పుకున్నామో ఆ మూడింటిలో రెండింటి మార్గాలను వీరు స్వీకరించారని తేలింది. ఇవి రెండూకూడ కవిత్వాన్ని సామాన్యప్రజానీకంలోకి తీసుకువెళ్లే సాధనాలు మాత్రమే! ఈ సాధనాలను వీరు సరియైన పద్ధతిలో ఉపయోగించుకున్నారా, లేదా—అనేది వేరే

విషయం. పోతే ఇంకొక ఉద్యమం మిగిలివుంది. ఇది భావసంబంధి వస్తుసంబంధి

స్వరూప, స్వభావ, ప్రయోజన, సిద్ధాంతా లన్నింటిలోనూ భావకవిత్వాన్ని పూర్తిగా ఖండిస్తూ అభ్యుదయకవిత్వం బయలుదేరింది. భావకవిత్వంలో ప్రధానమైంది కవి అనుభూతి. అభ్యుదయకవితలో అనుభవం. అందులో సౌందర్యం, ఇందులో హేతు వాదం. దాని ప్రయోజనం ఆనందం. దీని ప్రయో జనం సామాజికప్రగతి ఇలా ఇవి రెండూ ఉత్తర దక్షిణధ్రువాలు. అభ్యుదయకవిత్వోద్యమం తర్వాత వచ్చింది దిగంబరకవిత్వోద్యమం. అభ్యుదయకవిత లాగా ఇది గూడా తన ముందుటి ఉద్యమాన్ని పూర్తిగా వ్యతిరేకిస్తున్నదా, అని ప్రశ్నించుకుంటే— దిగంబరకవుల శపథాన్ని వింటే అలాగే అనుకోవలసి వస్తుంది. కానీ దాన్నీ, దీన్నీ జాగ్రత్తగా పరిశీలించి చూస్తే వ్యతిరేకిస్తున్నమాట నిజమేకాని పూర్తిగా మాత్రంకాదు.

సమాజంలోని ఒకవర్గంమీదనే అభ్యుదయ కవుల కక్షఅంతా. దిగంబరకవుల కక్ష అన్నివర్గాల మీదా—గతం హితమైనా, అహితమైనా దానికి తెర దించేయడమే అభ్యుదయకవుల మతం. దిగంబర కవుల్లో గత కాలాన్ని మెచ్చుకునే తత్త్వం ఉంది.

వీళ్లలోని ఈ తత్త్వాన్ని తెలిపేందుకు ఒక ఉదాహరణ:

'నాడు మానవతాఝురులు పారాయి
మంచితనం తీరాలు వెలిశాయి
పాపపుణ్యాతీతలోకం శాంతివెన్నెలను సాకింది
వర్గాలులేని మానవస్వర్గాలు
నదుల నాగరికతల్లో తీర్థాలుగా వెలిశాయి
నడచినది పరిణామం
చెడినది మానవారామం.'

అభ్యుదయకవితలో ప్రధానమైనది సామాజిక చైతన్యం. వీరు ఆశించినదీ అదే! కానీ, ఆ చైతన్యం తప్పుడుమార్గం పట్టింది. వారు ఆవేశంలో అవసరమైనచోట్ల ఒకటే రెండూ వికటపదాలను వాడితే, వీరు అదేపనిగా వికటపదాలే కవిత్వ మన్నంత విపరీతంగా విజృంభించారు.

వెనుకటి ఉద్యమాలకూ, ఈ ఉద్యమానికీ సామ్యాలూ, భేదాలూ ఇలా ఉన్నాయి. వెనుకటి వాళ్లంతా ఈ ఉద్యమాల్ని — శక్తినీ, కాంతినీ, సుగంధాన్నీ నింపి ప్రజానీకంలోకి పంపే సాధనాలుగా ఉపయోగించుకున్నారు. వీళ్లు మానసికరుగ్మతనీ, జుగుప్సనూ, కంపునూ నింపి ప్రజానీకంలోకి పంపారు.

ముందు దీని పుట్టుపూర్వోత్తరాల్నిగురించి కొంత తెలుసుకుందాము. ఈ దిగంబర కవిత్వోద్యమం నేటి యువతరంలోని అసంతృప్తికి సృజనాత్మక మైన అలజడి అంటున్నారు. ఈ యువతరం తిరుగుబాటు కేవలం ఒక్కఆంధ్రదేశానికే సంబం ధించిన దేమీకాదు. అలాగే మన ప్రాంతంలో మొట్టమొదటిసారిగా ఉద్భవించినదీకాదు. ఈ తిరుగు బాటు ప్రపంచం మొత్తంమీద ఎప్పుడో ప్రారంభ మైంది.

దానికి కారణం వర్తమాన సాంఘిక, రాజ కీయ, ఆర్థిక, తాత్త్విక సిద్ధాంతాలేవీ నేటి యువ తరం ఒంటికి పట్టకపోవడం. ఈ బంధాలనుండి త్రెంచుకోవడానికి లేక వాటిని తమ ప్రకృతి కను కూలంగా సంస్కరించుకోవడానికి జరిగే ప్రయత్నమే ఈ అలజడీ, తిరుగుబాటూ. బుద్ధికీ—హృదయా నికీ, వ్యక్తికీ—సమాజానికీ, సమాజానికీ—ప్రభు త్వానికీ, పాతతరానికీ—కొత్తతరానికీ, సంస్కృతికీ— నాగరికతకూ సామరస్యం కుదరక పిటేమధ్య జరుగు తున్న ఘర్షణాఫలితాలే ఈ ఉద్యమాలు. వెనుకటి వారి వ్యక్తిత్వంకంటె తన వ్యక్తిత్వం ప్రత్యేకమైన దనీ, దాన్ని ప్రపంచంచేత గుర్తింపచెయ్యాలనే ఉబ లాటం నేడు ప్రతియువకునిలోనూ ప్రబలమై పోయింది. నేటి ఈ అసంతృప్తికి చాలామంది తరాల మధ్య అగాధం (Generation gap) కారణం

అంటున్నారు. పాతతరం మనిషికీ, కొత్తతరం మనిషికీ ఒక విచిత్రమైన అంతరం ఉంది. అతడు తన కష్టాలనూ, నష్టాలనూ భగవంతుడిమీదవేసి తాను నిర్లిప్తంగా ఉండేవాడు మళ్లీ దాన్నిగురించి పెద్దగా పట్టించుకునేవాడుకాదు. నేటితరం వ్యక్తి అలా కాదు. మంచికీ, చెడుకూ తనే కారకుడుగా భావిస్తున్నాడు. ప్రతిచిన్నవిషయానికీ తన శక్తిని శంకించుకోవడం— దానికి కారణం సమాజమేననడం— సమాజంమీద తిరుగుబాటు చెయ్యడం పరిపాటి అయిపోయింది. పాతతరం మనిషి లక్ష్యం భగవంతుడు. ఇతనిది సమాజం. అతని సమస్యలు వైయక్తికమైనవి. ఇతనివి సంకీర్ణమైనవి.

పోతే నేటి యువతరమంతా కళాశాలలనుంచి వచ్చినవాళ్ళు. విద్యార్థిదశలో ఎన్నోఆశలూ, ఆదర్శాలూ, లక్ష్యాలూ పెంచుకుంటారు. భవిష్యత్తును గురించి రంగురంగుల కలలు కంటారు. జేబుల నిండుకూ ఆదర్శాలే, కళ్ళనిండుకూ కలలే. విద్యార్థిదశముగించి సమాజంలో అడుగుపెట్టగానే నిజమైన జీవితం ఎదురవుతుంది. వాళ్ల ఆదర్శాలకీ, కలలకీ — ఈ జీవితానికి ఎక్కడా పోలికే ఉండదు. జేబులు బరువై పోతాయి. కలలన్నీ రంగువెలసి పాలిపోతాయి. ఆదర్శాలకూ, అనుభవాలకూ ఎక్కడా సామరస్యం కుదరదు. నేటి యువతరంలోని నిరాశ, నిస్పృహల కిదొక కారణం.

ఆ యీ కారణా లెన్నింటివల్లనో ప్రపంచ మంతటా యువతరంలో అనేకాలైన తిరుగుబాట్లూ, ఉద్యమాలూ చెలరేగినవి.

'గ్రీనిచ్ విలేజ్'ని కేంద్రంగా చేసుకుని వెలువడిన బీట్ జనరేషన్ (Beat Generation) గానీ, అమెరికానుంచి వెలువడిన గ్రే జనరేషన్ (grey generation) గానీ, బ్రిటన్‌లోని కోపోద్రిక్త యువకుల (Angry young men) ఉద్యమంగానీ, మనదేశానికి చెందిన బెంగాల్‌లోని ఆకలితరం (Hungry Generation) గానీ, హిందీలో 'నంగా కవిత' అన్న ఉద్యమంకానీ ఈ రకమైన యువతరం తిరుగుబాటుకు చెందినవే అంటున్నారు అలాగే ఆంధ్రదేశం యువతరంలో చెలరేగిన అలజడి ఫలితంగా దిగంబర కవిత్వోద్యమం వెలువడింది.

ప్రపంచం మొత్తంమీద అన్నిభాషల్లో అన్ని రకాల ఉద్యమాలు చెలరేగినా వారి ప్రధాన లక్ష్యాలలో విభేదాలున్నా, ఆశయంలోమాత్రం వీరందరి తపన ఒక్కటే నంటున్నారు. 'నిఖిలేశ్వర్'. 'విభేదాలు లేని విశ్వమానవునికోసం కృత్రిమతను త్యజించి సహజంగా జీవించే వ్యక్తికోసం, సంప్రదాయాల సంకెళ్లను విరగ్గొట్టి వినూత్న సమాజ నిర్మాణం కోసం, మనిషి తనలో నగ్నంగావుండి మహామానవుని స్వప్నసాఫల్యంకోసం నిర్విరామంగా ఘర్షణపడేవాళ్ళు ఈ విభిన్న యువసాహిత్యోద్యమాలకు చెందిన యువకులు.'

మిగతా సాహిత్య విప్లవాలలాగే ఈ దిగంబర కవుల తిరుగుబాటుకూడా ఒక చారిత్రక సందర్భంలో ఉద్భవించిందంటున్నారు. ఆ చారిత్రక సందర్భమేమిటో వీళ్లిలా వర్ణిస్తున్నారు: 'ఆంధ్రదేశం 21 వ శతాబ్దం ప్రథమ సోపానం అధిరోహిస్తూకూడా 1900 నాటి మనస్తత్వభారంతో కుంగిపోతున్నది. సర్వత్రా ప్రజల్లో రకరకాల చాదస్తాలు. ఇంకా హాస్యాస్పదమైన కులం-జాతి—శాఖల పట్టింపులు ఆదిమతత్వంతో వరకట్నాలు పుచ్చుకునే యువకులు. ఆధునిక హేతువాదం, ప్రయోగం ఏమాత్రం పచ్చని పత్రికా సంపాదకులు. ఎంతసేపటికీ ప్రాచీన కావ్యాల — ప్రబంధాల సమాధులను త్రవ్వి డాక్టరేట్ పట్టాలను పుచ్చుకునే 'సాహిత్య డాక్టర్లు'. వ్యాపార మనస్తత్వంతో కాలక్షేప సాహిత్యాన్ని ప్రోత్సహించే వార, మాస, దిన పత్రికలు. వాటిలోని రచనలను మొదలు—తుది చూసి సాంవత్సరిక సమీక్షలురాసే విమర్శక మహానుభావులు. విశ్వవిద్యాలయాల్లో ఈ నాటికికూడా గ్రాంథికభాషకు మకుటంపెట్టి కాలం గడుపు

కుంటున్న తెలుగు పీఠాధిపతులు. పాలేరు మనస్తత్వం గల పాలకులు. రాజకీయవర్గాలతో చీలివున్న నాయకులు. రాష్ట్రం వలుమూలలా ప్రతినిత్యం వెక్కిరించే దారిద్ర్య దేవత వికటాట్టహాసం. రాష్ట్రంలో సినిమాలపట్ల సంక్రమణ వ్యాధిలా వ్యాపించిన వెర్రి వ్యామోహం. విజ్ఞానం—వినోదం ముసుగుతో అది వెదజల్లుతున్న అసహజమైన విలువలు. భ్రమ పూరితమైన మిథ్యాజీవితవిధానాలపట్ల ఈ సినిమా పరిశ్రమ యువకులను లాక్కెళ్ళడానికి ప్రయత్నిస్తున్నది. నాయకుల, అధికారుల అవినీతి వల్ల వెనుకబడి పోవడమే అభివృద్ధి అనిపించుకొంటున్న ఈ పరిస్థితుల్లో తెలుగు సాహిత్యం – కొందరు కవులు—కథకులను మినహాయిస్తే – యథార్థాన్ని విస్మరించి శవప్రాయంగా ఉంది. కళాకారులు – కవులు, రచయితలనబడే వాళ్ళు అకాడమీల ప్రాపకంలో కర్తవ్యాన్ని ఏనాడో మరచిపోయారు – ఈలాంటి కుత్సిత పరిస్థితుల్లో తెలుగు సాహిత్యంలో 'దిగంబర కవులు' ప్రవేశించారు' అంటున్నారు వీరు.

దిగంబరకవులు తమ మొదటి 'దిక్'ల సంపుటాన్ని 1965 మే 6 వ తేదీ రాత్రి 12 గంటలకు ఆంధ్రప్రదేశ్ రాజధానీ నగరం హైదరాబాద్‌న ప్రప్రథమంగా తాము దిగంబర కవులమని ప్రకటిస్తూ శ్రీ నాంపల్లిపాండు అనే రిక్షావాలాచేత ఆవిష్కరింప జేశారు. అందులో 'ఈ ప్రాపంచిక ఆచ్ఛాదనల్ని చీల్చుకుని కొత్తరక్తాన్ని ఇంజెక్ట్ చెయ్యడానికి వస్తున్నా'మన్నారు.

మళ్లీ 1966 డిసెంబరులో 'ఇంకా భయం భయంగా బానిసత్వంగా దుర్భరంగా హేయంగా ఛండాలంగావున్న ఆంధ్రదేశమనే మురిగ్గుంటలోంచి' దిగంబర కవులు పలికిన రెండవ సంపుటి వెలువడింది. ఇది విజయవాడ బీసెంటు రోడ్డుమీద అర్ధరాత్రివేళ ఒక హోటలు క్లీనరుచే ఆవిష్కరింపబడింది.

ఇందులో ముందుమాటగా 'మేం ఏం కోరుతున్నాం' అనే శీర్షికలో సమకాలీన జీవితంపై దిగంబర కవుల దృక్పథం వివరింపబడింది. ఈ శీర్షికలో సమాజంలోని లోపాలనన్నింటినీ బాగా వివరించారు. ఏది ఎట్లా నశించాలి, దాని స్థానంలో ఏది ఎట్లా రావాలి అనికూడా చెప్పారు. ముందుమాట చదివేంతసేపు వీరుచెప్పే సమస్యల్ని పాఠకుడు సానుభూతితో అర్థం చేసుకుంటాడు. కాని కవిత్వంలో అడుగుపెట్టగానే ముక్కులు మూసుకుంటాడు. వీరుచెప్పే కుళ్ళూ, కంపూ వీరి కవిత్వంలోనే ఉన్నట్టు పాఠకుడు వెగటుపొందుతాడు. వీరిలాంటి కవిత్వంవ్రాసి తమ ఛాందసత్వాన్ని పాఠకులకుకూడా పట్టించేకన్నా, వ్యాసాలువ్రాసి తమ అభిప్రాయాల్ని ప్రకటించిఉంటే లోకానికెంతో మేలుచేసి ఉండేవారు కదా, అనికూడా పాఠకుడు అభిప్రాయపడుతాడు

ఇక మూడవ సంపుటం 1968 లో సెప్టెంబరు 14 వ తేదీ రాత్రి 12 గంటలకు విశాఖపట్నం లక్ష్మీటాకీస్ సెంటర్‌లో బిచ్చగత్తెగా బతుకుతున్న ఎడమనూరి యశోద (వయస్సు 20 సం॥లు) చేత ఆవిష్కరింపజేశారు. 'ప్రజల అవిద్యని అజ్ఞానాన్ని అశక్తతని ఆసరాగా తీసుకుని దేశాన్ని దోచుకుతినడం మరిగిన పరిపాలకులు, సంఘంలోని వివిధవర్గాంవాళ్ళు నేడు ప్రజలపై రుద్దుతున్న 'కుష్ఠువ్యవస్థ'ని ఎదుర్కొంటూ' ఇది ప్రచురింపబడింది.

పోతే మనకొక సంప్రదాయం ఉంది. ఒక రచయిత పవితత్వాన్ని విలువకడుతున్నామంటే, ముందు ఆ రచయిత అభిప్రాయాలకు విలువ నివ్వాలి. అతని అభిప్రాయాల్ని సిద్ధాంతాలుగా భావించి, ఆ కొలతలతో ఆ రచయిత పవితనాన్ని అంచనా కట్టాలి. నేటికైనా, రేపటికైనా ఇది సంప్రదాయం. సంప్రదాయాలను పూర్తిగా వ్యతిరేకిస్తున్న వీరి పవితనం విషయంలోకూడా మనమూ ఆ సంప్రదాయాన్ని పాటించనక్కర లేదు. వీరు చిత్తవికారానికి చెందిన ఎన్నో ముసుగుల్ని కప్పుకొని మేం 'దిగంబరులం' అనటంలోనే ఇదంతా తెలిసిపోతోంది.

దేనికైనా దాని ప్రకృతిలోనూ, ప్రవృత్తిలోనూ మార్పు తేవాలి కాని, ఊరికే పేర్లు మార్చటంతో దాని స్వరూప, స్వభావాలు మారిపోవు. పైగా అవి ముసుగులై దానిలోని కుళ్ళూ, కంపునూ కడిగివేయటానికి బదులు దాన్ని గట్టిగా నిలువచేసి మరింత గబ్బెత్తించే ప్రమాదం ఉంది. కాని వీరు పేర్లు మార్చడంతోటే దాని స్వరూపం మార్చివేసినట్టుగా భ్రాంతి చెందుతున్నారు. ఆ భ్రాంతితోనే కాబోలు—వీరు ఆరుగురు కాబట్టి సంవత్సరాలూ, ఋతువులూ, వారాలూ ఆరుగా విభాగించి కొత్త పేర్లు పెట్టుకున్నారు. ఇందువల్ల వీరు సాధించ తలంచిన ప్రయోజనం ఏమిటో అవగతంకాకుండా ఉంది దీనికొక అర్థం ఏదైనా ఉంటే లేదో, ప్రయోజనమూ అంతే! వీరి ప్రాథమిక ప్రయత్నం ప్రయోజన రహితమైన పనిగా ప్రారంభించి పాఠకునికి వీరి ఉద్యమంపట్ల ఒక తేలిక భావాన్ని కలిగించిన వారవుతున్నారు.

ప్రతివిషయంలోనూ ఉన్నవాటిని ఏదో ఒక కొత్త ముసుగుతో కప్పిపుచ్చి ప్రజల్ని విభ్రాంతి పరచడమే వీరి ఉద్దేశ్యంగా కనిపిస్తోంది కాబట్టే వీరు వింతవింతపేర్లుగూడా మార్చుకోవడం జరిగింది. వచనకవిత్వం వ్రాసి దిగంబర కవిత్వమని చెప్పడమూ, ఖండికలను 'దిక్'లని వ్యవహరించడమూ—ఈ మార్పు అన్నింటిలోనూ అంతరార్థం ఇదే! ఇన్నిముసుగులు తగిలించుకుని మేం దిగంబర కవులం మాది దిగంబర కవిత్వమంటే బుకాయింపు కాక మరేమిటి?

వీరికి మరొక రకమైన ముసుగుకూడా ఉంది. అది భాషకు సంబంధించింది. కొంచెం పచ్చిగా చెప్పవలసినచోట, అశ్లీలంగా కనిపించేచోట సంస్కృత సమాసాల ముసుగులు తొడిగే సంప్రదాయం మన ప్రాచీనులకుంది. ఈ ముసుగు వీరిలోనూ ఉంది. ప్రాచీన సంప్రదాయాలను వ్యతిరేకించడమే జీవలక్షణంగా గలిగిన ఈ కవులిక్కడ తప్పటడుగు వేశారనే అనాలి. స్వకుచమర్దనం, పునర్యోనిప్రవేశం, మానినీవక్షోజాలు, దంతనఖక్షతాలు మొదలైన ముసుగుల్ని వీళ్ళు సంప్రదాయ పద్ధతిలో తొడుక్కున్నారు. మరి యెక్కడ వీరి దిగంబరత్వం?

'దేన్నీ నమ్మకు. నీలోపల, యీ ముసుగులోపల, యీ వంచనల అంచులకిందవున్న నీ అసలు రూపాన్ని, నీ 'తనాన్ని' నమ్ముకో......ఏం, ఈ ముసుగు లేకపోతేనేం? స్వేచ్ఛగా అసలు స్వరూపంతో బతకడానికి యత్నిస్తేనేం?' అంటారు వీరు. ఈ ప్రశ్ననే వీరికి తిరిగివేస్తే?

'ఈ దేశంలో, యీ గోళంలో ఊపిరిపీల్చే ప్రతిమనిషి ఉనికికోసం తపనపడి, అతడి భావిని చూసి వెక్కివెక్కిఏడ్చి, పిచ్చెత్తి ప్రవచించిన కవిత' అన్నారు. వెక్కివెక్కి ఏడ్వడం మూడు పుస్తకాల లోనూ సామాన్యంగా కనిపించదుకానీ, కోపంతో ప్రవచించినమాటమాత్రం వాస్తవం.

హిందీ నయాకవిత ఉద్యమంలో ఒక తెగ అయిన 'నకేన్‌వాద్' కవులకూ, దిగంబరకవులకూ చాలాదగ్గర పోలిక ఉన్నాయి. వారిలాగే వీరూ అతివాదులు. ఏ వాదానికీ లొంగని కవిత్వాన్ని ప్రచారంలోకి తేవాలని వారి ప్రయత్నం. అలాగే వీరిదీనూ. తమ కవిత్వం వచనకవితాకాదు, మరొకటీకాదు అంటున్నారంటే అందులో రహస్యం ఇదే!

వీరికి మానవతఅంటే గౌరవం ఉంది; అది ఏ పద్ధతికిచెందిన మానవతావాదమో చెప్పడం కష్టం.

ఆధునిక సాహిత్యమంతా మానవుడికి కిరీటం పెట్టేదే మానవతావాదం మన సాహిత్యంలో రెండు పద్ధతుల్లో వ్యక్తమవుతోంది. దేశీయ సంప్రదాయం నుంచి కాలానుగుణంగా పరిణామంచెంది పుట్టుకొచ్చిందొకటి. పాశ్చాత్య సిద్ధాంతాలనుంచి మనకు సంక్రమించినది మరొకటి. మొదటిది ప్రధానంగా ఆధ్యాత్మిక సంబంధమైనది. రెండవది కేవలం భౌతికవాదానికి సంబంధించినది. అందులో కరు...

ప్రవృత్తికి కిరీటం. ఇందులో శుద్ధహేతువాదానికి మకుటం. దానికి ప్రమాణం గాంధీయిజం. దీనికి మార్క్సిజం. దిగంబరకవుల మానవతావాదం ఈ రెండు పద్ధతులకూ సంబంధించినదికాదు.

వీరు ప్రపంచంలోకెల్లా ప్రేమించేది ఒక్క మనిషినే. ఆ మనిషికోసం మనుషులనందర్నీ [illegible]డతారు. మనిషిమీద ఇష్టం ప్రకటిస్తారుకాని, మనిషిచేసే ఏ పనిమీద విశ్వాసం లేనివారు. ఇది మానవత్వమో మరి ఏమో తెలియదు. పోతే, రమణారెడ్డి అన్నట్లు మానవతావాదపు వికృత రూపమే అనుకోవలసివస్తుంది. వీరిలో ప్రారంభంలోలేని ఈ రూపం క్రమంగా పెరిగి ఎలా పెద్దదయిందో ఆరుద్ర ఇలా వివరిస్తున్నారు. 'ఈ కవులకు ఆదిలో ఎవరిమీదా కోపం లేదు, ద్వేషం లేదు, పగలేదు. నిజం చెప్పలేక, నిర్మలంగా బతకలేక ముసుగుని ముఖంనిండా కప్పుకొన్న, బురదను భాష నిండా పులుముకొన్న నిన్ను చూస్తే నాకెందుకు ద్వేషం' అనే జాలి ఉండేది......రెండో సంపుటం ప్రచురిస్తున్నప్పుడు వీళ్ళలో జాలితగ్గడం మొదలైంది. అసహనం, అశ్లీలం, హింస అంకురించడమేకాక విషపుష్పాలు కూడా పూశాయి...... మూడవ సంపుటంలో ఈ కవులు పూర్తిగా రౌద్రాకారులయ్యారు. ఇందులో మానవుడిమీద ప్రేమకన్నా వ్యవస్థమీద విద్వేషమే ఎక్కువగా కనబడుతుంది'

పూర్వాశ్రమంలో వీరిలో ఈ వికృతం, విద్వేషం మచ్చుకైనా కనిపించవు. వీరి స్వభావాలకివి తెచ్చిపెట్టుకున్నవి మాత్రమే! అతికించుకున్న రంగుకాయితాల్లాంటివి. అతికించుకొన్న వికృతం—మరికొంత వికృతత్వానికి దారితీసింది. 'స్క్వేయర్ పెగ్ ఇన్ ఎ రౌండ్‌హోల్' అన్న ఇంగ్లీషువాడి మాట ఈ విషయంలో వీరికి సరిగ్గా అతికిపోతుంది. ఏ వాదానికీ లొంగకూడదనే విపరీత మనస్తత్వమే ఇందుకు మూలకారణం.

దిగంబరత్వంఅంటే ఏమిటో వీరి నిర్వచనం ఇలా ఉంది:

> 'మనిషిలో అట్టడుగున బురదగుంటల్లో
> పడివున్న మనీషిని లేవదియ్యడం
> ఎముకల లోతుల్లో ధ్వనించే
> స్వచ్ఛమైన గీతాల్ని ప్రతిధ్వనించడం
> కళ్ళవెనుక దాగివున్న
> సిసలైన కన్నీళ్ళని ప్రసరించడం
> గుండెలతీరాన్ని కొట్టుకునే
> సహజమైన భావాల్ని ఒడుపుగా పట్టడం
> పెదాలకొసల్లో
> చిక్కటి చిరునవ్వుల్ని మొలిపించడం
> నిజాన్ని నిజంగా నగ్నంగా చెప్పడం.

ఇవన్నీ తమ కవిత్వంద్వారా సాధిస్తామంటే ఎవరు వద్దంటారు? కోడలు మగబిడ్డను కంటానంటే అత్త వద్దంటుందా? వీటిని సంప్రదాయవాదులుమాత్రం వద్దంటారా? వీరు అలా చెయ్యటం లేదే, అని అందరి ఘోష! మనిషిలో అట్టడుగున బురదగుంటల్లో పడివున్న మనీషిని లేవదియ్యడానికి బదులు వీరి కవిత్వం మరొక మురిగ్గుంటలోకి పడద్రోస్తోంది.

వీరి కవిత్వం ఇలా విఫలమయ్యింది. దీనికి కారణాలేమిటో పరిశీలించడం అవసరం. కవిత్వానికి ప్రాణం భావావేశం. ఆ ఆవేశం వీరిలో తప్పుమార్గం పట్టింది.

కవిత్వం మేధాప్రధానమైనదని ఎందరు, ఎన్ని సిద్ధాంతాలు చేసినా—ఆ వాదం సిద్ధాంతాలవరకే పరిమితమై ఉంది. అనుభవంలోకి రాగానే ఆవేశమే కవిత్వంలో ప్రథమస్థానాన్ని ఆక్రమిస్తోంది. ఏ కవిత్వానికైనా ప్రయోగం ప్రాథమికమైనది. అక్కడ టెక్నిక్ ప్రధానం కావచ్చు. కానీ అదే పరిణతి నందుకున్నదశలో ఆవేశం మకుటం ధరిస్తుంది. అదే కవిత్వానికి జీవనాడి అవుతుంది.

ఆవేశం హృదయసంబంధి అని వేరుగా వివరించ నక్కరలేదు.

నేడు కవికి ఉపయుక్తమయ్యే పరికరాలన్నింటిలోనూ మార్పు వచ్చింది. పరికరాల విలువలన్నీ తారుమారైతే కావచ్చు. ఆవేశం విషయంలో మాత్రం అలా కాలేదు. కవికి ఆవేశం పాతబడి పోయిన పరికరమని ఈనాటికేకాదు ఏనాటికీ కొట్టి పారవేయడానికి వీల్లేదు. అది ఎంతబలమైనదైతే కవిత్వం అంతబలంగా పలుకుతుంది. అది నవనవోన్మేషమైనది. ఆవేశానికిముందు కవికి ఎన్నిభావాలున్నా అవి కేవలం అభిప్రాయాలు మాత్రమే అవుతాయి. ఈ అభిప్రాయాలు అందరిలో ఉంటాయి: అభిప్రాయాలవరకు కవీ, పాఠకుడూ ఇరువురూ సమానులే! ఆ పై దశలోనే కవి, ఇతరులనుంచి విడిపోయి తన ప్రత్యేకస్థానానికి అధిగమిస్తాడు.

అభిప్రాయాలు, అహంభావదర్పణాలు. అహంభావం ఆధిక్యత వహించినప్పుడు అభిప్రాయాలే సిద్ధాంతాల రూపంలో ప్రత్యక్షమవుతాయి. ఆ అభిప్రాయాలే ఆవేశముఖంగా కవి గుండెనుండి బయట పడ్డప్పుడు భావాలవుతాయి. అభిప్రాయాలు కేవలం అస్థిపంజరాలు. భావాలు చియ్యా నల్లా కలిగిన జీవాలు.

ఆవేశం రెండు రకాలు. భావావేశం ఒకటి. అహం భావావేశం మరొకటి. మొదటిది పెరిగితే అనుభూతిగా మారుతుంది. రెండవది పెరిగితే కోప మవుతుంది. మొదటి దానిలో పరార్థం ప్రధానం. రెండవ దానిలో స్వార్థం ప్రధానం. పదార్థంలో ఆవేదన, తపన ఉంటుంది. స్వార్థంలో ఈర్ష్యా ద్వేషాలుమాత్రమే ఉంటాయి.

మొదటిది పాఠకునిలో ఆర్ద్రతనూ, ఆనందాన్ని కలిగిస్తుంది. రెండవది విసుగునూ, వెగటునూ కలిగిస్తుంది. మొదటిది శక్తినీ, తేజస్సునూ ప్రసాదిస్తే రెండవది నీరసాన్ని జుగుప్సనూ కలిగిస్తుంది. మొదటి రకానికి చెందిన కవిత్వం—శ్రీశ్రీదీ, మరొకరిదీ. రెండవ రకానికి చెందినది—దిగంబర కవిత్వం.

అహంకారం స్థానం చేసుకున్నచోట భావుకత మృగ్యమై పోతుంది. భావుకత మృగ్యమైంది కవిత్వం అనిపించుకోదు. కవిత్వం అనిపించుకున్నా ఎవర్నీ అలరించలేదు. అది కేవలం అధికార దర్పాన్ని ప్రదర్శించే శాసనంగా తయారవుతుంది. శ్రీశ్రీ కవిత్వంలో కూడ అహంకారాన్ని ప్రదర్శించే సందర్భాలు లేక పోలేదు. కానీ అవి అతని శక్తివంతమైన భావావేశంలో మరుగుపడిపోతాయి. దిగంబర కవిత్వంలో ఆవేశం స్వరూపమే మారిపోయింది. తప్పుదారిపట్టింది. ఆ రకమైన ఆవేశం కవి అహంకారాన్ని కప్పిపుచ్చడానికి బదులు, దాగిన అహంకారాన్నిగూడా బయటికి లాగి చూపిస్తుంది.

ఆవేశం తర్వాత కవిని తనస్థానంలో నిలబెట్టేది అతని శైలీ శిల్పం. అదికూడా వీరిలో శిథిలమైపోయింది. ఈ శైథిల్యానికి ప్రాచీనులైతే వస్తుగతమైన లోపాన్నిగూడా ఒక కారణంగా పేర్కొనే వారేమోకానీ, కుక్కపిల్లా, అగ్గిపుల్లా, సబ్బుబిళ్లలనుగూడా కవితా వస్తువులుగా అంగీకరిస్తున్న నేటికాలంలో పై లోపాన్ని వస్తువును భరించమంటే అది సహించదు.

ఏ రచయితకైనా మూడు ప్రశ్నలు ప్రధానమైనవి. ఏమి చెప్పాలి? ఎలా చెప్పాలి? ఎందుకు చెప్పాలి?—అనేవి. మొదటిది వస్తుపరమైనది. రెండవది శిల్పపరమైనది. మూడవది ప్రయోజనపరమైనది. వస్తువు కవిలక్ష్యాన్ని కేంద్రంగా కలిగి ఉంటుంది. శిల్పం కవి శైలిని పునాదిగా కలిగి ఉంటుంది. ప్రయోజనం సమకాలీన సమాజ స్థితిగతులమీద ఆధారపడి ఉంటుంది. వస్తువూ, ప్రయోజనమూ ఎందరిలోనైనా ఏకాకృతి దాల్చి ఉండవచ్చు. శిల్పం ఏ ఇద్దరిలోనూ సమానరూప గుణాల్ని సంతరించుకోవడం దుర్లభం. వేమన, గురజాడలు వస్తువులోనూ, ప్రయోజనంలోనూ సమాన

మైన విలువలు కలవారు. అలాగని వారి శిల్పరీతులు ఒకటే ఎలా అవుతాయి?

కవినుంచి కవిని వేరు చేయాలన్నా, చదువరి హృదయాన్ని పట్టుకోవాలన్నా, కవి ప్రవృత్తిని పాఠకుడికి పట్టివ్వాలన్నా శిల్పమే ప్రధాన పాత్రను నిర్వహిస్తుంది.

దిగంబరకవుల ఆశయాలూ, లక్ష్యాలూ మంచివే! వాటిని కేంద్రంగా చేసుకున్న వీరి కవితా వస్తువుకూడా మంచిదే అని చెప్పాలి. వీరు ఆశించే ప్రయోజనం గూడా నేటి సమాజానికి అవసరమైనదే. మరి లోపమంతా ఎక్కడ ఉందంటే ఒక్క శిల్పంలోనే! శిల్పం మంచిదయితేనే ప్రయోజనం నెరవేరుతుంది. శిల్పం చెడిందంటే ప్రయోజనమూ చెడిందన్నమాటే! పాలు మంచివే. వాటి నందించే పాత్రకూడా మంచిదై ఉండాలి. పాత్ర మలినమైనదైతే పాలు చెడిపోతాయి. విరిగినపాలు ఆస్వాదయోగ్యంకావు. కవి భావాన్ని పాఠకునికందించే పాత్ర అతని శిల్పం. అది చెడితే అతని భావంకూడా చెడిపోతుంది. ఆస్వాదయోగ్యంకాదు. ఆస్వాదయోగ్యం కాని దానివల్ల ప్రయోజనం ఏముంటుంది. చెడిన పాలు త్రాగడంవల్ల ఆరోగ్యం చేకూరకపోతేపోనీ, అనారోగ్యానికే అది హేతువవుతుంది. దిగంబరకవిత్వం ఆస్వాదయోగ్యంకాని క్షీరంలా తయారయింది.

దిగంబరకవుల్లో ఈ శిల్పం చెడపోవడానికి కారణాలు అనేకం. సాహిత్య సృష్టికి కావలసినంత సంయమనం వీరు చూపకపోవడం. సంయమనం చూపకపోవడానికి వీరిలోని ఏకాగ్రతాలోపం కారణం అనిపిస్తుంది. ఏకాగ్రత లోపించడానికి వీరు ఆరుమంది కావడం కారణం కావచ్చు. ఇక్కడ కొంత వివరణ అవసరం.

అసలు కవిత్వంలో ఎప్పుడూ సామూహిక ప్రయత్నం పనికిరాదు. ఎందుకంటే కవిత్వం ఎప్పుడూ వ్యక్తిగతమైనది. ముఖ్యంగా వ్యక్తి అంతర్గతికి సంబంధించినది. తనలోకి తను చూచుకున్నప్పుడే కవిత ఆవిర్భవిస్తుంది. మరి సంకలనాల మాట అంటారేమో! దానికీ, దీనికీ సంబంధం లేదు. అది విడివిడిగా ఆవిర్భవించి ఒకచోట గుంపవుతుంది. అంతేకాని, ఒకదానితో ఒకటికి ఐక్యత సాధింపబడదు. కవిత ఎప్పుడూ సత్యాన్వేషణకు ఉపకరణ మాత్రమే! సత్యాన్వేషణ వ్యక్తిగతమైనదే కాని సామూహికమైనదిమాత్రంకాదు. సామాజిక ప్రగతికీ, సామూహికసద్వర్తనకు ఉపయోగించేదే కదా, కవిత్వం అనవచ్చు దాని ప్రయోజనం విషయంలో తప్పక సామూహికమైనదేకానీ, దాని సృష్టి విషయంలోమాత్రం వైయక్తికానికే పట్టం కట్టవలసిఉంటుంది

పరిశీలన రెండు రకాలు బహిర్ముఖమైనది. అంతర్ముఖమైనది. శాస్త్రజ్ఞాని పరిశీలన వస్తువు యొక్క బహిర్ముఖమునకే పరిమితమై ఉంటుంది కవి పరిశీలన అంతర్ముఖంగా ఉంటుంది బహిర్ముఖ పరిశీలనను ఒకరకంగా ప్రపంచపరిజ్ఞానంగా జమకట్టవచ్చును ఈ పరిజ్ఞానం కొద్దోగొప్పో అందరికీ ఉంటుంది. అంతర్ముఖ పరిశీలన ఇరువురికి మాత్రమే ఉంటుంది – కవికీ, తాత్త్వికునికీ! కవిది ఒకరకమైనది. తాత్త్వికునిది మరొక రకమైనది. తాత్త్వికుడు తత్త్వచింతనతో ఆగిపోతాడు. కవిలో మరొకశక్తి ఉంది. దానితో మరొకమెట్టు పైకి పయనిస్తాడు. కవి పరిశీలన ప్రధానంగా సృజనాత్మకంగా ఉంటుంది. స్వీయాత్మమైన తత్త్వ చింతనను కవిలోని భావుకత పరకీయం చేస్తుంది. సృజనాత్మకశక్తికి ప్రపంచపరిజ్ఞానం ఉపాంగమేకాని, అదే ప్రధానంకాదు.

కవి లక్ష్యం ఒకటి ఉంటుంది. అది సామాజికమైనది కావచ్చు. మరొకటి కావచ్చు. దానికి కమకూలంగా ఉంటుంది, కవి అంతర్ముఖ పరిశీలన. ఈ అంతర్మథనంలోంచి ఒక పరిష్కారం, ఒక ప్రబోధం సృజనాత్మకరూపంలో ఆవిష్కరింపబడుతుంది. ఈ పరిష్కార ప్రబోధాలే అయితే సామూ

హికంగానూ జరుగవచ్చు కాని అందులో భావుకత శూన్యం. భావుకతలో ఒక మహత్తరగుణం ఉంది. అన్నితరగతులవారినీ ఆకర్షించి, అది ఉద్దేశించిన లక్ష్యాన్ని నొప్పి తగలకుండా పాఠకుల మనస్సుల కందజేస్తుంది. కానీ, సామూహికపద్ధతిలో జరిగిన పరిష్కారం సిద్ధాంత మవుతుంది. అందర్నీ మెప్పించే శక్తి దానిలో ఉండదు. అది వాదంగా తయారవుతుంది. వెంటనే దాని ప్రక్కన మరో వాదం లేచి కూర్చుంటుంది. చివరికది తర్కమై, వాదాలు పెరిగిపోతాయి – అనంతం!

ముఠాతత్త్వం ఏ రంగంలోనూ మేలు చేకూర్చదు. 'గుంపు'లోఉన్న లోపమేమోకాని వ్యక్తిగత దౌర్బల్యం ప్రబలిపోతుంది. వైయక్తికమైన కార్య దీక్ష సడలిపోతుంది ఒక సమయంలో ఈ ముఠా తత్త్వంవల్ల రాజకీయ, వాణిజ్యాదిరంగాలలో మేలు కలుగవచ్చునేమో. అదీ గట్టిగా చెప్పలేము. కానీ, ఏవిధంగా చూచినా కవితాసృష్టిలో ఇది పనికిరాదు. కవిద్వయం, కవిత్రయం, సంప్రదాయం ఇంతవరకే. మన సాహిత్యంలో ఉందికదా—అని ప్రశ్నించవచ్చు, వాళ్లు తమ శైలినీ, శిల్పాన్నీ ఏకంచేయడానికి ప్రయత్నించలేదు. పైగా ఇతివృత్తప్రధానమైన కావ్య ధోరణిలో భిన్నహస్తశిల్పాన్ని కప్పిపుచ్చేగుణం ఉంది. ఎంత కప్పిపుచ్చినా వాళ్లలోకూడా పాత్రపోషణలో కొద్దోగొప్పో తారతమ్యాలు లేకపోలేదు. ఎంత ప్రతిభావంతులైనా ఇద్దరుముగ్గురు కలవగానే సాహిత్యసృష్టిలో ఈ లోపం అనివార్యమైపోతుంది. ప్రాచీనుల నంతా ఈ లోపంనుంచి కాపాడింది ఇతివృత్తమే! దిగంబరకవుల్లో ఇతివృత్తంలేదు అందులోనూ శైలీ, శిల్పాల విషయాల్లో ఐక్యత సాధించడానికి వీరు చేసిన ప్రయత్నమే వీరికి బెడిసికొట్టింది.

పోతే, ఇక్కడ సందర్భం వచ్చిందికాబట్టి మరొక విషయంకూడా మనవిచేస్తాను. ఉద్యమాల్ని అంటిపెట్టుకొని జీవించడంకూడా దౌర్బల్యలక్షణంగానే కనిపిస్తుంది. ఉద్యమాలంటే ఇక్కడ కేవలం సాహిత్య ఉద్యమాల దృష్టితోనే చెబుతున్నానుగాని సామాజిక ఉద్యమాలను గురించి మాత్రం కాదు. ఏ ఉద్యమమైనా ముందు ఒక వ్యక్తితోనే ప్రారంభమవుతుంది ఆ వ్యక్తి ప్రతిభాసామర్థ్యాలు పటిష్ఠమైనవైతే ఆ ఉద్యమం విస్తరిస్తుంది. అనుయాయులు ప్రబలిపోతారు. ఈ పద్ధతినే సాహిత్య ప్రక్రియలో తగదంటాను. అనుయాయులెంతగా ప్రబలితే ఉద్యమకర్తకంత కీర్తి లభిస్తుంది. అంతే కానీ. అనుయాయులు కేవలం నామమాత్రులే! ఉద్యమాన్ని ప్రారంభించే వ్యక్తి దానికి కొన్ని నియమాలూ, సిద్ధాంతాలూ నిబంధిస్తాడు. అనుయాయులంతా వాటిని అనుసరించి, ప్రచారం చేయడంలోనే తమ శక్తినంతా ఖర్చుపెట్టాలి. ఆ ఉద్యమ సిద్ధాంతాలు శక్తివంతమైనవైతే, ఉద్యమకర్త వాటిని శక్తివంతంగా చెప్పగలిగితే— దానికి వేరేప్రచారం ఎందుకు? ఆ ప్రచారానికి తక్కిన వాళ్లంతా తమ శక్తినంతా వ్యయించడమెందుకు? ఆ శక్తిని మరొక ప్రయోజనానికి వినియోగించవచ్చునుకదా.

పై వాడి సిద్ధాంతాలకు తక్కిన వాళ్లంతా ఎప్పుడైతే 'కట్టుబడ్డారో అప్పుడే స్వీయవ్యక్తిత్వాన్ని కోల్పోతారు. కోల్పోయిన తమ వ్యక్తిత్వస్థానంలో ఉద్యమకర్త వ్యక్తిత్వం చోటు చేసుకుంటుంది. ఈ అస్వస్థత అంతా ఒక భాషలో ఉద్భవించిన ఉద్యమానికి అదే భాషకు చెందిన అనుయాయుల విషయంలోనే! వేరొక భాషలోని ఉద్యమ సిద్ధాంతాల్ని స్వీకరించి మరొక భాషలో దాన్ని స్థాపించిన మొదటి వ్యక్తికి ఈ అనుయాయితాదోషం అంటగట్టడం న్యాయంకాదు. ఎందుకంటే తనభాషలో ఆ ఉద్యమానికి అతడే ఆద్యుడు కాబట్టి!

కవి స్వీయవ్యక్తిత్వం కోల్పోవటంతో రచన మౌలికతను కోల్పోతుంది. ఏదో అనువాదంలా తయారవుతుంది. పై భాషలోని సిద్ధాంతాల్ని స్వీకరించేటప్పుడు ఆ ఉద్యమకర్త వాటిని తనదేశీయ వాతా

వరణాని కనుకూలంగా మార్చుకుని, స్వీయవ్యక్తిత్వ శైలిని ఉద్ధరించుకున్నప్పుడే అందులో మౌలికత సాధింపబడుతుంది. ఈ పద్ధతి మన భాషలో శ్రీ శ్రీ చేశారు. మళ్ళీ అనుయాయుల్లో పై దోషం అనివార్యమైపోతుంది.

ఈ కారణంగా ప్రతిభావంతుడైన కవి ఒక ఉద్యమానికి అనుయాయికాడు. కారణాంతరాలవల్ల అలా కావలసివస్తే ఉద్యమంలక్ష్యాల్లో మార్పయినా జరుగుతుంది. లేక పాతసూత్రాలకు కొత్త భాష్యాలైనా బయలుదేరుతాయి. దానితో ఆ ఉద్యమంతో మరోశాఖ బయలుదేరుతుంది. అది ప్రమాదమనండి, ప్రయోజన మనండి జరిగి తీరుతుంది. అతడే అనుయాయికాక స్వీయవ్యక్తిత్వంతో లేచి నిలబడిఉంటే ఈ బెడద ఉండేదికాదు. ప్రతిభావంతులు ఇద్దరూ, ముగ్గురూ ఒక ఉద్యమంలో అనుయాయులైతే ఆ ఉద్యమం శాఖోపశాఖలుగా చీలి కొంతకాలానికి ఆ ఉద్యమం స్వరూపస్వభావాలే మారిపోతాయి లేక ఆద్యుని ప్రతిభా చట్రంలో చిక్కిన వాళ్ళుకూడా బిగింపబడిపోయి, నామమాత్రంగా మిగిలిపోవడమైనా జరుగుతుంది.

సామూహిక వ్యక్తుల సిద్ధాంతాలకు కట్టుబడిన కవిత సమాజంలోకి ప్రవేశించగలదేమోకాని, వ్యక్తిలోకి చొచ్చుకొని పోలేదు పైనుంచి తెచ్చిపెట్టుకున్న సిద్ధాంతనిబంధనల్ని త్యజించిన నిసర్గమైన కవిత—తనకాళ్ళమీద తానులేచి నిలబడగలదు. దాని గురి సరాసరి వ్యక్తిలోని అంతరాంతరాల్లోకి దూసుకుపోతుంది. అక్కడ్నించి మనిషిలో మార్పుతేవడానికి ప్రయత్నిస్తుంది. ఇలాంటి నిసర్గమైన కవిత, మనిషి ఆత్మలోకి తొంగిచూచే కవిత—ఇజాలన్నింటినీ త్రెంచుకొని—ఇప్పుడిప్పుడే తెలుగులో వెలువడుతున్నది. ఇది ఎంతో ముదావహమైన సంగతి. వేగుంట మోహనప్రసాద్, పరిగి రాధాకృష్ణ గార్ల కవిత్వం ఈ రకానికి చెందినది.

మన సాహిత్యంలో భావకవిత్వమనండి, అభ్యుదయ కవిత్వ మనండి—వాటికి సామూహికమైన కొన్ని సిద్ధాంతాలూ, లక్షణాలూఉన్నాయి. కవి ప్రతిభను తమ పరిధిలోకి బంధం చెయ్యడమే వాటి పని. ఆ ఉద్యమాలలో కృష్ణశాస్త్రి, శ్రీ శ్రీ తర్వాత ఎవరు బ్రతికి బట్టకట్టారు? వటవృక్షం నీడలో మరొక చెట్టుకు జీవితమున్నదా? స్వీయ వ్యక్తిత్వం ముద్ర కవి ప్రతిభాసంపదకు గీటురాయి. ఈ సంపద ఎంత బలంగా ఉంటే ఆ ముద్ర అంత దృఢంగా ఉంటుంది.

ప్రతిభ వ్యక్తిగతమైనది. అది మరో వ్యక్తిత్వంతో ముడివడదు. ముడివడిందా తన్నుతాను చంపుకున్నదన్నమాట.

దిగంబరకవులు ఆరుగురూ ఒక వ్యక్తిత్వాన్ని ప్రదర్శించడానికి ప్రయత్నిస్తున్నారు. ఈ ప్రయత్నమే వీరి శైలినీ, శిల్పాన్నీ ధ్వంసంచేసింది. అందువల్లే 'దిక్'లలో ఎన్నిహంగులున్నా అసలు కవితాశక్తి నశించింది. పోనీ వీరికి కవిత్వం చేత రాదందామా, అంటే—అలా అనడానికి వీల్లేదు. ఎందుకంటే వీరిలోనే కొందరు అప్పుడప్పుడూ దిగంబరకవితకు సంబంధంలేని కవితల్ని వ్రాసి ప్రకటిస్తున్నారు. అందులో స్వీయవ్యక్తిత్వం ఉంది. శైలిఉంది. శిల్పం ఉంది. కావలసినంత భావుకత ఉంది. కానీ, దిగంబరకవిత్వంలోకి వచ్చేలోపల అంతశక్తీ ఎండు తేలిపోతోంది. దీన్ని వీరి వ్యక్తిగతమైన లోపం అనలేము. సామూహికతవల్ల సంక్రమించిన జాడ్యంతప్ప మరొకటికాదు.

వీరి అభిప్రాయాలు వీరికే అన్వయించవు—అని మొదట అనుకున్నాము. దాన్నిగురించి కొంత వివరంగా తెలుసుకుందాము.

చెప్పిచేసేవాళ్ళు కొంతమంది. చెప్పకుండా చేసేవాళ్ళు కొంతమంది. ఆ చేసేది విశ్వశ్రేయోదాయకమైనదైతే చెప్పకుండా చేసేవాళ్ళకి ప్రథమ స్థానం, చెప్పిచేసేవాళ్ళకు ద్వితీయస్థానం ఇవ్వవచ్చు. ఈ రెండు తరగతులూకాక మరొక తరగతి

వారున్నారు వీరు పైకిచెయ్యమూఅని చెబుతూ ఉండి మబ్బులేని వర్షంలాగా హఠాత్తుగా చేసిపారేస్తారు వీళ్లని చమత్కారులు అని మన్నించవచ్చు. ఈ మూడురకాలవారూ ముందూవెనకలుగా మన్నింప తగినవారే!

పోతే, వీళ్లు ముగ్గురూకాక మరొక తరగతి వాళ్లున్నారు. వీళ్లు చేస్తామని చెబుతూ చివరకు ఏమీగావెయ్యకుండా ఊరుకుంటారు వీళ్ల నేమనాలి?

సాహిత్యప్రభావం కూడా ఇన్ని పద్ధతుల్లో ఉంటుంది. ఒకరకమైన కవిత్వం ఉంది. దాన్ని చదివేప్పుడు మనలో ఎలాంటి మార్పూ కనిపించదు. చదివి ముగిసినపిమ్మట మనలో దాని ప్రభావం అంతర్గతంగా ప్రారంభమవుతుంది. అది ఉద్దేశించిన ప్రయోజనంవైపుకు మన ఆలోచనల్ని మరలిస్తుంది. ఈ పని మన ప్రయత్నంతో పనిలేకుండా జరిగిపోతుంది. మన ఆలోచనలు క్రియారూపం దాల్చిన పిమ్మటే ఆ కవిత్వంయొక్క ప్రభావం అంతటిదో తెలియవచ్చి మనల్ని ఆశ్చర్యచకితుల్ని చేస్తుంది. ఇది చెప్పకుండా చేసేవాళ్ల పద్ధతికి చెందినది.

మరొక రకమైన కవిత్వం ఉంది ఇది పైకి విరోధాభాసంగా మనకు కనిపిస్తుంది. కాని మన ఊహలమీద దాని ప్రభావం తద్విరుద్ధంగా ఉంటుంది. పైకి చెడుఅర్థాన్నిస్తుంది. అంతరార్థంతో మనల్ని మంచి వేపుకు పయనింపజేస్తుంది. ఇది చమత్కారుల వర్గానికి చెందినది.

వేరొక రకమైన కవిత ఉంది దీన్ని చదువుతున్నప్పుడు ఎలాంటి అనుభవాన్ని కలిగిస్తుందో, మన మనస్సుమీదా అదే ప్రభావాన్ని వడవేస్తుంది. పైకి ఎంత అర్థాన్నిస్తుందో, అంతర్గతంగానూ అంతప్రభావాన్ని చూపిస్తుంది. ఇది చెప్పిచేసేవాళ్ల పద్ధతికి చెందినది.

ఈ మూడు పద్ధతులూ శ్రేయోదాయకమైనవే. వీటిని వరుసగా ప్రథమ ద్వితీయ, తృతీయ శ్రేణులుగా ఆమోదింపవచ్చు. ఈ తరగతికిచెందిన వ్యక్తిత్వాల్నిగాని, కవిత్వాల్నిగాని హృదయపూర్వకంగా ఆహ్వానించవచ్చు.

సమాజంలో ఏ మార్పుని ఆశించి కవి ఎంత ఆవేశంతో అయితే చెబుతాడో దాన్ని చదివేప్పుడు పాఠకునిలోనూ అంత ఆవేశం కలగాలి. అదే సాహిత్య ప్రక్రియా ప్రయోజనం. అలాంటి ప్రయోజనం దిగంబరుల కవిత్వంలో మనకు కనిపించదు పైగా, తనలో ఏదో లోపం పెట్టుకుని సిఫిలిస్—ప్రక్కింటివాడిని ఆశ్లీలాలుకూసేవాడిమీదవేసే అసహ్యంలాంటిది వీరిమీద మనకు కలుగుతుంది.

వీరి కవిత్వం చదివితే—

'మీా గుండెలు కుతకుత ఉడుకెత్తాలి
ఉడుకెత్తిన గుండెల్లో కొత్తరక్తం పుట్టాలి
పుట్టినరక్తం మీా నరాల కాల్వల్లో
సుళ్లుతిరిగి నాట్యంచేయాలి
మీా మస్తిష్కంలో నిర్మించుకున్న
అడ్డుగోడలు పడగొట్టాలి
అంటువ్యాధిలాంటి
అజగరంలాంటి
గొంగళీపురుగు భావాలు భస్మంచేయాలి
నిర్మలమైన భావవీచికల్ని
హాయిగా ప్రసరింపజెయ్యాలి' అంటారు వీరు.

నిజమే. మంచికవిత్వం చదివినప్పుడు పాఠకునిలో ఒకరకంగా ఇలాంటి మార్పు, అనుభూతి కలుగవచ్చునేమో. కానీ వీరి కవిత్వం చదివినప్పుడుమాత్రం కాదు ఇలా పైకి ఆడంబరాలు పలుకుతారు. చివరికవి ఆడంబరాలుగానే మిగిలిపోతాయి.

'మొత్తంమీాద యీా 30 సంవత్సరాల కాలంలో కవితావికాసం అభ్యుదయ కవితాయుగం, వచనకవితావికాసం అనే రెండు దశల్లో జరిగిందని చెప్పవచ్చు. దిగంబర కవిత్వం మూడవదశ అవునా, కాదా అనే విషయం తేల్చడానికి కొంతకాలం పడుతుంది' అని కుందుర్తి దాని విషయం కాలానికే వదలిపెట్టారు.

కె. వి. రమణారెడ్డి – వీరిది 'సాహిత్యస్టంటు' అనీ,–గుహ్యాంగాల వర్ణన, సెక్సుసరదాలమోజు–ఇవన్నీ 'మానసికరుగ్మతకు' లక్షణాలనీ – వీరే మరొకరి మీద విసరినరాళ్లను తిరిగి వీరిమీద విసరుతున్నారు.

'వెనుకటి సర్రియలిజమ్‌లాగే యీ ఉద్యమం ఎత్తుగా, ఏపుగా పెరిగి కాయని కొబ్బరిచెట్టులాగా, వారి మాటల్లోనే చెపితే 'మాచకమ్మ'లాగే మిగిలి పోతుంది' అని రామమోహనరాయ్ అంటున్నారు దిగంబర కవిత్వాన్ని కాపులేని కొబ్బరిచెట్టుతో పోల్చటంలో దానినుంచి ప్రయోజనాఫలితం లేకపోగా, ఆనందప్రచ్ఛాయల్నిగూడా ఆశించడంకూడా వృథా అనేనా దీని అర్థం?

వీరిది 'షాక్ట్రీట్‌మెంట్' కవితఅని మొట్ట మొదట శ్రీకృష్ణగోపాల్ అగ్రవాల్ 'లహర్' హిందీ సాహిత్య మాసపత్రికలో దిగంబరకవులమీద వ్యాసం వ్రాస్తూ అన్నారు. మనవాళ్లుకూడా దీన్ని విద్యుచ్ఛికిత్సగానూ, మనస్సును ఆఘాతపరిచేదిగానూ భావిస్తున్నారు.

'దిగంబరకవిత కేవలం తిట్టుకవిత్వంగా కనిపిస్తున్నదంటే ఆశ్చర్యపడవలసిన దేమీలేదు' అని ఆర్. ఎస్. సుదర్శనం అంటున్నారు. ఇలా ఈ దిగంబరకవితను వట్టికవితగానూ, తిట్టుకవితగానూ జమకడుతున్నారు.

మన సాహిత్యంలో దీన్ని తిట్టుకవితస్థానంలో జమకట్టినప్పుడు, ఆ తిట్టుకవితలోకూడా దాని స్థానం ఎంతటిదో తెలుసుకోవాలంటే ఇక్కడ ఆరుద్ర ఏమన్నారో వినడం చాలా అవసరం.

'అన్యాయాలనూ, అక్రమాలనూ, అమానుషాలనూ ప్రతియుగంలోనూ, ప్రతితరంలోనూ, ప్రతికవీ ఖండిస్తూనే ఉంటాడు. కళ్లముందు దారుణాలు జరుగుతూఉంటే కవి నోరు శపించక మానదు. కానీ, ఈ కవులు వాల్మీకిలాగకాక, కూచిమంచి జగ్గకవిలాగ తిడుతున్నారు. అందుకే కవిత్వం తగ్గి కసి పెరుగుతూంది. క్షమించడం చాతకానివాడు దానవుడిగా మారడానికి అవకాశాలు ఎక్కువ.'

ఈ మాటలే వ్యాసానికి భరతవాక్యం పలుకుతున్నాయి. పోతే దిగంబర కవిత్వోద్యమం సాహిత్య చరిత్రకారులకు ప్రయోజనం కావచ్చునేమోకాని, సామాజికస్వస్థతకు ఉపయోగించే గుణం ఇందులో మృగ్యమని తేలుతున్నది.

---



# వెన్నెల

## శ్రీ డి. ప్రభాకర్

మా వూరికి యిరుగున బంగాళాఖాతం, పొరుగున బొంగరాలబీడూ వున్నై. బంగాళాఖాతం నుండి బొంగరాలబీడు కెళ్ళినా, బొంగరాలబీడు నుండి బంగాళాఖాతంకేసి వెళ్ళినా మధ్యపారిజాతం కన్పించి పలకరిస్తుంది. పారిజాత మనేది మనిషిపేరు కాదు! మనిషి తల్లోని పువ్వుపేరుకాదు! మరి... పువ్వునుకన్న మొక్కపేరూ కాదు!! ఎన్నో తలలూ, పూలూ, పూలమొక్కలు కలిపి పూజించే ఓ భవంతి పేరు అది!

ఆ పేరుగల భవంతి బహుపెద్దది. వేయి రూపాయల నోటుకు పదివందరూపాయల నోట్లను గానీ లేదా యితర చిల్లర నోట్లనుగానీ కడుపులో దాచుకోగల శక్తి వున్నట్లు అలాటివిలాటివి కాని అయిదారు అందమైన మేడల్ని, మేడల్లోని మనుషుల్ని తనలో యిముడ్చుకోగల శక్తీ, స్థలమూ పారిజాతానికున్నాయ్. ఈ శక్తుల్ని చూసుకుని పారిజాతం, పారిజాతాన్ని చూసుకుని మావూరూ (అప్పుడప్పుడూ మా జిల్లాకూడా) ఒహోటే గర్వపడి పోవటంకద్దు.

ఎంతో పెద్దతలకాయలో బహుకొద్ది తెలివి వున్నట్టు అంతపెద్ద భవంతిలో ఓ పరిమిత కుటుంబం నివసిస్తోంది. ముగ్గురు సభ్యులుగల ఆ కుటుంబంలోని ఒకర్ని మావూరు పొమ్మనక పోయినా కాదు రమ్మని బలవంత పెడుతున్నట్టుందీ— ఆయన పాపం పదేపదే జబ్బుపడుతూ లేస్తూ కరెంటు చెప్పినట్లలా ఆడే వాతావరణం మధ్య పడుంటాడు.

ఇక మిగిలిన యిద్దరూ మా వాడకు చిలకా గోరింకలు చిలక మధురవాణేగాని పేరుమాత్రం సుధారాణి. మరిగోరింక పేరేమో వీరవెంకట సత్య కుబేరప్రసాద్ అని వాళ్ళ నాన్నగారంటూంటారు కాని గోరింక కష్టనష్టాల్ని సుఖదుఃఖాల్ని అతిజాగ్రత్తగా బేరీజువేసి కథలుగా చెప్పుకునేవాళ్ళు '[illegible] దేవేంద్రుడు' అంటుంటారు.

దేవేంద్రుడిప్పుడు పారిజాతంలో లేడు — మూడు బారలకారులో వున్నాడు. కారు ఛీ ఛీ వెధవ రోడ్లు అని విసుక్కుంటూ, దుమ్మువుమ్మకుంటూ పరుగెత్తుకువెళ్ళి పారిజాతం తాలూకు పోర్టికోలో ఆగి గాలి పీల్చుకుంది. తర్వాత 'దేవేంద్రుడుగారొచ్చేరహో' అని అరచింది రాజాగారి పంచకల్యాణిలా.

దాంతో దేవుడి పిలుపువిన్న భక్తపరమాణువుల్లా నలుగురు నౌకర్లు లోపల్నుండి పరుగెట్టుకొచ్చి వినయంగా చేతులు కట్టుకు నిలబడ్డారు.

దేవేంద్రుడు అప్పుడే టంకశాల్లోంచొచ్చిన కొత్తనాణెంలా, బాంకులోంచొచ్చిన సరికొత్త నోటులా తళతళలాడుతూ కారుదిగి, 'వెంకన్నా కార్లో సామాన్లు లోపలపెట్టించు' అన్నాడు.

వెంకన్న దేవేంద్రుడి ఆజ్ఞను శిరసావహించేందుకు కారుదగ్గర కెళ్ళేడు.

దేవేంద్రుడు మెత్తటిరోజా తివాచీమీద అతి మెత్తగా నడుస్తూ మెట్లెక్కి కుడివైపుగావున్న గదిలో కెళ్ళేడు.

గదిలో మల్లెపూవు పుల్లపారల్లాటి దుస్తుల్లో శుభ్రంగా తుడిచిపెట్టిన కమలాపండులావున్న కమలాదాసు (వాళ్ళావిడపేరు కమలాదేవికాదు) నెత్తెనపుమంచంపైని మెత్తనిపరుపుమీద కూచుని

టీపాయ్ అందిస్తూన్న యాపిల్‌ముక్కలు తింటూన్నాడు దేవేంద్రుణ్ణి చూడగానే అతనిడిలో పుత్ర వాత్సల్యం బ్రహ్మపుత్రవరదలా పువ్వెత్తున పొంగినట్టుంది, మాటల్లో పొరలింది.

'రా నాన్నా యివాళింత ఆలస్యమయిందేం'— కమలాదాసు తన బెడ్‌మీద కూచుందుకు చోటు చూపుతూ దేవేంద్రుడితో అన్నాడు.

దేవేంద్రుడు తండ్రికేసి ప్రసన్నంగా చూస్తూ వెళ్ళి అలిసిపోయిన సూచనగా 'హూష్'అంటూ మంచంమీద కూచున్నాడు.

'ఇవాళ కొస్త ఆలస్యమయింది నాన్నగారూ! నా ఆలీసానికేంగాని డాక్టరొచ్చేడా? మీ టెంపరేచరెలా వుందన్నాడు? సుధ మందిచ్చిందా? మీరు హార్లిక్స్ తాగేరా? మరి నీరసంగా వున్నట్టున్నారేవిటి?'

తనయుడి మాటలకీ, వాటిలోని ప్రేమపూటకీ తండ్రి తబ్బిబ్బయేడు ఆనందాన్ని దాచుకోలేకపోయేడు. ఆప్యాయతను కూడా దాచుకోలేకపోయేడు.

'అన్నీ సవ్యంగానే వున్నై. నేను సలక్షణంగానే వున్నాను. నువ్వాట్టే గాభరాపడక, వెళ్ళి స్నానం చేసి భోజనంచెయ్. వెళ్ళు'—అన్నాడు దేవేంద్రుడి వీపు నిమురుతూ ప్రేమగా!

దేవేంద్రుడు లేచి టీపాయ్‌మీది యాపిల్ ముక్క నోదాన్ని నోట్లో వేసుకుని నములుతూ 'యేపిల్స్ బాగున్నాయ్‌గదూ నాన్నగారూ శ్రీనగర్ నుండి తెప్పించేను' అన్నాడు

'బాగానే వున్నాయ్‌గానీ కమలావళ్ళు రావటం లేదుట్రా నాన్నా.'

'ఇక్కడ కంతమంచివి రావటంలేదు నాన్నగారు. ఇందుకే నాగపూర్ లెటర్ వ్రాసాను. వస్తై. మరి నే స్నానంచేసొస్తా నాన్నగారూ.

దేవేంద్రుడు తలుపుతీసి బయటకొచ్చి తలుపు వాదిలేసేడు.

మేడ మెట్లెక్కిపోతూ అటుగా వెళ్తున్న 'మా లచ్మి'ని అడిగేడు—'అమ్మగారెక్కడున్నారే?' అని.

'తల్లెప్పైయిన రూపుగార్డెన్లో వుండారండి.'

దేవేంద్రుడు రెండేసి మెట్లను ఒక్కంగలో ఒక్కొంతస్తును రెండేసి అంగల్లో దాటుకుంటూ పైకెళ్ళేడు.

పైకి పాకుతున్న సన్నజాజితీవెను పట్టుకుని నిలచేడు. చూసేడు.

నీలాకాశంలో నిండుచంద్రుడున్నాడు.

నింగి నంటుతున్న మేడమీద మల్లెచెండు లాంటి సుధారాణి వుంది.

సుధారాణి చుట్టూ పండువెన్నెల వుంది.

మధలు నిండిన వెన్నెల్లో సుధారాణి పసిడి గిన్నెలోని పాయసంలా, గాజుకప్పులో అందంగా అమర్చబడిన అయిస్ క్రీమ్‌లా, అప్పుడే కాగితపు మూతతీసిన కొత్త సబ్బుబిళ్ళలా వుంది.

వెన్నెల్లో సుధారాణి చూసిన దేవేంద్రుడు 'తన్మ' యానంద భరితుడయేడు. అడుగులో అడుగు వేసుకుంటూ వెళ్ళి సుధారాణి భుజాలపై చేతులు వేస్తూ, 'సుధా' అన్నాడు గొంతులో పానకం బుగ్గ పడ్డట్టు తీయగా తీయతీయగా!

సుధ వులిక్కిపడ్డది. 'మీరా' అంది. దేవేంద్రుడికి దగ్గరగా జరుగుతూ 'ఎప్పుడొచ్చేరు' అనడిగింది.

'ఏమో!'

'అదేవిటి?'

'అవున్సుధా! ఎప్పుడో కొన్ని మెట్లెక్కిన జ్ఞాపకం. ఆ తర్వాత పాలవెన్నెల, పాలవెన్నెల్లో అమృతభాండంలా నువ్వూ నీచుట్టూ నేనూ అదే జ్ఞాపకం.!'

'కొంపదీసి యే రచయితల మహాసభకన్నా ప్రారంభోత్సవం చేస్తున్నారేమిటి దొరగారు కవిత్వం చెప్తున్నారు!'

'నోనో! 'ఇన్స్పిరేషన్' కావాలంటే యీ రచయితగాళ్లం యిస్తారు-నువ్విస్తావ్...యీ వెన్నెల యిస్తుంది!'

'సరిసరి!'

'కాదు సిరిసిరి! నీ నడుములోన సిరి...నడకలోన సిరి...నీ కళ్లలోన సిరి చెక్కిళ్లలోన సిరి!''

సుధారాణికి నవ్వాగలేదు. కట్టుకున్న చీర తొడుక్కున్న జాకెట్టుకూ మధ్యగా అరిటాకులా వున్న పొట్ట అందంగా మడతపడేలా నవ్వింది. నవ్వుతూ అంది – 'హ్వా హ్వా విటండీ...హివాలిలా...'

దేవేంద్రుడి కానవ్వెంతో నచ్చింది. నవ్విన పెదాలు యెంతెంతో నచ్చేయి. తనూ సన్నగానవ్వుతూ 'నిజం సుధా నువ్వు నాకు దొరికిన అమూల్య రత్నానివి. ఈ వెన్నెల వెల్లువ నీలో కొత్త కాంతులను రేపి నీ అందానికి నా ఆనందానికి అవధుల్లేకుండా చేస్తోంది!'.

అటూ యిటూ వెన్నెల! దేవేంద్రుడి మాటల్లో వెన్నెల. వెన్నెల్లో మధువును మరపించే మత్తు! వీటితో సుధారాణి పొంగి ఓరగా చూస్తూ ఓరగా నవ్వుతూ ముచ్చటగా పెరిగిన దేవేంద్రుడి ముక్కుపుచ్చుకుని ముద్దుగా కుదుపుతూ అంది– 'ఛీ చిలిపి!' అని!

దేవేంద్రుడు 'నువ్వో'అంటూ సుధారాణి చేయిపుచ్చుకుని దగ్గరకు లాగుతూ తను దగ్గరకు పోయేడు.

సుధారాణి చిలిపిగానే చేతిని లాక్కుని ఛెంగున దూరంగావెళ్లి నిలబడింది—'నన్నంటుకో చూద్దాం' అన్నట్టు.

దేవేంద్రుడు వుల్లాసంగా సుధారాణికేసి అడుగు లేస్తూ ఒక్కసారిగా ఆగిపోయేడు. ఎగాదిగా చూస్తూ అన్నాడు –

'అంతా బాగానేవుందిగాని సుధా నువ్ కట్టుకున్న చీరే యేంబాగులేదోయ్! మరీ గాంధీగారి విదేశీవస్త్ర బహిష్కరణోద్యమంనాటిదిలా వుంది!'.

'అయ్యయ్యో యిది కొని రెణ్ణాళ్లేనండీ అవుత!'

'రెణ్ణాళ్లు! అంటే అరవై ఒకటి ఇంటూ ఇరవై నాలుగ్గంటలు! ఇన్నిగంటలు నీ వంటిమీద, మన యింటిమీద, స్టీమ్‌లాండ్రీలో స్టీలుబీరువాల్లో కాపురంచేసిన చీర పాతదికాక కొత్తదెలా అవుతుంది?'.

'అయితే మళ్లీ వచ్చేపొద్దానికి నేమా పాతబడిపోతానన్నమాట!'

'ఏయ్ చిలిపి!'—ఈసారి దేవేంద్రుడు సుధారాణి ముఖంమీద, కన్నులకింద, పెదవులపైన అమరివున్న సంపంగిపువ్వును దొరకబుచ్చుకున్నాడు.

'అబ్బ!'

'అబ్బాలేదు డబ్బాలేదు. ముందువెళ్లి మొన్న కొన్నావే 'లైట్ ఎల్లో శారీ' అది కట్టుకురా!'

'ఇప్పుడది యే బీరువాలోవుందో నే వెతకలేను బాబూ!'

'అయితే వుండు!'—దేవేంద్రుడు పిట్టగోడ దగ్గరకెళ్లి కిందికి చూసేడు. వెంకన్న కనిపించేడు. దేవేంద్రుడు టపటప చప్పట్లు చరిచేడు. వెంకన్న తలెత్తగనే 'పైకి ర'మ్మని అరిచేడు.

మరునిముషంలో వెంకన్న మెట్లదగ్గర వినయంగా వాలిసేడు.

'చూడు వెంకన్నా! యీ పూట భోజనం యిక్కడే చేస్తాము టేబులూ చైర్సూ...అవన్నీ యేర్పాటుచేయి! తర్వాత...సాంబమూర్తిగారి షాపుకెళ్లి—మొన్న అమ్మగారో చీర కొన్నారు—అలాటిదే కొని పట్టుకురావాలి. ఏమి?'.

'అలాగే బాబూ !'

'సరే నువ్వెళ్ళు. చూడూ...వెళ్తూ గుర్నాథం గారి నడిగీ...' దేవేంద్రుడు వాక్యాన్ని మధ్యలో తుంచి సుధారాణికేసి తిరిగి 'యెంత తీసికెళ్ళమంటావోయ్' అనడిగేడు.

సుధారాణి సుతారంగా కుడిచేతిని గాలిలోకి చాచి అయిదువేళ్ళను చిత్రంగా ఆడించింది.

దేవేంద్రుడు వెంకన్నకేసి తిరిగి 'అయిదొందల్తీసికెళ్ళు వెంకన్నా! సాంబమూర్తిగా రెంతడిగితే అంత యిచ్చేసిరా! ఏమి?' అన్నాడు.

'అలాగే బాబూ'—వెంకన్న మెట్లు దిగేడు.

'వూవూ! మీరూ కిందకు పదండి'—సుధారాణి దేవేంద్రుడి వీపుమీద రెండుచేతులేసి మృదువుగా ముందుకు నెడుతూ అంది.

దేవేంద్రుడు చటుక్కున వెనక్కు తిరిగి సుధారాణి చుట్టూ చేతులో కట్టువేసి 'ఎందుకూ?' అన్నాడు ముద్దుగా, ముద్దగా.

'ఎందుకేవిటి భోజనం చేయరా?'

'ఇవాళ భోజనం యిక్కడికే వస్తుంది'

'అయితే స్నానంకూడా యిక్కడే చేస్తారా!'

'అసలు చేయం!'

'ఎబ్బే! వళ్ళంతా చెమట ముఖమంతా జిడ్డు—స్నానం చేయర్రు! ఛీ ఛీ నన్నొదలండి!'—సుధారాణి ముచ్చటగా ముక్కుమూతి తిప్పుతూ దేవేంద్రుడి చేతులు విడిపించుకు పరుగెత్తింది.

దేవేంద్రుడు పట్టుకోబోయి, పడబోయి నిలదొక్కుకున్నాడు.

సుధారాణి మెట్లదగ్గర నిలబడి కోట్లకొద్దీ ఖరీదైన నవ్వులు రువ్వుతూ 'రండి కిందకి' అంది. దేవేంద్రుడు 'ఏడుపుమొహం పెట్టి రానన్నట్టు తలూపేడు.

'అయితే వుండండక్కడే!'—సుధారాణి బరబర మెట్లు దిగేసింది; దేవేంద్రుడు తనకొంగు పుచ్చుకుని దిగొస్తాడన్న ధీమాతో ఠీవిగా దిగేసింది.

దేవేంద్రుడికి సుధారాణి కొంగుదొరికితే ఆవిణ్ణి మేడమీదకు లాగేవాడే కాని...దొరకలేదు గనక వుస్సురంటూ కిందకు దిగొచ్చేడు. సుధారాణి మెట్ల దగ్గరే వుంది. వుడికిస్తున్నట్టుగా నవ్వింది.

దేవేంద్రుడికి నిజంగానే కోపమొచ్చింది.

కాని...అప్పుడే ఓ టెలిగ్రాం వచ్చింది! ఎన్నో గ్రాములు సంతోషాన్ని తెచ్చింది! అన్ని కిలోగ్రాములు తూగే దేవేంద్రుడు దూదిలా తేలిపోతూ—'సుధా 'సుధా!! రాధొస్తుందోయ్'—అన్నాడు ముఖమంతా నోరు చేసుకుని, నోటినిండా సంతోషం నింపుకుని.

సుధారాణికూడా ఆనందపడిపోతూ 'నిజంగానా! ఎప్పుడొస్తుంది' అంటూ దేవేంద్రుడి చేతిలోని కాగితం లాక్కుంది.

గొప్పోడు గొప్పగా ఆనందిస్తున్నప్పుడు పలకరించినవాడు గోరంత వాడైనా వాడికి కొండంత సాయం చేస్తాడు గొప్పోడు—ఈ సంగతి మాలచ్చిమికి 'అనుబవమ్మీద' తెల్సింది. అందుకే ప్రస్తుతం దేవేంద్రుడి ఆనందాన్ని గమనించి, తన అవసరాన్ని గ్రహించి 'ఓరుబాబూ ఒత్తుంది' అనడిగింది; వస్తున్నది రాధ అని తెలిసి కూడా అడిగింది!

'చెల్లాయొస్తోంది లచ్చిమీ చెల్లాయ్!'

'ఓయ్యా! రాదమ్మగోరే! మ రాదమ్మగోరే! యెప్పుడొత్తున్నారు బాబూ! యెప్పుడు? యెప్పుడు?'—వెన్నెలొస్తుందనగనే సంబరపడిపోయే చకోరపక్షిలా సంబరపడిపోయింది మా లచ్చిమి, కంఠం చివర్నుండి నుదుటివరకు!

'ఎప్పుడూ యెప్పుడూ అని గంతులేయటం కాదు. ముందెళ్ళి పైనగది శుభ్రంచేసి అద్దంలా వుంచాలి!'—దేవేంద్రుడికి మాలచిమ్మనాలకం చిరాకెత్తించినట్టుంది కసురుకున్నాడు.

'ఓయబ్బ సంబడం! అమాశకి పున్నానికి పుట్టింటికొచ్చే చెల్లెలికోసంకూడా యింత అంగామా

వు...వూ!' అంది మనసు(లో) మా అచ్చి. మనిషి మాలచ్చిమ్మమాత్రం గది శుభ్రంచేసేందుకు బయ ల్దేరింది.

దేవేంద్రుడు సుధారాణికేసి తిరిగేడు.

'ఏయ్ శ్రీమతీ! ఉదయాన్నే నువ్వే లేచి చేస్తావో నాయర్‌చేత చేయిస్తావో ఏడుగంటలకల్లా రాధ కిష్టమైన టిఫిన్లన్నీ సిద్ధమైపోవాలి. నువ్ మాత్రం ఆరుగంటలకల్లా డ్రైవింగ్ సీట్లో వుండాలి!'

'ఆఁ! నేనేం డ్రైవ్‌చేయను ఆ డొక్కు కారుని! కొత్తది కొనమంటే కొంటాను కొంటాను అని...' సుధారాణి బుంగమూతి పెట్టింది.

దేవేంద్రుడు గిలగిల్లాడిపోయేడు.

అదే సమయానికి మరో జీవుడుకూడా గిలగిల్లాడి పోయేడు.

ఆ జీవుడు దేవేంద్రుడు, సుధారాణిల యెదుట లేడు దేవేంద్రుడి ఆఫీసురూమ్ అనబడే అందాల మ్యూజియంపక్కని చిట్టాలగదిలో వున్నాడు.

అతడికి బొడ్డుకోసి పెట్టినపేరు వెంకట గురునాధరావు. కాలేజీలో చదువుకున్నపేరు గురునాథ్. ఎంతైనా చదువుకున్నపేరు గాబట్టి గురునాథ్ కాన్నాళ్లా నిరుద్యోగిగా తిరిగేది, చివరికి దేవేం ద్రుడిదగ్గర గుమాస్తాగిరీలో చేరి చుట్టూ బరిగీసు క్కూచున్నాక గుర్నాథంగా మారిపోయింది.

గుర్నాథం కళ్లముందు కొండశిఖరంతలావు ఓమోస్తరు నాపరాయంత వెడల్పూ వున్న చిట్టా పుస్తకాలున్నాయిగాని అతగాడి చెవులముందూ, మనసు ముందూ దేవేంద్రుడూ, సుధారాణి వున్నారు. వాళ్ల సంభాషణలు వింటూ సరాగాలు వూహించుకుంటూ బి ఎ పాసయేక తన్మూచిపిన సినిమాలోని రతీమన్మథుల నృత్యం జ్ఞాపకంచేసుకుంటూ సంబరపడిపోతున్నాడు. పోతున్నవాడల్లా ఆగేడు. హాల్లోని [illegible]లూ కిలకిలలూ వినిపించటం మానేసినై.

గుర్నాథానికి బుర్ర పనిచేయటం ప్రారంభించింది. 'దేవేంద్రుడితో పనుందన్నావ్ లేచి వెళ్లవేం' అని సతాయించింది.

గుర్నాథం మెల్లిగా లేచి అడుగులో అడుగు వేసుకుంటూ హాల్లోకెళ్లేడు. హాలు ఖాళీగావుంది. నలుగు రైదుగురు నౌకర్లు సీసాలు పుచ్చుకుని, గిన్నెలు పుచ్చుకుని మేడమెట్లెక్కుతున్నారు దిగుతున్నారు. గుర్నాథం వాళ్లల్లో ఒకణ్ణి పట్టుకుని 'అయ్య గారేరీ?' అనడిగేడు.

'పైన యెన్నెట్లో భోంచేత్తున్నారు'

'అయినట్లేనా?'

'అప్పుడే యాడవుద్ది! కబుర్లాడుతూ తినే సరికి కాకుల్లేత్తై!'

గుర్నాథం నీరసపడిపోయేడు. అతినీర్సంగా అరగంటలు ఓ రెండు గడిపేడు. అయినా అయ్య గారు మేడదిగి తనగోడు వినేసూచనలేవీ కనిపించ లేదు. అలాగే తను మేడ ఎక్కి అయ్యగారికి తన గోడు నివేదించుకునే ధైర్యంకూడా కనిపించలేదు. అందుచేతనే మెట్లెక్కుతున్న వెంకన్నను పిలిచి ఓ అస్త్రం ప్రయోగించేడు.

'వెంకన్నా పైకెళ్తున్నట్టున్నావ్ నేనింటి కెళ్తున్నానని అయ్యగారితో చెప్తావూ?'

వెంకన్న అలాగేనని పైకెళ్లి కిందకొచ్చి 'అయ్యగారు మిమ్మల్ని పైకి రమ్మంటున్నారు' అని చెప్పేడు.

గుర్నాథం గురివిందంత సంతోషంతో కింద నుండి పైకెళ్లేడు.

పైన ఓ టేబులుంది. అందంగా వుంది. ఆకాశంలోంచి విరిగిపడిన ముక్కలా వుంది. మరీ మాట్లాడితే గిన్నెలో జున్నులావుంది. దానిముందు దేవేంద్రుడు (పక్కనే సుధారాణికూడా) వున్నాడు. దానిమీద బోల్డు అమృత కలశాలున్నై.

దేవేంద్రుడు — 'నిండుగా చంద్రుడు అందానికి ఆనందానికి ట్రేడ్‌మార్క్ డియర్' అంటూ ఓ వెండి గిన్నె అందుకోబోయి తలెత్తేడు. గుర్నాధాన్ని చూసేడు. అన్నంలో వచ్చిన మట్టిబెడ్డ న్యాపినట్టు చూసేడు. మట్టిబెడ్డని, అది రావటానికి కారణమైన వాడిని కాలికింద వేసి కుంకవ నలపగల శక్తి వుండీ, దేవేంద్రుడు తనమాటల్లో తీక్ష్ణత తగ్గించుకున్నాడు. మట్టిబెడ్డతో పని వుం(టుం)ది గనక తగ్గించుకోవటమే మంచిదనుకున్నాడు. చివరికి గుర్నాధంతో అన్నాడు

'ఏమండీ అప్పుడే వెళ్తున్నానని కబురు పంపేరా? ప్రొద్దుట చెప్పినవన్నీ వ్రాసేరా?'

'బ్రాంచి ఆఫీసు లెక్కలన్నీ రాసేశాను సార్.'

'మరి హెడ్డాఫీసు లెక్కలుగూడా చూసెయ్యండి'

గుర్నాధం దురదపెట్టకపోయినా బుర్ర వూరికే గోక్కున్నాడు ముందు 'మ్మెమ్మె' అని తర్వాత 'మధ్యాహ్నంకూడా భోంచెయ్యలేదు...' అనేసేడు.

దేవేంద్రుడి క్రోధం వచ్చింది. చచ్చేంతకోపం వచ్చింది. బీచిలో సుధారాణితో క్వాలిటీ ఐస్‌క్రీం తింటూ ఇసకలో నడుస్తున్నప్పుడు బాబూబాబూ అంటూ వెంటబడే బిచ్చగాడిమీద వచ్చేంత కోపమొచ్చింది. అంతకోపాన్ని నవ్వు వెనకంతకూ దిగమింగి మింగలేనిదాన్ని విషాదంగా మార్చేసి మాటల్లో కలిపేసేడు.

'మరి మధ్యాహ్నమే చెప్పలేకపోయేరా. వంట మనిషితో చెప్పించేవాళ్లం. సర్సరే కాసేపుండి భోంచేసివెళ్లండి!'

గుర్నాధం మనసు చివుక్కుమంది. అతడి కండల్లోంటిపెట్టుకున్న విలాసాలూ, యింకా అలాటి మసాలాలూ కండల్లో పాకి కరిగిపోయినప్పటికీ అతగాడి ఎముకలనిండిన బ్రతుకుతున్న అభిమానం మాత్రం దృఢంగానేవుంది. అంచేత అతడ్లో అంతోయింతో అహంకూడా వుంది. అవి రెండూ వుండబట్టే చివుక్కుమన్న గుర్నాధం మనసు కస్సుమంది.

'రేయ్ దేవేంద్రుడూ! మధ్యాహ్నం కూడా భోజనం చేయలేదంటే మధ్యాహ్నంకూడా యింటికెళ్లలేదని. అర్థంరా! అంతేగాని నాకు ఆకలవుతూంది నీ ఎంగిలిచేయి విదిలించూ అనికాదురా! అయినా రేయ్...నీ బాబుల పుణ్యాన నీకు బతికేందుకు ఆస్తీ అవకాశాలూ జంటపదాల్లా కలిసొచ్చినైరా! అందుకే అలా తిని యిలా మనగలుగుతున్నావా! నేను అలాటి వరాలేవీ సంపాయించలేకపోయేన్రా! అయినప్పటికీ పస్తులేనా వుంటానుగానీ నీముందు కూటికోసం దేబిరించనురా! నువ్ ఏడుస్తూ పెట్టే దానికోసం వాలేపట్రా! నువ్ నన్నేదో తప్పుగా అర్థంచేసుకుని వెధవ్వేషాలు వాగుతున్నావ్ జాగ్రత్త!'— అని గుర్నాధం దేవేంద్రుణ్ణి హెచ్చరించేడు లోలోపల.

అసలు మహారాజులా పైకే తిట్టేద్దామన్నంత కోపం వచ్చిందిగాని సరిగ్గా సమయానికి గుర్నాధంలోని గుమాస్తా [illegible] అరచింది —

'పిపాసి గుర్నాధం, గుర్నాధం కొడుకు ఎవ్వడో గుర్నాథమ్మా, గుర్నయ్య కొడుకైన ఓ గుమాస్తా గుర్నాధమూ! నువ్ దేవేంద్రుడి ఎక్స్‌పెన్సివ్ కుక్కవు కావు కరిచినా కడుప్రేమతో కట్టేసుకుంటాడు! నువ్ ఆఫ్టరాల్ వూరకుక్కగాడివి! నువ్ ప్రేమతో తోక వూపినా కర్రదెబ్బలు తగుల్తానవుంటాయ్. వాటికి అలిగి తొలగిపోయేవంటే నీకే నష్టం! బయట కాచుకుక్కుచున్న మరోవూర కుక్కొచ్చి యింట్లో చేరుతుంది నువ్ దిక్కులేని కుక్కవైపోతావ్! జాగ్రత్త!! తొందరపడి నోరుజారక శాంతించు!!'

గుర్నాధం శాంతించేడు. అతిగా శాంతించేడు గాబోలు మరీ దీనంగా అయిపోయేడు. చేతులు వూరికే నలిపేసుకుంటూ వినయంగా సంజాయిషీ చెప్పుకున్నాడు— 'నా వుద్దేశం అదికాదు సార్! మధ్యాహ్నంకూడా యింటికెళ్లలేదు. ఈ పూటైనా పెందరాడే వెళ్దామని.....'

దేవేంద్రుడదేం వినిపించుకోనట్లు సుధారాణి కేసి తిరిగి 'నా భోజనం అయిపోయిందోయ్' అన్నాడు.

సుధారాణి దేవేంద్రుడి వెండి కంచంలోకి చూపింది.

'ఇదేం! అన్నీ సగం సగం వదిలేశారు'.

'నువ్ తింటావని...' దేవేంద్రుడు నవ్వుతూ లేచేడు.

'ఆఁ నేనేం తిన్ను' – సుధారాణి కూడా లేచింది. చేతులు శుభ్రంగా తుడుచుకుంటూ మాలచ్మిని కేకేసింది. మాలచ్మి పరుగుపరుగున వచ్చింది.

'చూడవే లక్ష్మి యీ అయ్యగారు మరీ చిన్నపిల్లాడిలా అన్నీ వేయించుకుని వదిలేశారు. వాట న్నిటినీ వృధాగా పారెయ్యటందేఁకి వేరే తీసి పెట్టుకో తర్వాత నువ్వూ వెంకన్నా తినొచ్చు.'

'ఏవమ్మో రాణమ్మా! ఎంగిలి ఎత్తేత్తన్నాం గందా అని ఎంగిలికూడు తింటామనుకుంటున్నావేమో జాగ్రత్త! నీ మొగుడు తిని వదిలేసింది తింటానికి అంత యిష్టంగావుంటే నువ్ తిను. కష్టంగావుంటే బయట పారెయ్. అంతేగాని నన్నూ నా మొగుణ్ణీ తినమంటావేమిటీ! చేతుల్లో పైసల్లేకపోయినా గుండెల్లో అభిమానం గలోళ్ళం-వుంటే తింటాం లేపోతే పడుంటాం అంతేగాని ఎంగిలి కంచాల్లో కతకం...ఉఁ ఊఁ!' - అని సుధారాణిని పట్టుకుని మాలచ్మి దులిపేస్తుందనీ, దులిపేయాలనీ అనుకున్నాడు గుర్నాధం.

కాని మాలచ్మి అలా చేయలేదు. కాగా 'నీకేం వరం యిస్తాను తీసుకో!' అన్న భగవంతుని మాటలకు 'మహాప్రసాదం స్వామీ' అనే భక్తవినయేశ్వరిలా ఆఁలాగా అమ్మగారూ' అంటూ దేవేంద్రుడు సగం తిని వదిలేసిన జాంగ్రీ, రసగుల్లాలు, కట్లెట్లు యిలా నోరూరించే సరుకులన్నిటినీ యేరి వేరే ఆకులో పెట్టి వెంకన్న చేతికిచ్చింది. కిందపడ్డ మెతుకుల్ని రాలిన ముత్యాల్లా అతిజాగ్రత్తగాయేరి కంచాల్లోవేసి కంచాలు శుభ్రం చేసేందుకు తీసికెళ్ళింది.

గుర్నాధం మాలచ్మికేసిచూస్తూ, చూపుల్లోనే 'యీలాంటి మనుష్యులకంటే కొన్ని జంతువులే నయమే మాలక్ష్మీ! వాటికి ఎంగిలికూడు తినగూడదన్న నియమమన్నా వుంది! ఆకు కనపడితే నాకుదామని తాపత్రయపడే యీ బ్రతుకులేం బ్రతుకులే సిగ్గు లేని బతుకులూ ఛీ ఛీ' అని అసహ్యించుకున్నాడు.

అదే గుర్నాధం 'మహానయం మహాలక్ష్మీ! నేసీ జన్మలో తిన్లేనివాటిని చక్కగా తినగలుగుతున్నావ్. నేను వెధవన్నై, వెర్రిఅభిమానానికిపోయి జిహ్వను చంపుకుని విందును నిరాకరించేను, ఏం చేస్తాం నాకలా రాసుంది'—అన్న ఏడుపును మాలచ్మిపైనున్న అసహ్యంతో కప్పేసుకున్నాడు.

'అయితే యేవిటంటారు గుర్నాధంగారూ! యీ పూటకి యింటికెళ్ళి రేపు ఉదయాన్నేవచ్చి మిగతావి వ్రాస్తానంటారా? సరే అయితే. వెళ్ళి రండి.— దేవేంద్రుడు వక్కపొడివేసుకుని సిగరెట్ అంటించేడు.

గుర్నాధం వెళ్ళలేదు. వెళ్ళిరాలేదు. ఎక్కడివాడక్కడే నిలబడివున్నాడు కాస్సేపు తటపటాయించి చివరకు ధైర్యంచేశాడు.

'సార్! కాస్త డబ్బు కావాలి.'

'వ్వాట్!!'- దేవేంద్రుడు లక్ష్మీదేవి మెళ్ళోని బంగారుపతకంలా తన చేతినంటిపెట్టుకునివున్న బంగారువాచ్‌ని చూసుకున్నాడు. ఇంతసేపు గుర్నాధం చేతివాచీని చూసి 'ఎంతా పదిపైసలా?'అని ఎగతాళి చేస్తున్న బంగారువాచీ తక్కున 'ఇరవైఅయిదూ' అంది!

'ఏమండీ! ఫస్టు యింకా వారంరోజాలుంది. మొన్న ఫస్టుకి తీసుకున్న రెండొందలూ అప్పుడే అయిపోయేయా?'

గుర్నాధానికి గుండెమండి లోపల కొన్నిమాట లనుకున్నాడు—'అవును గురూ! నేను పూచికపుల్ల

గాడ్ని...నేను రెండొందల్రూపాయలూ పాతికరోజుల్లో ఖర్చు చేసెయ్యటమేమిటి!...యేహో నీలా మంత్రిగారి దండలా దూడులా వున్నవ్వాడైతే నిముషానికో అయిదొందలు ఖర్చు చేయొచ్చుగానీ'

గుర్నాధానికి ఒళ్ళు చల్లబడి పైకి ఒకమాట అనేశాడు—'యీ నెల ఖర్చు లెక్కువైపోయినయ్ సార్! యిబ్బందులు పెరిగినై సార్......'

దేవేంద్రుడు మారుపలక్కుండా బిరువుగా వున్న షర్ట్జేబంతా వెతికి ఓ యిదురూపాయల్నోటు తీసి 'యింద'అన్నాడు.

గుర్నాధం అందుకోలేదు. నోటునూ దేవేంద్రుణ్ణీ మార్చిమార్చి చూస్తూ వుండిపోయేడు.

దేవేంద్రుడు విషయం గ్రహించి ఆయిదు రూపాయల్నోటును జేబులో కుక్కుకుంటూ 'ఇది చాల్దల్లేవుంది పోనీ రేపు తీసికెళ్లకూడదూ' అన్నాడు.

నిజానికి జబ్బుకి మందు అవసరం యెంతుంటుందో గుర్నాధానికి డబ్బు అవసరం అంతుంటుంది. అంచేత అతడు 'రేపు తీసికెళ్లగూడదూ' అన్న దేవేంద్రుడి మాటలకు 'కూడదు'అని సమాధానం చెప్పాల్సింది. కాని అలా చెప్పినందువల్ల ప్రస్తుతానికి 'ఒరిగే'దేమీ వుండదని తెలుసుకున్న వాడవటంవలన తని నవ్వును కొద్దిగా పెద్దెకు తెచ్చుకుని 'అలాగే సార్. ప్రొద్దుటే వస్తాను సార్' అనేసేడు. మొహం వేళ్లాడేసుకుని మెట్లు దిగేసేడు.

మెట్లముందరి హాల్లో వెంకన్న 'యియ్యాల యెన్నెల మా వుషారుగా వుందిగందే మాలచ్మి! మనంగూడా యియ్యాల యెన్నెల్లో తిందామేంటి అన్నాలూ?' అనడుగుతున్నాడు.

మాలచ్మి 'అట్టాగే మావా' అంటోంది.

అంతలోనే అటొచ్చిన గుర్నాధాన్ని చూసి యిద్దరూ సిగ్గుపడిపోయేరు. వెంకన్న కాస్తముందు కేరుకుని గుర్నాధం వెంబడే గేటువరకూ వచ్చేడు.

'యియ్యాల యెడ్మెన్సుజీతం పుచ్చుకున్నట్నున్నారు. ఓ పదిపైసలుంటే యియ్యండి పంతులు గారూ, బీడిముక్కలు కొనుక్కుంటానూ!'

గుర్నాధానికి కోపం ముంచుకొచ్చింది. 'ఎంగిలి మెతుకులు తిని వెనకేస్తుంది చాల్లేదుట్రా వెంకాయ్ అడుక్కుతిందుకు బయల్దేరేవ్'అని ఎడపెడా దులిపేద్దామనుకున్నాడు.

కాని అంతలోనే అతడికి బోల్డంత దుఃఖమొచ్చేసింది—'ఒరే వెంకన్నా అక్కడెక్కడో పెద్ద గోయి కనిపిస్తే శవాన్ని పాతిపెడతారు కామోసని ఓ నక్క ఆశగా కాచుక్కూచుందిట. గంటలుగంటలు గడిచేక ఆ గోతిలో యే శవమూ పూడ్చిపెట్టబడ్లేదు సరికదా ఓ లావాటి మంత్రిగారొచ్చి పునాది రాళ్లేసి పోయేర్ట. అలా అయింది రా నాపరిస్థితి. అయ్యగారు డబ్బిస్తారని ఆశగా కూచుంటే మొండిచేయి చూపించార్రా! ఇప్పుడెలారా! నీ దగ్గరేవన్నావుంటే సర్దరా!'—అని ఏడ్చేద్దామనుకున్నాడు.

అయితే అంతవరకూ నిద్దరోతున్న అతగాడి వివేకం లేచి 'ఓ ర్నీయిల్లు బంగారంగానూ! బుర్ర విగాసాల భూషణం కొడుకైన సిపాయి గుర్నాధం మనవడివి. బి ఏ. చదూకున్నవాడివి...యింత బుద్ధిలేకుండా ప్రవర్తిస్తావా! అయ్యగారు డబ్బివ్వలేదని ఆ చిరాకు వీడిమీద చూపిస్తావా! చూపించి వీడిచేత యీ నౌకరుచేత—'అడ దినేది యీడ ఎగిరేది యెదవగుమస్తాలు యెదవగుమాస్తాలని'—అని అనిపించుకుంటావా!? ఆఫ్టరాల్ యీ క్లాస్ ఫోర్గాడి ముందు డబ్బుల్లేవని ఏడ్చి చులకనైపోతావా! వాడి క్లాసుకు దిగజార్తావా...ఛీఛీ'అని మందలించింది.

గుర్నాధం తప్పు తెలుసుకున్నవాడై ఒప్పుగా ప్రవర్తించేందుకు గ్రహణం నాటి చంద్రుడిలా నవ్వుతూ—'హ్హొహ్హొహ్హొ...ఏంటివయ్ వెంకన్నా...భోజనాలేయా...పదిపైసలు కావాలన్నావు కదూ...యింద...తీస్కో' అంటూ యెన్నాళ్ళనుండో జతగట్టి ప్రాణానికి ప్రాణంగా కలిసివుంటున్న ఒక పది ఒక రెండు (మొత్తం పన్నెండా?) పైసలవాణేల్లోంచి పదిపైసల నాణేన్ని క్రూరంగా విడదీసి వెంకన్న కిచ్చేడు.

తమనలా విడదీసినందుకు పదిపైసలనాణెం పెనంమీది అట్టులా వుడికిపోయి శపించింది—'నేనే గనక పదిపైసల నాణేన్నైతే...రేయ్ గుర్నాధం... నీ జేబులో నా వంశం నశించక్కుడుగాక—' అని!

జేబులోనేవున్న రెండుపైసల బిళ్ల ఘొల్లున ఏడుస్తూ పదిపైసలకు వీడ్కోలుగా—'నేనూ యీ పాపిష్టివాడిదగ్గర ఒక్కటేకాలం వుండను... యే చెంబో బోలో చూసుకుంటాను' అంది.

గుర్నాధానికి యిలాంటి శాపాలూ కోపాలూ మామూలే గనక అతిమామూలుగా నవ్వేస్తూ 'అడ్వాన్సు అడిగితే అయ్యగారు రేపటికి వాయిదా వేశారు వెంకన్నా' అన్నాడు. 'చూశావా అడ్వాన్సు జీతం పుచ్చుకోకపోయినా నీకు పదిపైసలివ్వగలి గేను' అన్నట్టు గర్వంగా చూస్తూ.

వెంకన్నకు పదిపైసలు పుచ్చుకున్నాక గుర్నాధంమీద బ్రహ్మాండమైన అభిమానం పుట్టు కొచ్చింది. వెంటనే అయ్యగారిమీద ద్వేషంకూడా పుట్టుకొచ్చింది. ఆ రెండిటి కలగాపులగంగా అతడి మాటలు వెలువడ్డాయి.

'యేంఅయ్యగారో కొయ్యగారు. ఇలాంటి మంచోళ్లనే యిబ్బందుల పెడ్తుంటారు. అయినా రేపు ఆరి చెల్లెలు గారొత్తన్నారాయె ఆ సందట్లో నీమాట యింటారా. అసలు రేపు యిక్కడుండ రనుకుంటా. తోటకి యెల్దామనుకుంటున్నారను కుంటా!'

'నిజమా'

'నిజమే!'

గుండెమీది బొక్కెన స్సరున జారి భావిలో పడ్డట్టు జర్రున జారింది—గుర్నాధం ఎండు గుండె.

అయితే రేపు అయ్యగారు తనకు దొరకరన్న మాట! అంటే తనదగ్గర డబ్బువుండదన్నమాట. డబ్బులేకపోతే బియ్యం కొనటం ఎలా? బియ్యం సంగతి తర్వాత మంచంలోని నాన్నకు మందులు? అసలు మందులు వాడుతుంటేనే అంతంతమాత్రం—అవీ వాడకపోతే!?...గాస్‌లేని లైటులా గ్లాసులేని లాంతర్లా తుస్సుమంటాడు...అదీ చిక్కే మళ్లీ! దీపం వెలిగినా ఆరినా పండగ చెయ్యాలి యీ పేద దేశంలో! ఆ పండగ తర్వాత ఎండగ వస్తుందని తెలిసినా, బాజాలు మోగిం తర్వాత ఆ యింటిముందు వేలండప్పులు మోగుతాయని తెలిసినా, అదేపండగ విందుల అనంతరం భోజనాల్లేక చిందులు వేయాల్సొస్తుందన్న నిజం అంతరాంతరాల్లోముల్లులా గుచ్చుకుంటున్నా పండగలు జరుపుకోక తప్ప దీ పేదసమాజంలో!

యేదేమైనా యిలాటి పండగ చేయాల్సిన అవసరం యిప్పట్లో రాగూడదని మనసులోనే మొక్కు కున్నాడు గుర్నాధం. ఆ మొక్కుకు ముక్కుసూటిగా తండ్రి శవాన్ని సాగనంపేందుకు డబ్బులేదన్న భయం వుందిగానీ యింతవరకూ జీవచ్ఛవంలా వుంటూన్న తండ్రి జీవంపోయి శవం అయిపోతాడన్న బాధ కని పించలేదు. అయితే అదేసమయానికి మేలుకొన్న గుర్నాధంవివేకం అతగాడ్ని కొప్పడింది—'నీ జన్మ కారకుడైన తండ్రినిగురించి యిలానేనా ఆలోచించటం' అని.

గుర్నాధం నిజంగానే నొచ్చుకున్నాడు—'నేను కృతఘ్నుణ్ణి నాన్నా! నేను నీ ఋణం తీర్చుకో లేను...కానీ...నాన్నా...నా...కొడుకులు...నీ మనవలు... నేను నీగురించి ఆలోచించినట్లే వాళ్లు నన్ను గురించి ఆలోచించి నీ ఋణం తీర్చుకుంటారు నాన్నా...నీ ఋణం తీర్చుకుంటారు.'

'పంతులుగారేదో ఆలోచనల్లో పడ్డట్టుండారు.'

'ఆ...ఆ......యేంలేదు వెంకన్నా......మళ్లీ వస్తా...'

గుర్నాధం గేటు దాటేడు. గతుకులరోడ్డు మీద నడక సాగించేడు...అలా నడుస్తూ సినిమా హాలువరకూ వెళ్లేసరికి అతడి ముక్కులకు కమ్మని వాసన తగిలింది.

రోడ్డు ప్రక్కన, బడ్డీ ప్రక్కన బండీ పెట్టు కుని అందులో వేడివేడిగా బజ్జీలు వేయిస్తున్నాడు కుండంటిబొజ్జ పెంచుకున్న ఓ కుటుంబరావ్.

బజ్జీల బండి వాసనకి గుర్నాథం నోట్లో లాలాజలం పొంగింది.

గుర్నాథంచేయి జేబులో కెళ్లింది.

చేతిని రెండుపైసలబిళ్ల కసిక్కున కొరికింది

గుర్నాథం చప్పబడ్డాడు. ఎన్నాళ్లనుండో ఆ బండిలో బజ్జీలు తినాలని తాపత్రయం. ఏరోజు కారోజు రేపు తిందాంలే అని వాయిదావేసుకుంటూ వస్తోండు పైసల్ని భద్రంగా దాచుకుంటూ వచ్చేడు. కాని ఇయ్యాళే...వెధవపోదికిపోయి వెంకన్నగాడికి ధారాదత్తం చేసేడు!

గుర్నాథం ముఖం వాడింది. పెల్లుబికిన లాలాజలం నీరసంగా గొంతులోకి జారింది. ఎదుగొస్తున్న బజ్జీ కోర్కెను బలవంతంగా లోపలికి నెట్టుకుపోయింది.

గుర్నాథం బజ్జీలబండికేసి చూసేడు. జనం 'మాకుముందు మాకుముంద'ని కుక్కల్లా కొట్టుకుంటున్నారు. కుక్కలు మనుషుల్లా దూరంగా నిలబడి వింతగా చూస్తున్నై. గుర్నాథం చీదరించుకున్నాడు—ఛీఛీ అక్కడే తింటం అక్కడే వుమ్మటం. యిక్కడ తింటే రోగాలకేం కొదవుండదు.'

బలవంతంగా బజ్జీల బండిమీంచి దృష్టి మరల్చుకుని ముందుకు నడిచేడు. ఎంత నెమ్మదిగా నడిచినా ఇల్లు త్వరగానే వచ్చేసింది. కాంపౌండు వాల్ పోదాలోవున్న తాటాక్కుదడి లాలూకు తడికను తోసుకుని లోపలికెళ్లేడు.

లక్ష్మి ఇంట్లో వున్నట్టులేంది బయట సందడి లేదు.

వాకిట్లో, చీకట్లో తండ్రి గురవయ్య మూలుగుతూ పడున్నాడు.

గుర్నాథానికోసారి తండ్రిని పలకరించాలనిపించింది 'ఎలావుంది నాన్నా' అనడగాలనిపించింది. అలా అనిపించిన వెంటనే అమితంగా భయంవేసింది—

ఆయన 'మందులెత్తొచ్చావురా అబ్బాయ్' అని అడుగుతాడేమోనని! 'ఇయ్యా మందులుకూడా వాడాలన్నాడా డాక్టరు' అని కొత్త చీటీ యిస్తాడేమోనని!

అంచేత తండ్రిని పలకరించే ప్రయత్నంనుండి విరమించుకుని చప్పుడు చేయకుండా లోపలికెళ్దామనుకున్నాడు.

'ఇంట్లోకి వెళ్లగనే లక్ష్మి బియ్యమేవని అడిగితే?'- గుర్నాథం నాలుగడుగులు వెనక్కేసేడు.

బరువుగావెళ్లి ఆరుబయట వాల్చివున్న నులక మంచంమీద నడుంవాల్చేడు. ఆకాశంలో చంద్రుణ్ణి మబ్బులు కప్పేస్తున్నాయ్—తనను అప్పులు కప్పినట్లు, తన ఆదాయాన్ని ఖర్చులు కమ్మినట్లు! గుర్నాథం భారంగా నిట్టూర్చేడు. అంతలో ఇంట్లోంచి లక్ష్మివస్తున్న చప్పుడైంది గబుక్కున కళ్లుమూసేసుకున్నాడు.

లక్ష్మి బయటకు రానేవచ్చింది. గుర్నాథాన్ని చూసి 'ఏవారేనా ఎంత సేపైందివచ్చి?' అంది.

కళ్లు తెరిస్తే బియ్యమేవి కందిపప్పేది అనడుగుతుందేమోనని గుర్నాథం నిద్ర నటించేడు. మౌనముద్ర వహించేడు.

లక్ష్మి వూరుకోలేదు. గుర్నాథాన్ని తట్టిలేపింది—'ఏవండీ' ఏవండీ ఏవిటీ వేళాపాళాలేకుండా మొద్దునిద్ర...లెవ్వ లేవండీ...'

ఇహతప్పదనుకున్నాడు గుర్నాథం. 'ఏవిటి' అంటూ లేచికూచున్నాడు.

'యేమిటీ పరీక్షలరాసొచ్చిన వారిలా ఒలవడి నిద్రపోతున్నారూ!' లక్ష్మి నవ్వింది.

లక్ష్మి తెలుగుసినిమా లక్ష్మీదేవిలా వుండకపోయినప్పటికీ, తల్లి పాలులేని పసిదాన్లా పోతపాలు చాలని లేతదానిలా వున్నప్పటికీ, చెక్కిళ్లల్లో ఒలప్పైన తిండి పెంచే 'నునుపు' లేకపోయినప్పటికి ఆమె నవ్వులో నవనీతం అలాగే వుంది. అందుకే ఆ నవ్వుమీద, నవ్వేమనిషిమీద గుర్నాథం ప్రేమ గురి తప్పకుండా వుంది. ఆలావుంది గనకనే గుర్నాథం కొంటెగా నవ్వుతూ లక్ష్మిచేయి పట్టుకున్నాడు.

'వూఁ! ఏవిటేది మరీ చిన్నపిల్లాడిలా. అవతల

మావగారున్నారు—'లక్ష్మిచేతిని మృదువుగా విడిపిలచు కుంది.

ఆ మావగారనబడ్డాయన నిద్దరోతున్నాడన్న నమ్మకం ధైర్యం, రెండూవున్నై గుర్నాధానికి. కనుకనే ఇంట్లోకి వెళ్లబోతున్న లక్ష్మిని దగ్గరకు లాక్కుందుకు ఆవిడ కొంగు పుచ్చుకుని లాగేడు. అది పర్'మంది.

'అయ్యయ్యో చీర చిరిగిపోతూందండీ!' లక్ష్మి గిరుక్కున వెనక్కు తిరిగింది.

సున్నం తగిలిన జంగలా గుర్నాధం చేతిలోని చెరగును టక్కున వదిలేశాడు అపరాధిలా లక్ష్మికేసి చూసేడు.

లక్ష్మి మూల్యమైనదేదో పోగొట్టుకున్నట్లు చిరిగిన చెరగుకేసి వుదాసీనంగా చూసుకుంటూంది. పాపం! అప్పటికే ఆమె కట్టుకున్న ముదురు రంగు చీరనిండా తెల్లదారపు కుట్లు కందికాయల్లా కొట్టొచ్చినట్లు కనిపిస్తూన్నై. వాటికితోడు యిప్పుడో చిరుగు బహుశా యీ చిరుగును కుట్టేందుక్కూడా వీలుండదేమో!?

గుర్నాధానికి గుండెపిండివట్లైంది. 'ఛీ ఛీ వెధవ బతుకు! పెళ్లానికి సరైన చీర కొనిపెట్టలేని బతుకు'. తనను తనే అసహ్యించుకున్నాడు.

లక్ష్మి గుర్నాధం ముఖం ముఖంలోని మార్పు గమనించింది. గుండెలోని బాధ మొగుడిమీది జాలిలో కరిగిపోయింది. అతితేలిగ్గా నవ్వేస్తూ అంది లక్ష్మి—

'ఇదేపాటంత పెద్దచిరుగులెండి. రెం డ్డిను షిల్లో కుట్టేసుకోవచ్చుగానీ...మీరు త్వరగా స్నానం చేయండి బాబూ నాకీవేళ ఆకలి మండి పోతోంది!'

లక్ష్మి నా లక్ష్మి శ్రీలక్ష్మి! నీ మంచితనం నన్ను మహారాజును చేయలేకపోయినా యిలా అయినా బతికేందుకు ప్రాణం పోస్తోంది బతుకుమీద ఆశ చావకుండా చూస్తోంది — గుర్నాధం ప్రేమగా లక్ష్మి భుజాలుతట్టి 'పద' అన్నాడు.

లక్ష్మివెళ్లి గుర్నాధానికి వేన్నీళ్లలోడి తను అన్నం సర్దసాగింది.

గుర్నాధం స్నానంచేసి లోపలికొచ్చి వెంకటే శ్వరస్వామికో నమస్కారంచేసి 'లక్ష్మి నేన్నెడి' అంటూ పంచపాళీలో కొచ్చేడు.

అప్పుడే వాళ్ల వాకిట ముందు ఓ రిక్షా వచ్చి ఆగింది

అందులోంచి ఓ జంట దిగింది. ఆ జంట తడిక తీసుకుని లోపలికొచ్చింది.

గుర్నాధం 'ఎవరూ' అంటూ అరుగుదిగి వెళ్లేడు. వెళ్లిచూసేక పెరట్లో బావిపక్క బంగారుకొండని చూసినట్టు ఆనందపడిపోయేడు. కట్టలుతెగిన సంతోషంతో 'రాధా రాధా! ఇదేనా రావటం......ఏమిటమ్మా మరీ అలా చిక్కిపోయేవ్' అన్నాడు రాధ చేతులు పట్టుకుని.

రాధకూడా మనసులోని ఆనందాన్ని ముఖం లోకి తెచ్చుకుని, మాటల్లోని అనురాగాన్ని చేతల్లో కురిపిస్తూ అంది—

'నువ్వేమిటన్నయ్యా మరీ పాడైపోయేవ్. మునుపు చూసినప్పుడే నయం.'

'నేను చిక్కిపోయేనా!? యీ మధ్య మరీ లావైపోతున్నానని మీ వదిన గొడవపెట్టేస్తూం టేను!' గుర్నాధం హాయిగా నవ్వేస్తూ రాధపక్క నున్న సుబ్బారావుకేసి తిరిగేడు.

'ఏం బావగారూ కులాసా? బొత్తిగా నల్ల పూసైపోయేరు!'

'నేనైపోవటమేమిటి బావగారూ మీ చెల్లెలే నన్ను నల్లపూసనిచేసి మెళ్లో వేసుకుంది!'

'అలా అయిన యీ 'నల్ల'పూసకు కాస్త రంగు అబ్బుతుందనీ!'

గుర్నాధం నవ్వేసేడు. రాధ నవ్వేసింది. సుబ్బారావుకూడా నవ్వేసేడు.

గుర్నాధం సుబ్బారావు చేతిలోని సూట్‌కేస్ అందుకుని 'రండి'అంటూ యింట్లోకి దారితీసేడు.

గుర్నాథానికి వెనకా సుబ్బారావుకి ముందూ నడుస్తూన్న రాధ 'నాన్న కెలా వుందన్నయ్యా' అనడిగింది.

'అలాగే వుందమ్మా. రోజూ నిద్రపట్టడం లేదని ఒహటే మూలుగుతుండేవాడు. ఇవాళ కాస్తంత తెరిపిగా నిద్రపోతున్నాడు.'

రాధ తండ్రి మంచందగ్గర ఆగి చూసింది. ఆయన నోరు తెరచుకుని నిద్రపోతున్నాడు. పాడుబడ్డ బావిచుట్టూ చేరిన చెత్తాచెదారంలా గడ్డాలూ మీసాలు అస్తవ్యస్తంగా పెరిగివున్నై. అదను చూసుకుని లోపలికిపోదామని రెండు దోమలు ఆయన్నోటిచుట్టూ చక్కర్లు కొడుతున్నై.

రాధ కొంగుతో కళ్ళు తుడుచుకుని దుప్పటి తండ్రి నోటివరకూ లాగి లోపలికి వెళ్ళింది. సుబ్బారావు అనుసరించేడు

'లక్ష్మి! లక్ష్మీ! ఎవరొచ్చేరో చూడు!'— సూట్‌కేస్‌ని ఎక్కడపెట్టాలా అని గది నాలుగు మూలలూ చూస్తూ అరిచేడు గుర్నాథం.

పెరట్లో ఏదో గిన్నె కడుగుతూన్న లక్ష్మి 'ఎవరూ'అంటూ యివతలికొచ్చింది. రాధన్చూసింది. రాధ కళ్ళల్లోని వెలుగున్చూసింది, తన కళ్ళల్లో వెలుగు నింపుకుంది. చేతిలోని గిన్నె అవతల పడేసింది.

'రాధ! రాధా!... ..ఎప్పుడమ్మా రావటం. అత్తయ్యగారూ మావయ్యగారూ బాగున్నారా! నీ వంట్లో యెలా వుంటోంది?'

'అంతా బాగావేవున్నాంగాని, వదినా మీ యిద్దరే బాగాలేరు—మరీ వర్షాలు చాలని పైరుల్లా వాడిపోతున్నారు.'

లక్ష్మి దెబ్బతిన్నట్టు ఓ క్షణం యిబ్బందిగా ముఖం పెట్టింది. మరుక్షణం మామూలుగా నవ్వేస్తూ—'సర్సరే! ఎప్పుడనగా బయల్దేరేరో యేమో ముందు స్నానాలకు లేవండి. భోంచేసి తీరిగ్గా కబుర్లు చెప్పుకోవచ్చు'అంది. అన్నతర్వాత వేన్నీళ్ళు పెట్టి, తీసికెళ్ళి పెరట్లో పెట్టింది. వచ్చి రాధచేతికి మూతలేని సబ్బుపెట్టి, మూడునెలలుగా పెట్టెఅడుగున కాపరంచేస్తున్న కొత్తటవలొకదాన్ని అందిస్తూ 'ముందు మీ వార్ని స్నానానికి లేవమను'అంది.

గుర్నాథంతో మాట్లాడుతూ కూచున్న రాధ లేచింది. సుబ్బారావును వెంటబెట్టుకుని పెరట్లోకి వెళ్ళింది.

గదిలో గుర్నాథం, లక్ష్మి మిగిలేరు. అంత వరకూ తేలిగ్గావున్న గుండెలు బరువైనై. నవ్విన ముఖాలు గంభీరమైనై. లక్ష్మి పెరటిగుమ్మంకేసి చూస్తూ గుర్నాథానికి దగ్గరగా జరిగింది—ఏదో చెప్పాలన్నట్టు.

గుర్నాథం లక్ష్మికి దగ్గరగా జరిగేడు—ఏదో అడగాలన్నట్టు.

చెప్పాలనుకున్న లక్ష్మి ఏమిటని అడిగింది చూపుతో.

'అన్నం అందరికి సరిపోతుందా?'

'వూ...అ...అహ...ఆ...సరిపోతుంది!'

గుర్నాథానికి ఆ సమాధానంమీద నమ్మకం కుదరనట్టుంది స్వయంగా వంటింట్లోకెళ్ళి అన్నం గిన్నెమీద మూతతీసి చూసేడు. 'హూఁ!' అని ముక్కుతో మూలుగుతూ లక్ష్మికేసి తిరిగేడు

'బియ్యంగూడా లేవుగదూ యింట్లో.

ఆదేదో తన తప్పయినట్టు, 'హోంవర్కు చేశావా' అని చండామార్కువిమార్కు మాష్టారు గద్దించినప్పుడు 'లేద'ని భయంభయంగా తలూపే విద్యార్థి(ని)లా 'లేవ'న్నట్టు తలాడించింది లక్ష్మి.

గుర్నాథం మెల్లిగా యివతలికొచ్చి గబాగబా పాంటూ షర్టూ వేసుకున్నాడు.

'ఇప్పుడెక్కడికి?'

'అలా చిల్లరకొట్టువరకూ వెళ్లొస్తాను... ఇదుగో...నీదగ్గర అయిదు పైసలున్నయ్యా?'

లక్ష్మి గుర్నాథం ముఖంలోకి చూళ్ళేదు (ఎందుకంటే ఆ ముఖంలోని దైన్యం తను చూడలేదు...చూడలేదు...చూడలేదు.) గిరుక్కున వెనక్కు

తిరిగి వంటింట్లోకెళ్ళి అయిదారు డబ్బాలు గాలించి రెండుమూడు పైసల నాణేలు తెచ్చిచ్చింది.

వాటిని తీసుకుని జేబులో వేసుకున్న గుర్నాధానికి లక్ష్మి కళ్ళెందుకో తడిగా వున్నాయనిపించింది. అలా అనిపించగనే అతడి గొంతెందుకో జీరవోయింది.

'సరే! స్నేహం చెయ్యటం బాగా అలవాటు ఉ ఫుతుం దేమో వాళ్ళకి వడ్డించి నువ్వు భోంచేయ్!'

గుర్నాధం తడికి తీసుకుని రోడ్డెక్కేడు. రోడ్డుమీద గుర్నాధం!

గుర్నాధం గుండెలమీద రేపు!

ఇంట్లో బియ్యంలేని రేపు!

చెల్లెలు - ప్రాణప్రదమైన చెల్లెలికి సరైన భోజనం పెట్టలేని రేపు!!

ఆ రేపు గుర్నాధం గుండెలమీద రాక్షస నృత్యం చేస్తోంది.

గుర్నాధానికి వూపిరాడటం లేదు. ఎలా యీ రేపు రాక్షసిని సమ్మోహ పరచటం? యెలా యీ రేపు రాక్షసి విషపు కోరల్నుండి తప్పించుకోవటం? యెలా? యెలా?...

ఎంత ఆలోచించినా అప్పుపుచ్చుకోవడంతప్ప మరో మార్గం కన్పించలేదు గుర్నాధానికి. కాని అప్పుడు అప్పిచ్చువాడెవ్వడు??

ఎవ్వడు ఎవ్వడు అనుకుంటూండగానే సుబ్బయ్య కిరాణాకొట్టు వచ్చేసింది.

గుర్నాధం మెల్లిగా లోపలికి వెళ్ళేడు

ఆ రోజుకు రష్ తగ్గినట్టుంది సుబ్బయ్య కాటాముందు కూచుని చిల్లరనంతా కుప్ప లుగా, రూపాయి కుప్పలుగా పేర్చుకుని లెక్కెట్టు కుంటున్నాడు గుర్నాధాన్ని ఓ సారిమాసి, పెరట్లో కాకిన్చూసినట్లు అతిమామూలుగా చూసేసి మవ్వొచ్చినా ఒకటే రాకపోయినా ఒకటే అన్నట్టుచూసేసి మళ్ళీ డబ్బు లెక్కల్లోకి దబ్బున జారబడ్డాడు.

గుర్నాధానికి సుబ్బయ్య చూపులు తెలుసు.

అది అప్పు అనుకున్న సమయానికి తీర్చలేని వాడిని చూసే చూపని తెలుసు.

ఆ చూపుల్లోని చులకన ఇంకా బాగా తెలుసు.

ఆ చూపులకు, చులకనకు నిరసన యెలా ప్రకటించాలో కూడా అతనికి బాగా తెలుసు.

కాని తెలిసిన ఆ నిరసనను తెలియజేయలేక పోతున్నాడు.

అలా చేయలేక పోవటానిక్కారణం— భయం!

ఏమన్నాఅంటే అప్పివ్వడన్న భయం!

వీడివ్వకపోతే మరొకణ్ణి వెతుక్కోగలమోలేదో నన్న భయం! ఓ వేళవెతుక్కున్నా వాడికీ సమయానికి డబ్బు సర్దలేమోనని భయం!

సర్దకపోతే వాడితోనూ పేచీ వస్తుందన్న భయం!

ఇలా అప్పిచ్చువాళ్ళను మార్చుకుంటూపోతే తనను చులకన చేసేవాళ్ళ సంఖ్య పెరిగిపోతుంటుందే అన్న భయం!

భయం సంగతి వదిలేస్తే - అసలు తీసుకున్న సరుకులకి డబ్బు గడువులోపల యిచ్చేస్తే యేగొడవా వుండదుగదా—మనలో తప్పుంది గనకే వాడలా చూస్తున్నాడు - అన్నతృప్తి!

ఈ రెండూకలసి సుబ్బయ్యకు ప్రాణభిక్ష పెడుతున్నాయ్!

'ఏమిటి గుర్నాధంగారు పొద్దుటొయ్యి వచ్చారు'. డబ్బు లెక్కకట్టడం అయినట్టుంది రూపాయి బిళ్ళను పలకమీద రాసినట్టు గరగర మాటాడేడు సుబ్బయ్య.

'ఏం లేదండీ...మీరేదో పనిమీదున్నట్టు న్నారు మళ్ళీ వస్తాను': (ఇదీ గుర్నాధానికి తెలిసిన స్టంటే!).

'ఆ, మాపనే చెప్పండి! యెంత చేసినా పైసా ఎనకెయ్యలేని పని! యింతకీ...'

'ఏం లేదూ......(గుర్నాధం సుబ్బయ్య ముఖ కవళికలు కనిపెడుతున్నాడు). ఇవాళ మా చెల్లాయి వాళ్లొచ్చేరు. ఇంట్లోనేమో సరుకులు నిండుకున్నాయి......'

'లాభం లేదు గుర్నాధంగారూ! ఇప్పటికే యెన్నో అప్పులిచ్చి నేను అప్పులపాలయ్యేను.'

'అదిగాదు సుబ్బయ్యగారూ...ఈ నెలమా నాన్నగారికి బాగా సుస్తీ చేయటంతో మందులకనీ డాక్టర్లకనీ బాగా ఖర్చయిపోయింది. లేకపోతే కొంతన్నా సర్ది వుండేవాడ్ని!'

'పాతపాటేగా యిది!'

'అలా అనకండి సుబ్బయ్యగారూ. అంతకు ముందల్లా సర్దిందే అప్పులన్నీ యెలా కరిగి పోయినై చెప్పండి! ఏదో యీ మధ్య బాగా యిబ్బం దుల్లో పడ్డాం...'

'ఇబ్బందు ల్లేం దెవరికండీ! మా యిబ్బం దులూ మాకు వుంటాయ్!'

'ఇబ్బందులుండవనికాదు సుబ్బయ్యగారూ! నెల జీతాలవాళ్లం...కాస్త మా ఇబ్బందుల్ని సానుభూతితో అర్థం చేసుకోండి...ఏదో యీ పూట కాసిని సరుకు లిస్తే...రేపు లేదా ఎల్లుండి జీతం పుచ్చేసుకుని మీకు యిచ్చేసుకుంటాను'.

'ఏం యిస్తారో యేమో!'

'మీరు నా మాట నమ్మండి. ఎల్లుండి తప్పక తీరుస్తాను. యీ పూటకి సరుకులిప్పిం చండి—' జేబులోంచి చీటీ తీయబోయేడు.

'ఊహూఁహూ! ఈ పూట కిహ లాభంలేదు రేపురండి చూద్దాం!'

గుర్నాధం చేసేదిలేక లేచి 'వస్తానండీ' అని చెప్పి బయటపడ్డాడు కాని డబ్బుయిస్తూ యీ వెధవచేత యిన్ని మాటలుపడుతున్నామే అన్నబాధ నుండి బయటపడ్లేక పోయేడు. ఆ ఏడుపును దిగ మింగేందుకు తన సంపాదనని తిట్టుకుంటూ నడక సాగించేడు.

అతడిపక్కనుంచి ఓ మిఠాయిబండి వెళ్లింది.

గుర్నాధానికి ఆకలి తెలిసింది. ఓ అణాకి కారబ్బూంది కొనుక్కుతిందామనుకున్నాడు బండి నాపుదామని రెండడుగులేశాడు.

కాని అతిగాడి వివేకం అడ్డుపడి అరిచింది.

'ఒరేయ్ అవివేకం! ఇందాక హడావుడిగా అయిదుపైసలు పుచ్చుకుని యింట్లోంచి యెందుకు పారిపోయొచ్చేవ్? —

'నీ సంపాదన యీ పూట ముగ్గురికంటే ఎక్కువమందికి అన్నంపెట్టదని తెలిసి!

'అతిథులైన రాధ సుబ్బారావుల సంగతి వది లేస్తే లక్ష్మిగానీ నువ్వుగాని పస్తుండాల్సొస్తుందని ఎరిగి!'

'పస్తుల బాధ్యతను ప్రతిసారిలాగే యీసారి గూడా లక్ష్మే నెత్తినేసుకుంటుందని గ్రహించి...

'నీ భార్యకు బలంలేదు సరైనపోషణ లేకపోతే లాభంలేదు' అని డాక్టరు చెప్పేకకూడా లక్ష్మిని పస్తులుంచుటం న్యాయంకాదని తలచి....

'నువ్ అన్నం తినకుండా ఆవిడెదట వున్నంతకాలం ఆవిడకూడా అన్నంముట్టదని ఎంచి, గ్రహించి- యిలా పారిపోయివచ్చేవ్...అవునా?

'కానారోయ్ గుర్నాధం! లక్ష్మి నీ పుణ్యాల పంటరా! స్త్రీల వ్రతకథలు చదవకపోయినా, సతీ సుమతుల్ని కొలవకపోయినా నిన్ను బాగా అర్థంచేసు కున్న భార్యరా! నీ ఆకల్ని భరించలేని భార్యరా! కడుపులో ఆకలికంటె ముందు అన్నం రెడీగా వున్నప్పటికీ ఆవిడ మనసు వీధులంట తిరుగుతున్న నీమీదే, నీ ఆకలిమీదే వుంటుందిరా! అందుకే మిగిలిన మెతుకుల్ని అతిజాగ్రత్తగా భద్రపరచి నీకోసం ఎదురుచూస్తుంటుందిరా. ఎంతరాత్రివేళ వెళ్లినా, అన్నం తిన్నానని నువ్వు యెన్నిఅబద్దాలాడినా ఆవిడ నమ్మదురా! కాగా నీకోసం దాచివుంచిన భోజ నాన్ని నీ ముందుంచి తినమని బ్రతిమలాడ్తుందిరా! తిననంటే కన్నీళ్లు పెట్టుకుంటుందిరా! దాంతో

మువ్వు...మువ్వు...కరిగి అన్నమంతా తినేసి ఆవిడకు ఆకలి మిగులుస్తావ్—లేకపోతే సగం అన్నంతిని ఆవిడకు అర్ధాకలి మిగులుస్తావ్. యేది యేమైనా నీ భార్యను పస్తుపడుకోబెట్టగూడదన్న నీ వుద్దేశ్యం చద్దికంపు కొట్టిపోతుంది !

'పైగా వున్న పిడికెడుమెతుకులకి మీా భార్యాభర్తలు నువ్వంటేనువ్వని వంతులుపడుతుంటే రాధ, నీ చెల్లెలు రాధ, ఛీ ఎందుకు భోంచేసామాఅని బాధపడుతుంది.

'సుబ్బారావు ఛీఛీ పూట గ్గతిలేనివాళ్ళు వీళ్ళు అనీ చీదరించుకుంటాడు.'

'కాబట్టి లక్ష్మి యీా పూట భోజనం చేయాలన్నా, రాధ బాధపడకుండా వుండాలన్నా, సుబ్బారావు చీదరింపు, చీత్కారమూ తప్పించుకోవాలన్నా నువ్వు...రేయ్ గుర్నాధం...నువ్వే...పస్తున్నప్పటికి పండగ చేసుకున్నట్లు నటించాలి! ఆకలిగావున్నప్పటికి ఆయాసం చూపించాలి. తర్వాత నీ యిష్టం!'

గుర్నాధానికి వివేక ప్రసంగం బాగా బుర్రకెక్కింది. కారబ్బాంది కోర్కెను వదిలేసుకుని కిళ్లీబడ్డీదగ్గరకెళ్ళేడు. ఓ కిళ్లీ కట్టమన్నాడు.

బడ్డీవాడు ఆకులు జడ్డిగారుతున్న గుడ్డకు తుడిచి వాటిలో మసాలాలు వేయసాగేడు. వాడి హడావుడి చూస్తుంటే గుర్నాధానికో అనుమానం వచ్చింది.

— ఇన్ని సీసాల్లో మసాలాలు వేస్తున్నాడు. వెధవ కిళ్లీ అంతాకట్టి పదిహేను పైసలిమ్మంటాడేమో! అంటే తన్దగ్గరుంది ఎనిమిది పైసలేగా? అప్పుడెలా?

గుర్నాధానికి వెంటనే ఓ వుపాయం తట్టింది. గబుక్కున జేబులోవున్న ఎనిమిది పైసలూ తీసి బడ్డీవాడికి కన్పించేలా, వినిపించేలా వాడి వక్కపొడి సీసామీాద పెట్టేడు

ఎనిమిది పైసలు చూసిన బడ్డీవాడు ఆకుల్లో కుంకుమపువ్వు వేయబోతున్న వాడల్లా ఆగి ఆకుల్లో వున్న రెండు యాలక్కాయల్లో ఒకటి తీసుకుని డబ్బాలో వేసుకుని అంతవరకూ కిళ్లీచుట్టియిచ్చేడు.

గుర్నాధం కిళ్లీ నములుతూ యిల్లు చేరేడు. తడిక తోసుకుని లోపలికెళ్లేడు. ఇంట్లో భోజనాలవుతున్నట్టున్నై. గుర్నాధం యింట్లోకి వెళ్లడం మానేసి అరు బయట నులకమంచంమీాద నడుం వాల్చేడు.

లోపల్నుండి గిన్నెల చప్పుళ్లతోపాటు మాటలు కూడా విన్పిస్తున్నై.

'అన్నయ్య మరీ చిక్కిపోయేడు వదినా! కాస్త నువ్వన్నా చెప్పగూడదూ మంచి మందు తీసుకోమనీ!'

'చెప్పిచెప్పి నా నోరు పోవటమేగాని ఆయనసలు వినిపించుకుంటేనా...రాధా! పైగా ఈ మధ్యే కొత్త పాట వేర్చేరు - నేను లావై పోతున్నానని అందరూఅంటుంటే నువ్వొక్కదానివే చిక్కిపోతున్నావని వెంట బడుతున్నావ్' అని!

'పొద్దుబోయినట్టుంది నువ్వూ భోంచెయ్యకూడదూ ఒదినా!'

'మీారు కానీండి ఒదినా. యిప్పుడే యేమంత పొద్దు పోయిందనీ! ఆయనొచ్చేకే తింటాను'

లోపలి మాటలు బయట గుర్నాధాన్ని గుక్క తిప్పుకోకుండా చేస్తున్నై.

'లక్ష్మీ! లక్ష్మీ! యీా దౌర్భాగ్యుణ్ణెందుకు వరించావ్ లక్ష్మీ! యే దేవేంద్రుణ్ణి పెళ్లాడినా ఆకలిఅన్నపదానికి అర్థంతెలీక, తెలుసుకునే అవసరముండక సుఖమనేపదానికి అంతు కనుక్కుంటూ అంచులు అంటుకుంటూ అణువణువూ ఆనందంతో నిండివుండేదానివి. దేవేంద్రుడు కాకపోయినా కనీసం నౌకరు వెంకన్నలాటివాణ్ణి ఎన్నుకున్నా ఎంగిలో గింగిలో గొప్పవాళ్ళు గొప్పగొప్పవాళ్ళు తినగలిగినవన్నీ తినేదానివి లక్ష్మీ! సెకండ్‌హేండ్‌వైనా మంచిచీరెలు కట్టుకునివుండేదానివి లక్ష్మీ!!

'నువ్వూ అంతేనమ్మా రాధా! నువ్‌కూడా యే దేవేంద్రుడి చెల్లెలుగానో పుట్టుంటే నువ్ పుట్టింటి

కొస్తున్నావంటే పండుగ, వచ్చేవంటే పండగ, వున్న న్నాళ్ళూ పండగ, వెళ్ళేనాడు పండగ–యిలా నీ జీవిత మంతా పండగ్గా గడపగలిగేదానివి తల్లీ! నువ్ కనీసం నౌకరు వెంకన్న చెల్లెలిగా పుట్టివున్నా వాడు ఆనందాన్ని అడుక్కొచ్చి నీకు పంచేవాడమ్మా!

'కానీ......మీరిద్దరూ మోసపోయేరు! మీ కంటే ముందే అమ్మా నాన్నా మోసపోయేరు! వరాలమూటను కంటున్నామని, బంగారుపంటను పండిస్తున్నామనీ మురిసిపోయేరు పాపం! కాని... వాళ్ళు కన్నది...మీరు ఆశ్రయించింది నన్ను! నేను దౌర్భాగ్యులకు దౌర్భాగ్యుణ్ణి! వెనకువేలు వెనకేయలేని వాణ్ణి! వెనకేసినవాడిదగ్గర అడుక్కుతినేలేనివాణ్ణి! వెనకేసినవాడిలా బ్రతకా లనుకునేవాణ్ణి! నేను క్రూరుణ్ణి! మిమ్మల్ని సుఖపెట్టలేనివాణ్ణి. నాకు చేతనైంది ఒక్కటే–అదే......మిమ్మల్ని ఆకలి మంటల్లో మలమలా మాడ్చిచంపటం!! అంతే!! నాకు చేతనైంది యింతే!! యింతే!!'

గుర్నాథం కళ్ళు గట్లు తెగినట్లు, గండ్లు పడినట్టు జలాజలా వర్షిస్తున్నై. అతడి గుండె బరువైంది. అందులో శాంతి కరువైంది. అశాంతిగా నుదురు కొట్టుకుంటూ మంచంలో అటూయిటూ పొర్లసాగేడు గుర్నాథం.

'అరె బావగారూ! ఎప్పుడొచ్చేరు బజార్నుండి. యిప్పటివరకూ మీకోసం చూసిచూసి యిప్పుడే భోంచేశాం!'—సుబ్బారావు భుజంమీది టవల్‌తో చేయి తుడుచుకుంటూ బయటకొచ్చేడు. మంచం మీద గుర్నాథాన్ని చూసేడు.

గుర్నాథం వులిక్కిపడ్డాడు. కళ్ళు కళ్ళల్లో నీళ్ళు దాచుకుందుకు నానాతంటాలుపడుతూ, తను మంచంమీంచి లేస్తూ—

'హిహిహిప్పుడే వచ్చాను బావగారూ! యీ పూట ఓ ఫ్రెండ్ కన్పించి వాళ్ళింటికి లాక్కెళ్ళేడు. వాళ్ళమ్మాయి పుట్టినరోజుట. భోజనంచేసేవరకూ వదల్లేదు. సరే రాధేది?'—అన్నాడు.

'రాధ లోపలుందిగాని...మీ కళ్ళేమిటి? ఆ కన్నీళ్ళేమిటి?'

'యిదా...యిదీ...యిదీ...అబ్బే యేమీలేదు బావగారూ...అలా పైకి చూస్తుంటే...యేదో దోమ లాటిది పడ్డది...అంతే!'

గుర్నాథం అలా పైకి [illegible]న్నాడు.

అన్నాక పైకిచూస్తూ, చంద్రుణ్ణి చూస్తూ యిలా లోలోపల అనుకున్నాడు—

'ఛీఛీ వెధవవెన్నెల వెధవవెన్నెలని! మనఅరా ఏడ్చుకుందుగ్గూడాలేదు!'

మా వూరు ఆకాశమంత లేదుగానీ ఆకాశం కిందే వుంది.

'కలికాలంరా బాబూ కలికాలం! యేదీ జర గాల్సిన సమయానికి జరగటంలేదు! వానలు కుర వాల్సిన వేళకు కురవటంలేదు. ఎండలు కరవాల్సిన వేళ కరవటంలేదు. యింకా...'

మా వూళ్ళోవాళ్ళు పెద్దవాళ్ళు యెప్పుడూ యిలా అంటూ, అనుకొంటూ వుంటూంటారుగాని పాపం చంద్రుడుమాత్రం వారంతర్వాత వచ్చేవారంలా టంచన్‌గా మా వూరికి రావల్సిన వేళల్లోనే వస్తుంటాడు.

అయితే అలావచ్చే చంద్రుణ్ణీ, అతగాడి వెన్నెల ఏజంటునీ చూసి—

'ఆహా, చంద్రుడు అందానికి ఆనందానికి ట్రేడ్‌మార్క్–లాటివాడుకదా' అని మురిసిపోయే యిళ్ళు మావూళ్ళో రెండే రెండునై.

'యియ్యాల యెన్నెల మావుషారుగా వుందే' అని హుషారుగా అనే యిళ్ళు మధ్య వయస్కుడి తల్లోని తెల్లవెంట్రుకల్లా అక్కడక్కడావున్నై!

కాని మేఘాలమధ్య చంద్రుణ్ణిచూసి 'పాపం అప్పు తీర్చలేనివాడిలా బాధపడుతున్నాడ'ని వాపోయే యిళ్ళూ,

'ఛీ ఛీ వెధవ వెన్నెల వెధవ వెన్నెలనీ! మన సారా ఏడ్చుకుందుగ్గూడా లేదు' అని లోలోపల కసురు కునే యిళ్ళూ, సముద్రంలోని అలల్లా మావూళ్ళో కోకొల్లలుగావున్నై.

మొన్నీమధ్యే మా వూరొచ్చిన మంత్రిగారు దేవేంద్రుడు తీర్చిన సభలో మాట్లాడుతూ మా వూరూ, మా వూరులాటి వూళ్ళూ మనదేశానికి వెన్నెముకల్లాటివన్నారు.

# సహృదయత్వము గుణదోష విచారము

డాక్టర్ యస్వీ జోగారావు

'సరస్వత్యా స్తత్త్వం కవి
సహృదయాఖ్యం విజయతే'.

సర్వసాధారణముగ నీనాడు లోకమున సహృదయుఁడనుమాటను మంచి మనసుగలవాఁడను నర్థమున వాడుట యొకపరిపాటియై పోయినది. కాని యామాట కసలు హృదయమున్నవాఁడు, అనఁగా కళానుభూతిని పొందుటకు వలసిన వాసనాసంపత్తి లేక సంస్కారవిశేషముగలవాఁడనియు కళాస్రష్టతో సహానుభూతి లేక హృదయసంవాదముగలవాఁడనియు నర్థము. సహృదయులందఱును సజ్జనులుకారు. సజ్జనులందఱును సహృదయులుకారు. లోకములో కొన్ని కొన్ని రసానుభూతులనందుకోలేని మనస్తత్త్వము గల సౌజన్యమూర్తులెందఱో గలరు: చప్పున సర్వ రసానుభూతులకును ప్రతిస్పందనము పొందఁగల హృదయతత్త్వముండియు జీవితరంగమున 'అసన్మార్గ వర్తులైన వారును యెందఱో గలరు. అనఁగా సహృదయత్వ ప్రతిష్ఠకు మూలకారణము రసానుభవోదర్కమగు వాసనయేగాని సౌజన్యముగాదు. అనుభూతి వాసనా మూలకమని అభినవగుప్తపాదుఁడు కంఠోక్తిగా చెప్పియుండెను. మఱియొకయాలంకారికుఁడా విషయమై యిట్లు వక్కాణించెను.

'సవాసనానాం సభ్యానాం రసస్యాస్వాదనం భవేత్
నిర్వాసనాస్తు రంగాంతః కాష్ఠకుడ్యాశ్మ సన్నిభాః'

అనఁగా సవాసనులైన సభ్యులకే (రూపక దర్శనమున) రసాస్వాదనము కలుఁగును. వాసనలేని వారు రంగస్థలమునందలి కొయ్యలవంటివారు, గోడలవంటివారు, ఱాలవంటివారు. అనఁగా వారి కనుభూతియోగ్యత యుండదని తాత్పర్యము.

లోకమున సవాసనులయ్యు నా వాసనలో నొక వైపరీత్యముగలవారుందురు. అనఁగా ఉత్తమసామాజికుఁడైనవాఁడు రామధర్మజాది పాత్రములతో సానుభూతి వహించవలసియుండ అట్లుగాక రావణ దుర్యోధనాది పాత్రముల మెచ్చుకొనువారును గలరు. వారేదో యొకయనుభూతి పొందుచున్నారుగాన సవాసనులే యగుదురుగాని కవిహృదయసంవాదియైన యనుభూతి పొందఁజాలకున్నారుగాన సరసులుగారు సహృదయులుగారు.

'సాక్షరా విపరీతాశ్చేత్ రాక్షసా ఏవ కేవలం
సరసో విపరీతోఽపి సరసత్వం నముంచతి.'

అను హితోపదేశసూక్తియందలి శాబ్దికచమత్కారము మాట యెటులున్నను, యెట్టి విపరీతపరిస్థితియందును తారుమారుకానివాఁడే సరియైన సరసుఁ డన్నమాట.

సహృదయుఁడు సజ్జనుఁడు కావలసిన యవసరములేదని యీద ననుకొంటిమి. కాని రసానుభవ సమయమున వాని వాసనకు కవిహృదయసంవాదియైన సముచితమైన యుద్దీప్తి కలుఁగుట కొక సాత్త్వికమైన యావేశ మావశ్యకము. అనఁగా నాతఁడు సత్త్వప్రధానుఁడు గావలెను.

'పరగత సుఖదుఃఖాది భావనయా
భావితాంతః కరణత్వమ్ సత్వం'

అని ప్రతాపరుద్రీయ నిర్వచనము. సహృదయ సామాజికుని స్వరూపమును మొదట నిరూపించిన భరతాచార్యుడు తన నాట్యశాస్త్రమున నిట్లు వక్కాణించెను.

'అవ్యగ్రై రింద్రియైః శుద్ధ
ఊహాపోహ విశారదః
త్యక్తదోషోఽనురాగీచ
సనాట్యే ప్రేక్షకః స్మృతః'

అనగా ననుచితమైన యింద్రియ ప్రకోపమున కగ్గముకానివాడును, విమలచిత్తుడును, రూపకకర్త యొక్క ఊహాపోహలను గ్రహించుటయందు ఘటికుడును, దోషత్యాగముచేసి గుణప్రవరుడైనవాడును నాట్యసందర్భములందు ప్రేక్షకుడుగా నుండదగినవాడని యర్థము. ఇందు సజ్జనలక్షణోద్దేశమును కొంత గతార్థమైనది. ఇఁక సిసలైన సహృదయుని గూర్చి భరతుడే యిట్లు వ్రాకుచ్చెను.

'య స్తుష్టౌ తుష్టిమాప్నోతి।
శోకే శోక ముపైతిచ
క్రోధే క్రుద్ధో భయేభీరుః।
సశ్రేష్ఠః ప్రేక్షక స్మృతః॥'.

అనగా రూపకమున సంతోష సందర్భ ముద్దిష్టమైనపుడు సంతోషము, శోకముద్దిష్టమైన శోకము, క్రోధమైన క్రోధము, భయమైనపుడు భయమును అనగా ఉద్దిష్టసందర్భమునకు సమావమైన యనుభూతిని పొందినవాడే ప్రేక్షక శ్రేష్ఠుడనగా సహృదయ శిఖామణి. భరతమతము ప్రకారము సర్వ రసాభిముఖ్యముగల చిత్తవృత్తిగలవాడే సరియైన సహృదయుడు.

భరతమతమే సత్యసమంజసమైనది. మఱి రౌద్రరససందర్భమున నాతడు క్రుద్ధుడు కావలెనని యన్నాడు భరతుడు. క్రోధ మసజ్జనలక్షణము గదా యన్నచో నగును. సహృదయుడు సజ్జనుడు కావలసిన పనిలేదనియంటిమిగదా. సజ్జనుడైన సహృదయుని మాటేమిటియని ప్రశ్నవచ్చునపుడు కావ్య జగత్తున ఆ క్రోధాద్యనుభూతులు యథార్థములై యుండిన ఆయాపాత్రల జీవిత సంబంధులుకాని పాఠక సామాజిక జీవిత సంబంధులుకావు అయినను సహృదయునిలో అనుభూతి పొటమరించుచున్నదే యనినచో నదే రసరహస్యము. అందులకే రసము నలౌకికమని యన్నా రాలంకారికులు.

లోకమున సహృదయ శబ్ద పర్యాయవాచకముగ సరసుడు, రసికుడు, రసజ్ఞుడు, భావుకుడు మున్నగు శబ్దములు వ్యవహృతములు ఇంచుమించన్నియు సమానార్థకములు కావి సరస, రసిక శబ్దము లొక్కొక్కపుడు శృంగారశీలురలైన వ్యక్తులపరముగా వాడుట కద్దు. శృంగారము రసరాజము. అది సర్వప్రాణి హృదయగోచరము. సద్యః పరనిర్వృతిప్రదాయకము. అసలు రసానందమును బ్రహ్మానందసబ్రహ్మచారియని ఆలంకారికులెందుకన్నట్లు? అనన్యపరతంత్రము, హ్లాదైకమయము, విగళితవేద్యాంతరమునైన బ్రహ్మానందముయొక్క ఆ లక్షణములు సద్యోహృద్యము, సహృదయసైవేద్యము, అలౌకికమునగు రసానందమునకును బట్టుటవలన. ఆ లక్షణములు లౌకికానందములకు సాధారణముగా, బట్టువుగాని సంగీతమువలె ఆపాతమధురము, సాహిత్యమువలె ఆలోచనామృతము ఆద్యంత సురుచిరమునగు సురతానందమునకు కొంతకుకొంత పట్టుచున్నవి. ఈ యూహతోడనే కాబోలు శృంగారమును రసరాజముగా పరిగణించినా రాలంకారికులు 'శృంగార ఏవ ఏకో రసః' అను ఆచార్య భోజదేవుని యాభాణకము నతివాదమనుకొన్నను దాని రసరాజత్వము నంగీకరించుటయే లెస్స.

'శృంగారిచే త్కవిఃకావ్యే జాతం రసమయం జగత్'

అని సెలవిచ్చినా డాలంకారిక మూర్ధన్యు డానందవర్ధనుడు. కవి శృంగారియైనచో నాతని కావ్యమున నొక రసజగత్తు ప్రాదుర్భవించునట. సహృదయ లోక పారిషదుడైన యానందవర్ధనుడు సహృదయ లక్షణ మెఱుగడనుట యుగంధరుడు మందబుద్ధి

యనుట. అట్లైచో నేల శృంగారియను శబ్దమేల ప్రయోగించెను? శృంగారి యనగా విట ధర్మ ప్రవీణుడనికాదు. సర్వరసాభిముఖ్యము గలిగి ఉపరి శృంగారరసవశంవదమైన చిత్తవృత్తి యనగా సౌందర్యరిరంసగలవాడు కళాప్రసక్తుడైనచో నా కళ రససురభిళమగునని యాపంక్తి పరమార్థము. కావున సరస రసిక శబ్దములకు సర్వరసాభిముఖ్యము ఉపరి శృంగారమమకారమును గలవాడని యర్థము చెప్పికొని యామాటలను సహృదయశబ్దమునకు పర్యాయవాచకముగా గ్రహించుట లెస్స. ప్రపంచమున ప్రతిభాషాసాహిత్యమున సర్వరసములును చోటుచేసికొని నవిగాని శృంగారరసమున కేర్పడిన పరపతి యెక్కువ.

'యేషాం కావ్యానుశీలనవశాత్
విశదీభూతే మనోముకురే
వర్ణనీయ తన్మయీభవన యోగ్యతా
తే హృదయసంవాదభాజః సహృదయాః'

అని సహృదయత్వమును మతిచతురస్రముగ నిర్వచించినాడు విఖ్యాతధ్వన్యాలోకవ్యాఖ్యాత అభినవగుప్తుడు. కావ్యములను పరిశీలించు నలవాటువలన విగళిత మలీమసమై విమలమైన ఎవరి మనసను నద్దమందు కావ్యప్రతిపాదితమైన అర్థముతో తాదాత్మ్యము ప్రతిఫలించునో వారు హృదయసంవాదభాక్కులు. సహృదయులని యర్థము. ఆ హృదయసంవాదత్వమనునది సహృదయ ప్రధాన లక్షణము. సహృదయుని మనసునకు అద్దముతోడి యౌపమ్యము చక్కగ కుదిరియున్నది. వస్తువైఖరి యెట్లున్న తత్ప్రతిబింబస్వరూపమును యథాతథముగా ప్రదర్శించునది యాదర్శము. అనగా కవిహృదయము నున్నదున్నట్లు గ్రహించువాడే సహృదయుడనుట. ఆ హృదయముకురము కావ్యానుశీలనాభ్యాసవశమున విశదీభూతము కాగలదనుటలో నింకొక పరమార్థము గూడ నిమిడియున్నది—సామాన్యమానవుడు గూడ అనువిత్యసాహిత్యసంసర్గమున, మనసును మలీమస మొనర్చిన బహిరావరణము నా ఛేదించుకొని విమలాంతఃకరణుడై, సహృదయుడై తేజరిల్లగలడు.

సహృదయులకోసమే కవివిరించనులు కావ్య ప్రపంచమును నిర్మించుచుందురు. మాలతీమాధవ రూపక ప్రస్తావనలో భవభూతి

'యేనామకేచిదిహ నః ప్రథయంత్యవజ్ఞాం
జానంతి తే కిమపి తాన్ప్రతినైషయత్నః।
ఉత్పత్స్యతేస్తి మమకోపి సమానధర్మా
కాలోహ్యయం నిరవధి ర్విపులాచ పృథ్వీ'

అని ఆనాడు కొంచెమెఱిగి తన్ను కించపరుచువారి కోసము కానేకాదనియు తన రచనా ప్రయత్నమంతయు—ఎప్పుడో అప్పుడెక్కడో అక్కడ తనకు సమానధర్ముడైన పాఠకుడు అనగా సహృదయుడుదయింపకపోడనియు అవి వానికోసమేననియు చెప్పెను. పుట్టని సహృదయులయెడను పుట్టెడాశ పెట్టుకొని మహాకవులు రచనలు సాగించుచుందురనుట స్పష్టము. రసికుడు లభింపకున్నమానె తమ కావ్య మరసికుని బారిం బడరాదని యాశింతురు కవులు.

'ఇతర పాపఫలాని యథేచ్ఛయా
వితర తాని సహే చతురానన
అరసికేషు కవిత్వ నివేదనం
శిరసి మాలిఖ మాలిఖ మాలిఖ'

అని బ్రహ్మదేవుని వర మర్థించినాడట, యొక కవి బ్రహ్మ. ఒక కవి సహృదయాభావమువలన కవితావ్యాసంగమే మానుకొన్నట్లు చమత్కారముగా నిట్లు చెప్పినాడు. రాజశేఖరుడు తన కావ్యమీమాంసలో

'కస్త్వం భోః? కవిరస్మి—
కావ్యభినవామూక్తిస్సఖే పఠ్యతామ్—
త్యక్తా కావ్యకథైవ సంప్రతి మయా—
కస్మాదిదం? శ్రూయతామ్
యస్సమ్య గ్వివినక్తి దోషగుణయో స్సారం
స్వయం సత్కవిః
సోఽస్మిన్ భావుక ఏవ నా
స్త్యథ భవే ద్దైవా న్న నిర్మత్సరః'

గుణదోషపారజ్ఞుఁడు స్వయముగా సత్కవియు నైన సహృదయుఁడే లేఁడు అదృష్టవశాత్తు ఉన్నచో నిర్మత్సరుఁడైన వాఁడు లేనేలేఁడని తాను కవిత్వము చెప్పుట మానుకొంటినన్నాఁడఁట యాకవి. అనఁగా కవితయొక్క గమ్యస్థానము సహృదయుని హృదయమే యనుట స్పష్టము. బిల్హణీయములో కావ్యరసానుభూతి కెవఁడుత్తమాధికారియో యిట్లు తెలుపఁబడినది.

'నైవ వ్యాకరణజ్ఞమేతి పితరం
న భ్రాతరం తార్కికం
దూరాత్సంకుచితేవ గచ్ఛతి
పునశ్చండాలవ చ్ఛాందసాత్
మీమాంసానిపుణం నపుంసక
మితిజ్ఞాత్వా నిరస్యాదరాత్
కావ్యాలంకరణజ్ఞ మేవ కవితాకన్యా
వృణీతే స్వయమ్'

కవితాకన్య వైయాకరణుని తండ్రిగను, తార్కికుని సోదరునిగను, వేదజడుని చండాలునిగను, మీమాంసకుని నపుంసకునిగను, పరిగణించి కావ్యాలంకారవేత్తయైన భావుకునే స్వయముగా వరించునఁట. ఆ వైయాకరణాదులకసలే కవిత్వ పరిజ్ఞానము లేదనికాదుకాని దాని పారస్యపరమార్థము వారికంతు పట్టదనుట. చర్వణము సర్వసామాన్యమేకాని సారాస్వాదము సహృదయునిది. ఈ విషయమునే భోజచరిత్రకర్త యిట్లుగ్గడించినాఁడు:—

'అపూర్వోభాతి భారత్యాః
కావ్యామృత ఫలే రసః
చర్వణే సర్వ సామాన్యే
స్వాదువిత్ కేవలం కవిః'

అంతేకాదా వైయాకరణాదులు కొందరొకొక్కప్పుడు

'అర్థాస్వాదన వేళాయాం
శబ్దోత్పత్తి విచారకాః
నీవీ మోక్షణ వేళాయాం
వస్త్రమూల్య విచారకాః'

అనునట్లు విరసముగను ప్రవర్తించుట కద్దు. ఆవును మఱి స్వర్గమున కొక్క చీఁడి తెరువాయిగానున్న సురత ప్రసంగవేళ కోకవెలనెఱుఁగగోరినవానికి వియ్యఁకుఁడే రసానుభవ సమయమున శబ్దస్వరూపవిచారణ సేయువాఁడు.

సహృదయుఁడు తాను కావ్యరసానుభూతిని పొంది కులుకుటయేకా దాతని వలన లోకమునకు కొన్ని ప్రయోజనములు గలవు. అనుభవసిద్ధుఁడైన యాతఁడు తన యనుభూతికి తావలమైన కావ్యము స్వరూప స్వభావములను సప్రమాణముగ వివరించుట వలన ఆ కావ్యము నతఃపూర్వము చదువని పాఠకునికి దానియెడ ప్రరోచన కలుగును. చదివిన సామాన్య పాఠకునికి అతఃపూర్వము స్ఫురింపని కావ్యశిల్పరహస్యము తెలియఁబడును. అంతేకాదు. సహృదయునికి సమకాలికుఁడైనచో ఆ కవికే భావిరచనకుఁగాని లేక అర్వాచీనకవుల రచనావ్యాసంగమునకుఁగాని ఆ సహృదయుఁడు మార్గదర్శకుఁడగును. సాహిత్యస్రష్టగా పరిణతావస్థతో అభిజ్ఞానశాకుంతలమును రచించిన మహాకవి కాళిదాసు తత్ప్రస్తావనలో:—

'ఆపరితోషాద్విదుషాం
న సాధుమన్యే ప్రయోగ విజ్ఞానం
బలవదపి శిక్షితానా
మాత్మ న్యప్రత్యయం చేతః'

అని పలికెను. పండితులు చూచి సంతోషము పొందుదాక తన ప్రయోగవిజ్ఞానము చక్కనిదని సంభావింపఁడఁట. ఎంత సుశిక్షితుఁడైన వాని విషయమునను వాని మనసు వాని విషయమున నాతనికి విస్రంభపాత్రము కాఁగూడదఁట. చూచితిరా అంతమహాకవియు 'సహృదయాః ప్రమాణమ్' అని యెట్టి జోహారు చేసెనో! అసలు సిసలైన కావ్యరసికుఁడు లభించుట కవుల భాగ్యవిశేషముగా భావించిరి మనవారు.

'దత్తా తేన కవిభ్యః
పృథ్వీ సకలాపి కనకసంపూర్ణా

దివ్యాం సుకావ్యరచనాం
క్రమం కవీనాం యో విజానాతి.'

అని భోజచరిత్ర. అనఁగా కావ్యమర్మజ్ఞుఁడైన యొక సహృదయుఁ డున్నచో అతనిచే ఆ కవికి హిరణ్యగర్భయగు మహీమండలము సర్వము ధారాదత్తమై నట్లేనఁట!

పాశ్చాత్యులుగూడ సహృదయతత్త్వమును గొప్పగా సంభావించినవారు.

'You will find poetry nowhere unless you bring some with you' అని జౌబర్టు మహాశయుఁ డభిభాషించెను. అనఁగా మనలో కొంతకవిత్వము అనఁగా కవిహృదయతత్త్వము లేనిదే మన కెచ్చటను కవిత్వము గోచరముకాదు మన వారు చెప్పిన సహృదయత్వ ప్రధాన ధర్మమునే మఱొక విధముగా చమత్కారముగా చెప్పెనాఁడీ పాశ్చాత్య పండితుఁడు. పూర్వోక్తమైన అభినవగుప్తపాదుని నిర్వచనమునకు సన్నిహితమైనదే ఈ యాభాణకము తాత్పర్యము. 'Sad is his lot who once at least in his life has not been a poet' అని లేమర్ బెయిన్. జీవితములో అధమపక్ష మొక సారియైనను కవికానివాఁడు వ్యర్థుఁడఁట! అనఁగా ప్రతిమనుజుఁడు కవిత్వమును జెప్పవలెననిగాని చెప్పఁ గలఁడని కాని కా దా వాక్యతాత్పర్యము. ప్రతివ్యక్తియు నెప్పుడో యొకప్పుడు కవిహృదయసంవాదియైన కావ్యానందమును పొందవలెనని లేక రసప్రవణమైన కవి హృదయ ధర్మమును గలిగియుండవలెననియు లేనిచో ఆ జీవితము నీరసము, నిరర్థకమునగు ననియు ఆ వాక్య పరమార్థమైనట్లు తోచును.

'Poetry has been to me its own exceeding great reward: it has given me the habit of wishing to discover the good and the beautiful in all that meets and surrounds me' అని కాలరిడ్జి మహాశయుఁ డొక మహాసంకల్పము చెప్పుకొనెను. ఇందుసత్కవియైన యొక సహృదయుని ఆత్మసాక్షాత్కారమునే చూడఁగలము. తనకు కవిత యబ్బుటవలన మఱి యొండు లబ్ధి ప్రసక్తిలేదఁట. అదేయొక మహాలబ్ధి యఁట. ఏలన ఆ కవిత యతని పరిసరసామస్త్యము నందుఁగల మంచిని సౌందర్యసంపత్తిని గుర్తింప వలయునను యిచ్ఛ నతని జీవలక్షణముగా చేసినదఁట అవును కల్యాణకామనగలవాఁడే సహృదయుఁడు, సౌందర్య రిరంసువైన వాఁడే సహృదయుఁడు ఇంచుమించుగా నీ విషయమునే భంగ్యంతరముగా దశరూపకమున ధనంజయుడిట్లు వివరించెను.

రమ్యం జుగుప్సిత ముదార మథాపి నీచం
ఉగ్రం ప్రసాది గహనం వికృతంచ వస్తు
యద్వా ప్యవస్తు కవి భావకభావ్యమానం
తన్నాస్తి యన్నరసభావ ముపైతి లోకే'

కవి భావుకుఁడు కావలెనేగాని ఆతనిచే భావ్యమానమై రసభావసిద్ధిని పొందని విషయ మదెట్టిదైననుసరే లోకమున లేనేలేదు సర్వసాధారణముగా మహాకవులందఱును పరమ భావుకులు. అందుకనే వారి రమణీయ దర్శనమున సర్వవిషయములును రసదీపవర్తులగును.

"He who finds elevated and lofty pleasure in the feeling of poetry is a true poet, though he never composed a line of verse in his entire life time అని డుడేవంట్ మహాశయుని వక్కణ. అనఁగా కావ్యానుభవమున పరమోదాత్తమైన ఆనందమును పొందువాఁడు తన యావజ్జీవితమునను ఒక్కపద్య పంక్తిని రచించి యుండకపోయినను నిజమైన కవి యనిపించుకొనుననుట. అనఁగా సహృదయత్వము సమృద్ధిగాఁ గలవాఁడే నిసలైన కవియనుట లేక కవి హృదయ సంవాదముతో పరమానందానుభవము సాధించువాఁడే నిసలైన సహృదయుఁడనుట. ఈ వాక్యమున కవి సహృదయ ధర్మములనుగూర్చిన యభేద భావనగలదు. అసలు సరస్వతీతత్త్వమే కవి సహృదయాఖ్యమని యుద్ఘాటించినాఁ డభినవగుప్తపాదుఁడు.

'సరస్వత్యా స్తత్త్వం కవి
సహృదయాఖ్యం విజయతే'

— లోచనము

సర్వసాధారణముగ కావ్యగతగుణదోషవిచారణ సందర్భమున సహృదయశబ్దము తఱచు ప్రసక్త మగుచుండును. కొందఱు గుణగ్రహణమాత్రపరాయణుఁడే సహృదయుఁ డనుకొందురు కొందఱు సహృదయుఁడు దోషోదాసీనుఁడు కావలయు నందురు. మఱికొందఱు తప్పునుగూడ నొప్పుగ భావించువాఁడే సహృదయుఁడందురు. మన రచయితలలో చాలమంది మందప్రజ్ఞులకు లఘుసారులకు నొక పరిపాటి యున్నది— తమ రచనల మొదటనో చివరనో తమ తప్పుల నొప్పులుగా భావింపుఁడని పాఠకులను వేడుకొనుట. ఇది కేవలము అలసత్వము, అమాయకత్వము. ఆ మాట చూచుకొని యొక పాఠకుఁడెంత సహృదయుఁడైనను ఆ తప్పుల నొప్పులుగా భావించుట యంతమొప్పితనము మఱి యుండఁబోదు. ఒప్పులను తప్పులుగా భావించుటనరే అంతఘోరము మఱి యుండదు. అది పాఠకుని తెలివితక్కువయైనఁ గావలె, లేక యేదేని యసహనతయ్యైనఁ గావలె. మఱి కొందఱు రచయితలు కడుగడుసుగా తమ రచనను సహృదయులైనవారు తప్పక యభినందింతురని విశ్వసించుచున్నామందురు. అనఁగా వారి రచన బాగుగ లేకపోయినను బాగుగా నున్నదనువాఁడే సహృదయుఁడన్నమాట వారి దృష్టిలో. అలాగే మన కెందుకు వచ్చినదని ప్రతిది—బాగున్నదను వెఱ్ఱిబాగుల సహృదయులును మనలో లేకపోలేదు. తాము సహృదయులమని ప్రకటించుకొని ప్రతిష్ఠ సంపాదించుకొనవలెనని యుబలాటపడి కొందఱు, అసలు తప్పులను పోల్చుకొని నిరూపింపఁగల ధీనూ, సామర్థ్యము లేక కొందఱు, రచయిత సమకాలికుఁడు కావలసినవాఁడు నైనచో మొగమోటవలన కొందఱును సహృదయులుగా లోకమున చలామణి యగుచుందురు. కాని యది కాదు సహృదయత.

ఈ గుణదోషముల విషయమున సహృదయుల బాధ్యతను చక్కఁగా నిర్దేశించిన ప్రాచీనాంధ్రకవులు కొందఱు గలరు. అందు కేతన తన యాంధ్రభాషాభూషణమున —

ఒప్పులుగల్గిన మెచ్చుఁడు,
తప్పులుగల్గిన నెఱిఁగి తగదిద్దుఁడు, త
ప్పొప్పునకుఁ దొప్పుతప్పని
చెప్పకుఁడీ కవు లుపాస్తిచేసెద మిమ్మున్

గుణదోషంబు లెఱిఁగి యిది
గుణ మిదిదోషమని పూఁకొందురు సుకవుల్
గుణదోషము లెఱుఁగక దు
ర్గుణములె గుణములని పూఁకొందురు
కుకవుల్.

సహృదయునిపై ఒప్పును మెచ్చుకొనవలసిన బాధ్యత యెంతైనా గలదు. అయితే దోషజ్ఞతకంటె గుణగ్రహణత్వము కొంత సులువు. దోషనిరూపణమునకు పాండిత్యబలముండవలె. అది బాధ్యతతోఁగూడినపని. దోషజ్ఞ శబ్దమునకు పండితుఁడని యర్థం నిరూఢిగలదు. గుణజ్ఞ శబ్దమునకట్లు లేదు. అందుకే తప్పున్నచో 'ఎఱిఁగి తగదిద్దుఁ' డనుచున్నాఁడు కేతన. ఆ తప్పు నొప్పుగ్రహించుట మంచిదనుట ఇతని మతము కానేరదు. తప్పు నొప్పన్నను, ఒప్పును తప్పన్నను తప్పే. ఇదిగుణ మిదిదోషమని స్వప్రమాణముగ స్థాపించువారే పూజ్యులు.

దూబగుంట నారాయణకవి తన పంచతంత్రమున —

.........నా కవిత్వము రుచింపని
తావులుచూచి చెప్పుడీ!
తప్పులులేనిచో నవుగదా
యని తీర్పుఁడు, మాటిమాటికిన్
జెప్పకుఁ డొప్పు తప్పనుచుఁ,
జెప్పఁగ నేర్చిన వారి కొక్కచోఁ
దప్పులులేక మానవని తద్జ్ఞు
లెఱుంగుదు రీకు మ్రొక్కెదన్'

అని సహృదయ విమర్శకులకు తమ బాధ్యతను చక్కఁగా గుర్తుచేసినాఁడు.

కుకవినిందాసందర్భమున అసహృదయులమ తూర్పాఱబట్టినారాంధ్రకవులు. 'కుకవుల్ ధర దుర్వ్యటులట్లుచూడఁగన్' అని తిక్కన వక్కణ.

'ఏ మహాత్ములుగల్గ భూవిశాల సభలలో
కవులకు నధిక విఖ్యాతిగల్గె
...........................
ఏప్రవీణులుగల్గనిల నలంకృతి కృతో
ద్యములకు దోషలక్ష్యములు గల్గె

అని యిత్యాదిగా రామరాజభూషణుని చతురాక్షేపణ.

తచ్చరితం బుపేక్ష కుచితంబగుఁగాక,
నగంగన్న వా
కుచ్చి యజాగళస్తన సగోత్రులౌ
వారల వెన్న నేటికిన్'.

అని సూరన విసురు. కావ్య పాఠకులందుగల వైవిధ్యమిట్లు—

'ఒకఁ డలంకారమునకు వేడుక వహించు
నొకఁడు వార్తా సమృద్ధికిఁ జెలంగు...'

అని యిట్లు వైనమువారిగఁ బేర్కొనుచు జైచ రాజ వేంకటనాథుఁడు (పంచతంత్రము 1–14) చివరికి 'ఇందఱి ముదలింపఁ జాలు టెట్లు?' అని అని తాను విదగ్ధుఁడయ్యు విషణ్ణుఁడైనాఁడు.

భిన్నరుచిప్రచురమగు లోకమున అందఱిని మెప్పించుట దుస్సాధము. పిండిప్రోలు లక్ష్మణకవి లంకావిజయమున కృతిపతి మాటగా—

'కొందఱు శబ్దసౌష్ఠవము
కొందఱు భావము గొందఱర్థమున్
గొందఱు సంధిసంఘటన
గొందఱలంకృతి వృత్తి గొందఱుం
గొందఱు తెన్గు సంస్కృతము
గొందఱు ఛందము గొంద ఱన్నియుం
గొందఱు జాతురెల్ల కవికోటి
బలీయనఁజేయు విూకృతిన్' (1–56)

అని యున్నది. ఉద్దేశము మంచిదికాని యట్లు సర్వసమ్మతముగా కావ్యనిర్మాణము చేయుట కష్టసాధ్యము.

సరసుల స్వరూపము నిట్లు విష్కరించినాఁడు రాధామాధవకవి.

'సరసులు చిత్తగింపుఁడని చాటను
మామకవాణి నన్నవో
హరయగునేని వారి హృదయంబుల
కింపొనరింపకున్నె? యె
వ్వరు పిలువంగ వచ్చి యలి
వర్గము లాత్మల జొక్కి తేనియల్
గురియు ప్రసూన గుచ్ఛ
భరకుంచితమల్లిమతల్లికావనిన్.'

కావ్యగుణగ్రహణార్థము సరసులఁ బ్రార్థింపఁ బనిలేదనినాఁడు. యథార్థము వారికి భ్రమరోపమాన ముచితముగనున్నది. కనుపర్తి అబ్బయామాత్యుఁ డనిరుద్ధచరిత్రమున సరసులకు విరసులకు నిట్టి చక్కని ప్రతియోగసంఘటనముచేసి చూపినాఁడు.

'సుకవుల సూక్తులందు సరసుల్
నెరసుల్ వెదుకంగబోరు, మ
క్షికవితతుల్ వ్రణంబు పరికించు
గతిం గొదుల్ గణించుటల్
కుకవుల నైజబుద్ధి; తెరలో
కథ చొప్పున బొమ్మలాడఁగా
నొకకడ హాస్యపుం బ్రతిమలుండవె
పెక్కులు వెక్కిరించుచున్.'

ఈ గుణదోషగ్రహణము గుఱించి కావ్యమీమాంసాకారుఁడు రాజశేఖరుఁ డిట్లు వ్రాసెను

'గుణదోషౌ బుధో గృహ్ణన్
ఇందుక్ష్వేళావివేశ్వరః।
శిరసా శ్లాఘతే పూర్వం
పరం కంఠే నియచ్ఛతి'

శివుఁడు చంద్రుని శిరసా వహించెను. గరళమును గళసీమలో దాచివైచెను. బుధుఁడును గుణదోషముల వాక్రమమున గ్రహించునని శ్లోకతాత్పర్యము. అట్లు దోషము నపహ్నుత మొనర్చుట సహృదయలక్షణము గాదు. దోషలేశమును గూడ సహేతుకముగ గర్హించ గలిగి, గుణలవమును గూడ మెచ్చుకొనఁగల్గుటయే

సరియైన సహృదయ విమర్శకధర్మము. కాని 'దృష్టం కిమపి లోకేఽస్మిన్ ననిర్దోషం ననిర్గుణం' అన్నగా నీ లోకమునఁ గేవలము నిర్దోషమైనదియుఁ గనరాదు, నిర్గుణమైనదియుఁ గనరాదు, అని ఆర్యులనుమాట సత్యము. అందుచే దోషము నసలే యుపేక్షింపవలయుననుట సమంజసముకాదుగాని దోషాధిక్యమున్న రచనలో గుణమును మఱుగుపఱచరాదనియు, గుణాధిక్యమున్న రచనలో మాత్రము దోషము నుపేక్షింపవచ్చుననియు నొక సమయము చేసికొనుట సముచితమనిపించును. ఇందులకు

'ఏకోహి దోషో గుణసన్నిపాతే
నిమజ్జతీందోః కిరణేష్వివాంకః'

అను మహాకవి కాళిదాసు మాటను సాటిఁజేసికొనవచ్చును. చంద్రకిరణప్రసారమున మచ్చయొక్క ప్రభావ మెట్లు మటుమాయమగుచున్నదో అట్లే గుణబాహుళ్యమున దోష మడఁగుచున్నది. ఈ దోషములందును అన్నియు నిత్యదోషములుకావు. కొన్ని భంగ్యంతరమున గుణములుగనే పరిణమించుననియు గలవు. ఉదా: —వీప్సాభీక్ష్ణ్య క్రియా సమభిహారాది సందర్భములందు పునరుక్తి గుణమే యగుచున్నది. ఇతరత్ర మాత్రము దోషము కాని కొన్నికావ్యకథాసందర్భములందు—కుకవిత్వ స్వరూపనిరూపణము విషయమైనప్పుడు అరీతి, అప్రతీతికము, నేయార్థము మున్నగు నిత్యదోషములును, ఉన్మత్తమధుపాయిప్రలాపములు విషయమైనప్పుడు అక్రియము, సంబంధవివర్జితము, విపరీతధీప్రదము మున్నగు నిత్యదోషములును దోషములు గాకుండబోవును. అట్లని వానిని అనిత్యదోషములనుట కుదురదు. అవి కవియ విశిష్ట సందర్భములకు సంబంధించినవి. అట్టివానిఁ గూడ అనిత్యదోషము లనుకొన్నచో లాక్షణిక వ్యవస్థయే చెడును. అసలు 'రసాపకర్షకా దోషాః' అని సాహిత్యదర్పణకర్త విశ్వనాథకవిరాజనినట్లు రసాపకర్షకమైనవే సిసలైనదోషములు. రసము కావ్యమున కాత్మ గనుక. అయితే కావ్యమునకు శరీరమునుగలదుగదా— శబ్దార్థములు. లాక్షణికస్థితి సంపాదనార్థము తద్దోషనిరూపణము నావశ్యకమే. గుండెపై చేయి వైచుకొని సహృదయుఁ డిట్లొక సమన్వయమును చేసికొననిచో కాళిదాసాదిమహాకవులే ఆక్షేపణకు గురి యగుదురు. రసాపకర్షకములగు దోషములు కాళిదాసులో నున్నవి కాదనరాదు, వెదికి యాక్షేపింపవలసినదే! క్షేమేంద్రుఁడు క్షమించినాఁడా మఱి? తన 'ఔచిత్య విచారచర్చ'లో ప్రత్యుదాహరణములకు కాళిదాసుని తనవి గూడ శ్లోకము లుదాహరింపలేదా? మహాకవుల నవశ్యము విమర్శింపవలసినదే— వారు కడచన్న తెరువుల తెలివిడి కొఱకు. అయితే వారి విమర్శకు వినియోగింపవలసిన కొలబద్దలు వేఱు. సామాన్య కవుల విమర్శకు వినియోగించవలసినవి వేఱు. చీరను మూరవేసి కొలుతుము. పొలమును ఛేనువేసి కొలుతుము. కాలువను బల్లకట్టుపై దాటుదుము. కడలిని పొగయోడపై. అట్లే సామాన్యుని కావ్యములో శబ్దదోషములు మొదలగు లేకి యేరుదుము. మహాకవి మనకు రసభోగమిచ్చినాఁడనియు, మహితశిల్ప సీమలలో మార్గదర్శకుఁడైనాఁడనియు అతని కావ్యములో అడుగడుఁగున అనుభవ పులకితులమై పోవుటయేగాని ఆ లేకి యేరుకొనుట మఱచిపోవుదుము. ఆ రసానుభవరహస్యమునే యితరులకు నివేదింతుము. "The good critic is he who recounts the adventures of his Soul in the milieu of master pieces" అని అనటోల్ ఫ్రాన్సు మహాశయుడు అయితే ఎంత మహాకవియందును ఏ అతిరసతయో, రసభంగమో యున్నచో నుపేక్షింపము. సహృదయుఁడు ముఖ్యముగా గుర్తుంచుకొనవలసిన సూత్రమిది.

మంచియైనను చెడ్డయైనను పాఠకమాత్రుని మాట తాత్కాలికము, పరిమితప్రచారముగలది. నిత్యము సాహిత్యవిమర్శన వ్యాసంగియగు సహృదయుని మాటకు విలువ యెక్కువ, ప్రచారమెక్కువ. ఆ మాట చాలా కాలము సజీవముగా నుండునట్టిది. అందుచే నతఁడొక రచన గుఱించి, యేయొక్క పలుకు పలికినను ముందుగా యెంతో ఆలోచించి మఱి చేయవలె. తగని మంచిమాట యనినను, మునిగిపోయినది లేదుగాని తప్పుమాట యన్నాఁడా? అది అతని సహృదయత్వ ప్రతిష్ఠకు భంజకముగుటయేగాక రచ

యితకు గూడచుట్టుకొనును. విమర్శకుడెంత సహృదయుడైనను వైయక్తికమైన యభిరుచి వైలక్షణ్యముతో మాత్రము విమర్శ సాగింపరాదు. సర్వసమ్మతములగు కొన్ని ప్రమాణములుండవలె అలాగని యెప్పుడో వ్రాయబడిన లక్షణగ్రంథాల యొడంబడములతో ఇప్పటికాలాల అన్ని రకాల సాహిత్య గ్రంథములకును సూత్రపట్టుట పనికిరాదు. ఒక సాహిత్య గ్రంథము పుట్టినప్పటి దేశకాలమాన పరిస్థితులు, ఆ గ్రంథ రచనలో కర్త్ర మనోనిష్ఠమైన ప్రయోజనదృష్టి, తత్సాధనలో ఆ గ్రంథకర్త యెంతవఱకు కృతకృత్యుడైనాడు, ఏ పాటినైపుణి ప్రదర్శించినాడు, ఎంత రసానుభవమును పాఠకులకు చూరలిచ్చినాడు అను విషయములను ముఖ్యముగా పరిశీలింపవలయును. అక్కడ మఱి ప్రాచీన నవీనములను పట్టింపు ఉండరాదు. 'పురాణ మిత్యేవ నసాధు సర్వమ్, నచాపి కావ్యమ్ నవమిత్యవద్యమ్' అను మహాకవి కాళిదాసు మాటయుండనే యున్నది. ప్రాచీన కావ్యములకు నవీనప్రమాణములతోగాని నవీనకావ్యములను ప్రాచీనప్రమాణములతోగాని కొలవరాదు. ఆ ప్రమాణము లిరువాయములకును నడుమ గుణప్రవణమైన, దోషజ్ఞాతా దక్షమైన సమరసదృష్టి యేదో యుండవలయును. అదే సహృదయత గుణజ్ఞుడు మాత్రమేకాడు సహృదయుడు దోషజ్ఞుడు గూడ సహృదయుడేకాని యతడు పురోభాగి యనగా దోషైకదృక్కు కాగూడదు గుణజ్ఞుడుకాని దోషజ్ఞుడు సహృదయుడు కానేరడు దోషజ్ఞుడుకానిగుణజ్ఞుడు చేతకాని సహృదయుడు లేదా మీదచెప్పినట్లు తప్పన్నచోగదా తంటా రావచ్చునని తప్పున్నను 'ఫరవాలేదు—బాగుగనే యున్నది– బాగులేకపోలేదు'అని యీలాగున యేదో నచ్చికబుచ్చికలాడి బాధ్యతనుండి తప్పించుకొనవచ్చునను భావతు వెఱ్ఱిబాగులు సహృదయులు కొందఱు విషయము నంతెత్తుకొన్నచోగదా మంచియో చెడో అననలె, అసలెత్తుకొనకున్నచో యేమాటయు రాదు గదాయని చల్లగా విషయమును జారవిడవి యూరకుందురు. కొందఱు విధిలేక తమ యభిప్రాయము చెప్పవలసివచ్చినపుడు గోడమీదపిల్లివాటముగా చెప్పుదురు. అసలు విషయము తెలిసినవాడు ఒకరడుగకపోయినను దాని యథార్థస్వరూపము లోకము తెలిసికొనవలసిన యవసరముపడినప్పుడు, తన కవకాశమున్నప్పుడు నిజము నిరూపించుకొనుటకు పూనుకొనవలె ఊరుకొన్నంతమాత్రాన అది సహృదయత కాదు. పూనుకొని దోషనిరూపణ చేసినంతమాత్రాన అది సహృదయత కాకపోదు.

ఇంక సాహిత్యరంగమునందేకాదు, సార్వజనీనముగా, సార్వకాలికముగా సహృదయత యనగా నిదీ సహృదయత అని నిరూపించుటకు నికరమైన సందర్భాలు రెండు: పగవారి యొప్పునైన మెచ్చుకొనుట. తన తప్పునయినను ఒప్పుకొనుట. మొదటి సందర్భమున కొందఱు పెద్దమనుష్య లభినయముసేయుట కద్దు. కాని తన తప్పు నొప్పుకొనుట యన్నది, సహృదయతాసౌధమునకు చరమ సోపానము. కనీస ధర్మముకూడ. అప్పట్టున నెవడును వభినయము సేయుడు. విదగ్ధులు కొందఱు సమర్థించుకొనుటకు ప్రయత్నింతురు. వీలుకాకున్న తాత్కాలికముగా సహృదయుడై తప్పు నొప్పివేసికొని తరువాత తన తప్పును చూపనవాని పనిపట్టుటకు ప్రయత్నింతురు. సిసలైన సహృదయుడైనచో తప్పు నొప్పుకొనుట మాత్రమేకాదు; క్షమాపణ చెప్పుకొని తనకా దోష పరిజ్ఞాన ప్రదాతలైనవారియెడ కృతజ్ఞతను గూడ ప్రకటించును. ఇట్టి సహృదయులీ మన దేశములో, కవులలో, విమర్శకులలో నెందఱుందురు? బ్రదికి చెడిన దేశముగదా భారతదేశము !!

---

# మహాత్ముని జీవిత సందేశము



మహాత్మాగాంధీ షష్ట్యబ్దపూర్త్యుత్సవ సందర్భంలో దేశోద్ధారక, విశ్వదాత, కళాప్రపూర్ణ శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు 1929 అక్టోబరునెల భారతిలో 'సాభిప్రాయవిశేషణము'లలో మహాత్ముని జీవితసందేశం గురించి తమ భావాలను గంభీరోదాత్తంగా ప్రకటించారు. ఆ భావాలు నాలుగు దశాబ్దాలు గడచినా, వర్తమానపరిస్థితిలో తెలియదగినవీ, నిరంతరమనన యోగ్యాలూ కావడంవల్ల ఇక్కడ ఆ సాభిప్రాయవిశేషాలను మహాత్మాగాంధి శతజయంతి ఉత్సవ సందర్భాన్ని పురస్కరించుకుని ఉల్లేఖిస్తున్నాము.

సత్యంవద। ధర్మంచర। స్వాధ్యాయాన్మా ప్రమదః ఆచార్యాయ ప్రియం ధన మాహృత్య ప్రజాతంతుం మా వ్యవచ్ఛేత్సీః। సత్యాన్న ప్రమదితవ్యం। ధర్మాన్న ప్రమదితవ్యం। కుశలాన్న ప్రమదితవ్యం॥ భూత్యై న ప్రమదితవ్యం। స్వాధ్యాయప్రవచనాభ్యాం న ప్రమదితవ్యం। దేవపితృ కార్యాభ్యాం న ప్రమదితవ్యం। మాతృదేవో భవ। పితృదేవో భవ। ఆచార్యదేవో భవ। అతిథిదేవో భవ। యాన్యనవద్యాని కర్మాణి। తాని సేవితవ్యాని। నో ఇతరాణి। యాన్యస్మాకగ్ం సుచరితాని, తాని త్వయోపాస్యాని। నో ఇతరాణి॥

యే కే చాస్మచ్ఛ్రేయాగ్ంసో బ్రాహ్మణాః। తేషాం త్వయాసనేన ప్రశ్వసితవ్యం। శ్రద్ధయా

దేయం। అశ్రద్ధయాదేయం। శ్రియా దేయం। హ్రియా దేయం। భియా దేయం। సంవిదా దేయం। అథ యది తే కర్మవిచికిత్సా వా వృత్తవిచికిత్సా వా స్యాత్॥

యే తత్ర బ్రాహ్మణా స్సమ్మర్శినః। యుక్తా ఆయుక్తాః। అలూక్షా ధర్మకామాస్స్యుః। యథా తే తత్ర వర్తేరన్। తథా తత్ర వర్తేథాః। అథాభ్యాఖ్యాతేషు। యే తత్ర బ్రాహ్మణా స్సమ్మర్శినః। యుక్తా ఆయుక్తాః। అలూక్షా ధర్మకామా స్స్యుః। యథా తే తేషు వర్తేరన్॥

తథా తేషు వర్తేథాః। ఏష ఆదేశః। ఏష ఉపదేశః। ఏషా వేదోపనిషత్। ఏతదనుశాసనం। ఏవ ముపాసితవ్యం। ఏవ ము చైతదుపాస్యం। స్వాధ్యాయ ప్రవచనాభ్యాం న ప్రమదితవ్యం। తాని త్వయో పాస్యాని విచికిత్సావాప్యౌ త్తేషు వర్తేరన్॥

ప్రపంచ కల్యాణమునకై మహాత్ములకారణముగను సర్వసంగపరిత్యాగమును జేయుచు ప్రజారాధనమునకు పాత్రులగుచున్నారు. సామాన్యులకు స్వప్రయోజన పరాయణత్వము సహజమైనటులు మహాత్ములకు పరహిత పరాయణత్వము సహజశీలము. సామాన్యులకు పశుబలము పరిపాటియైనటులు మహాత్ముల కాత్మబలము సహజమగుచున్నది. సామాన్యులకు భోగ మారాధ్యమైనటులు మహాత్ములకు త్యాగ మారాధ్యమగుచున్నది. సామాన్యుల కాగ్రహము సహజముగ గలుగునటులు మహాత్ములకు నిగ్రహము సహజముగ గలుగుచున్నది. సామాన్యులకు బాహ్య విషయములు ప్రమాణమైనటులు మహాత్ముల కాత్మవిషయములు ప్రమాణము లగుచున్నవి. ఒకనికి తన లాభము, తనవారి లాభము; రెండవ వానికి మానవ లాభము, విశ్వలాభము. సామాన్యుల యాచరణము సంరంభమునకును, మహాత్ముల యాచరణము శాంతికిని సాధనము లగుచున్నవి.

మహాత్ముల యాచరణములు సామాన్యుల కాదర్శములై పురుషార్థసిద్ధికి సాధనము లగుచున్నవి. మహాత్ముల యాచరణములు భిన్నసంస్కారములుగల జనులకు వారు తలచినటులు గోచరంబగుచుండును. దైవసంపన్నులు వారి భక్తులకు వారి కోరికల కనురూపముగను ప్రత్యక్షమగుచు ధర్మాభ్యుదయమును జేయుచున్నారు. శ్రీకృష్ణుడు, బుద్ధుడు, క్రీస్తు మొదలగు దైవసంపన్నులు ధర్మాభ్యుదయమును జేసిన విధమును ప్రపంచచరిత్ర సహస్రముఖములను చాటుచున్నది. గాంధిమహాత్ముని దివ్యచరిత్రమును ఆ మహనీయుల దివ్యచరిత్రమును సంస్మరింపజేయుచున్నది. తైత్తిరీయోపనిషత్తునందు శిక్షావల్లి తెలుపుచున్న సత్యధర్మాదేశోపదేశానుశాసనములు గాంధీమహాత్ముని గురుత్వమున కనురూపముగ నున్నవి.

దేశమునందంతటను అక్టోబరు మాసాదిని జయంత్యుత్సవములు జరుపబడినవి. ఆ యుత్సవములం దన్నిపక్షములవారును, మతములవారును, జాతులవారును గాంధి మహాత్ముని గుణసంకీర్తనమును జేసిరి. అన్నవస్త్ర దానములను జేసిరి. సభలను, సంకీర్తనలను జేసిరి గీతములను బాడిరి. బోధనలను జేసిరి. సంచికలను ప్రచురించిరి. ఖద్దరును విక్రయించిరి. ఈ మహోత్సవములన్నియును ధర్మ సంస్మరణమును గలుగజేయుచున్నవి.

గాంధిమహాత్ముడు శ్రీనివాసశాస్త్రిగారికి నైతిక చక్రవర్తి; డాక్టరు సుబ్బరాయనుగారికి సంస్కరణ ప్రియుడు; సత్యమూర్తిగారికి రాజ్యాంగ ధురీణుడు; హోమ్సుగారికి మానవసేవా పరాయణుడు; రోమెయిను రోలెండుగారికి ధర్మమూర్తి; సరోజినిదేవిగారికి త్యాగ సంపన్నుడు! లోకమునకు శాంతిదూత; భారతీయుల కవతారమూర్తి. సర్వాత్మస్వరూపుడైన భగవంతు నెవ్వ రేవిధముగ నారాధించెదరో వారల కావిధమున ననుగ్రహించుచున్నాడు.

శ్లో. యే యథా మాం ప్రపద్యన్తే
తాం స్తథైవ భజా మ్యహమ్,
మమ వర్త్మానువర్తన్తే
మనుష్యాః పార్థ! సర్వశః.

గీత. అ. 4., శ్లో. 11.

వర్తమానకాలమునందు లోకమునందంతటను ధర్మఘోష ప్రతిధ్వనిల్లుచున్నది. ఆస్తికులు నాస్తికులు, నిరంకుశాధికారులు స్వరాజ్యకాములు, సంగ్రామకాములు శాంతిప్రియులు, పూర్వాచారప్రియులు సంస్కరణప్రియులు, పండితులు పామరులు, ధర్మప్రతిజ్ఞలను జేయుచున్నారు. స్వార్థమునకును పరార్థమునకును, భోగమునకును త్యాగమునకును, దైవసంపదలకును అసుర సంపదలకును, ధర్మప్రవచనములను ధర్మరాజులు చేయుచున్నారు. అధికారానధికారులు చేయుచున్న ధర్మప్రవచనములు ప్రజలకు మహాసంభ్రమమును గలుగజేయుచున్నవి. కర్తవ్యము మాత్రము దుర్గ్రాహ్యముగ నున్నది.

రాజ్యాంగ విశారదులు స్వరాజ్యము పరమధర్మమని చాటుచున్నారు. ఆర్థిక విశ్వాంసులు భౌతిక భాగ్యములు ధర్మార్థములని నమ్ముచున్నారు. సాంఘిక సిద్ధాంతులు సంఘసంస్కరణము పరమప్రయోజనమని ఉద్ఘోషించుచున్నారు. మత ప్రియులు మత సంరక్షణము పరమార్థమని ఘోషించుచున్నారు. ఆచారప్రియులు పూర్వాచారసంరక్షణమే ప్రధానధర్మమని వాదులాడుచున్నారు. ఆసురబలప్రియుల సంగ్రామసన్నాహములు కల్యాణసాధనములని సమర్థించుచున్నారు. వృత్తమునందలి వలయమునం దన్నిస్థలములును భిన్నమై కేంద్రమునకు సమానదూరమునందున్నను, కేంద్రముమాత్రము స్థిరముగ నున్నది. కేంద్రధర్మాధారములేని ప్రత్యేక ధర్మములు నైమిత్తిక ధర్మములైనను, నిత్యధర్మములు గాజాలవు. వర్తమాన విషాదదశయందు ధర్మసంరంభమునందు సంశయములను దీర్చి నిత్యమైన ధర్మోపదేశములను చేయగల ధర్మాత్ములు ధన్యులు. అట్టి ధర్మాత్ములందు గాంధిమహాత్ముడు లోకాదరణమును బడయుచున్నాడు. వారి లోకాదరణమునకు వారి ఆత్మధర్మారాధనమే మూలముగ నున్నది.

ధర్మరాజునకు భీష్ముడుత్తమధర్మ మాత్మధర్మమను విషయమును విశదము చేసెను.

తే. 'వినుమనేక విధంబుగా విస్తరిల్లు
ధర్మములయందు నొకండును దలప నిష్ఫ
లంబు లే దాత్మమోక్షావలంబియైన
ధర్మ ముత్తమ మండ్రు తత్త్వజ్ఞు లధిప'

గాంధిమహాత్ముడాత్మకథయందు ఆధ్యాత్మిక లక్ష్యముతో జేసిన ధర్మనిర్ణయము భీష్ముడు ధర్మరాజునకు జేసిన ధర్మనిర్ణయమున కనురూపముగ నున్నది.

'నా ప్రయోగములందాధ్యాత్మికము లనగా నైతికధర్మములు; ధర్మమున కర్థము నీతి; ఆత్మదృష్టితో ఏనీతి పాలింపదగినదో అది ధర్మము...... నేను కొతటస్థుడనై, అభిమానరహితుడనై ఈ కథను వ్రాయగలిగితినేని ప్రయోగ మార్గానుగాములగు నితరుల కిందు దారి బత్తెము దొరకగలదు.

నేను కేవలము సిద్ధాంతములను అనగా తత్త్వములనుగూర్చి వ్రాయదలంచితి నేని ఆత్మకథను వ్రాయను. కాని యీ సిద్ధాంతములనుండి బయలుదేరిన కార్యముల యితిహాసమును వ్రాయగోరుచున్నాను. కావుననే యీ ప్రయత్నమునకు సత్యప్రయోగమని మాఱుపేరుంచితిని. ఇందు సత్యముకన్న భిన్నము లనబడు అహింసాబ్రహ్మచర్యాది నియమములును, వీని ప్రయోగములును రాగలవు. కాని సత్యమే నా కన్నిటికన్న దొడ్డది. మఱియు దీనియందు పెక్కువస్తువుల సమావేశము కలదు. ఆ సత్యము స్థూలముగా వాక్సత్యమే కాదు: భావసత్యముకూడ. ఆ సత్యము కేవలము నా కల్పనాగత సత్యమే కాదు: అది స్వతంత్రము, చిరస్థాయి; అనగా సాక్షాత్పరబ్రహ్మము.

వందలు వేలు ప్రమందుదురుగాక! సత్యమునకే సదా జయమగుగాక! అల్పాత్ముల ప్రమాణముచే సత్యముయొక్క ప్రమాణము సీసర వోవకుండుగాక!

నేను నిందు నమ్మకతో ఎవనిని వాయూర్పు నిట్టూర్పుల కేలికగా తలంచుచుంటినో, మరియు

ఎవని యుప్పుగల్లు నేను తినుమంటి ననుకొను చుంటినో, అలవానికి నేనింతవఱకును దవులనే యుంటినను నీ చింత ప్రతిక్షణము నన్ను తొలుచు చున్నది. దీనికి కారణము నా వికారములే యని నాకు దెలియును. కాని వీని నింతవఱకు నిర్మూలము చేయజాలకున్నాను.'

ఆధ్యాత్మికధర్మము నిత్యమై సకలధర్మముల కాధారభూతముగ నున్నది. సత్యాన్వేషణమునకును, ధర్మాన్వేషణమునకును ఆత్మాన్వేషణము చేయుచున్న గాంధిమహాత్ముని జీవయాత్ర మానవులకు సంకీర్తన యోగ్యముగ నున్నది. జీవయాత్రను సత్యాన్వేషణ మునకై ఆహుతిచేయుచున్న మహాత్ముని పావనచరిత్ర మల్పాత్ములకు ధర్మాన్వేషణమునకు సాధనభూతముగ నున్నది.

శ్రీకృష్ణుడు విజయున కాత్మసాక్షాత్కారము నకు కర్మయోగము నుపదేశించెను. బుద్ధభగవానుడు దుఃఖనివృత్తికి విశుద్ధజీవనమును; జీవకారుణ్య మును లోకమున కనుగ్రహించెను. ఏసుక్రీస్తు మానవ తరణమునకు ప్రేమ తత్త్వమును, త్యాగసాధనమును ప్రసాదించెను, ఆ మహాత్ములు లోకోద్ధరణమును, నాత్మోద్ధరణమును నాత్మధర్మసాధనముననే చేసిన విధముననే గాంధిమహాత్ముడును నాత్మధర్మసాధన మున లోకోద్ధరణమును, నాత్మోద్ధరణమును జేయు చున్నాడు. ప్రపంచము ధర్మమువిూద నాధారపడి యున్నది.

ధర్మము, భౌతికము, నైతికము, ఆధ్యా త్మికములను రూపములను విశ్వమును ధరించుచున్నది. విశ్వము ధర్మమువిూద నాధారపడియున్నది. పాశ్చాత్య దేశములందు భౌతిక ధర్మప్రవృత్తి ప్రవర్ధమానమై ఆధ్యాత్మిక ధర్మప్రవృత్తిని స్తంభింపజేసినది. భారత దేశమునం దాధ్యాత్మిక ధర్మప్రవృత్తి విద్రావస్థపాలై భౌతిక నైతిక ధర్మప్రయోజనములకు నిరుపయోగ మైనది. భారతీయుల కాత్మసంస్మరణము దుస్తరమై భౌతిక ధర్మమును దురారాధ్యమైనది. శ్రీకృష్ణ డుపదేశించిన కర్మయోగము, బుద్ధదేవు డుపదేశించిన అహింసాధర్మము భరతవర్షమునకు దూరస్థము లైనవి. ధర్మపరీక్షణము నిత్యమైన ఆధ్యాత్మిక ప్రయోజనములనుండి అనిత్యములైన భౌతిక ప్రయోజనములను సమకూర్చుటకైనను సంకల్పము, సంస్కారము, సాధనసంపత్తి స్తంభించినవి. స్వల్ప ప్రయోజనములు మహాఫలములైనవి. సకల వ్యసనము లందును ఆత్మానుబంధన మంతర్హితమై, పరావలం బనము పరమప్రమాణమైనది.

ఇట్టి విషమదశయందు భారత దేశోద్ధరణ మునకు గాంధి మహాత్ముడు కార్యరంగమునందు జేరుట భారతదేశ సౌభాగ్యమునకు శుభచిహ్నముగ నేర్పడినది. విద్యావంతులు, విద్యార్థులు, పండితులు, పామరులు, శ్రీమంతులు సామాన్యులు, స్త్రీలు పురుషులు, బాలురు బాలికలు గాంధిమహాత్ముని యుపదేశముల ననుసరించి యాత్మపరిశోధనమును జేసి కొనుట కుపక్రమించిరి. గాంధిపేరు మూలమూల లను వ్యాపించినది. శ్రీరామనామ సంస్మరణము వలెనే గాంధినామ సంస్మరణమును ప్రజలు చేయు చున్నారు. గాంధి సంచారములందు లక్షలకొలది ప్రజలు పాదాక్రాంతులై ఖద్దరు నిధికి కానుకలను సమర్పించుచున్నారు. ఆంధ్రదేశ సంచారమునందు ప్రజలు చూపిన భక్త్యుత్సాహములు గాంధిమహాత్ముని మాహాత్మ్యమును సహస్రముఖముల చాటుచున్నవి.

గాంధి మహాత్ముడు వర్తమాన యుగమునందు భారత సంస్కారమునకును, విజ్ఞానమునకును, అవ తారమూర్తియై వెలయుచున్నాడు. గాంధిమహాత్ముడు కర్మయోగి, విరాగి; మహాదాత, యాచకుడు; జ్ఞాని; ఉద్యోగి; నాయకుడు, అనుచరుడు; సత్యవాది, ప్రియవాది; స్వాతంత్ర్యప్రియుడు; నియత కర్మా రాధకుడు; ఆంగ్ల భాషాపండితుడు, హిందీ ప్రచార కుడు; మానవ సేవకుడు, స్వదేశవ్రతపరాయణుడు.

సద్గుణసంపన్నుడైన గాంధిమహాత్ముడు కేవ లము భారతనాయకుడేగాక లోకనాయకుడు, లోకో

త్తరపురుషుడు. హిందువులు, మహమ్మదీయులు, క్రైస్తవులు, బౌద్ధులు, పాశ్చాత్యులు, ప్రాచ్యులు మహాత్ముని గుణశీలముల నారాధించుచున్నారు గాంధి మహాత్ముడు నిస్సహాయస్థితియందు నిద్రించుచున్న భారతీయులను మేల్కొలిపి ఆత్మసహాయమును నేర్పిన మహాయోగి.

ఉద్ధరే దాత్మనాఽఽత్మానం
నాత్మాన మవసాదయేత్,
ఆత్మైవ హ్యాత్మనో బన్ధు
రాత్మైవ రిపు రాత్మనః
గీత: అ. 6, శ్లో. 5.

ఆత్మవిశ్వాసమును, ఆత్మసహాయమునే సహాయనిరాకరణయోగము, సత్యాగ్రహయోగము. సత్యాగ్రహయోగము మహత్తరమైన ఆత్మయోగము. ఇమ్మహాయోగాభ్యాసమును సకలజనులుచేసి కామితార్థములను బడయుటకు రాటము, ఖద్దరు పరమసాధనములుగ నున్నవి. రాటము దరిద్రనారాయణులకు కామధేనువు. శ్రీమంతులకు యోగచక్రము రాటమును, ఖద్దరు ధారణమును భారతీయుల కాత్మశక్తిని ప్రసాదించుటకు పరమసాధనములుగ నున్నవి. సర్వజనసౌలభ్యమైన స్వరాజ్యసాధనము నారాధించి గాంధిమహాత్ముని సంకల్పమును సఫలముచేయుట భారతీయులకు పరమధర్మముగ నున్నది గాంధిమహాత్ముని షష్టిపూర్త్యుత్సవ సమయమునందైనను ఖద్దరు దీక్షను బూనుట గాంధినామ సంస్మరణమునకు ప్రయోజనము. కర్మయోగములేని జ్ఞానయోగము జీవయాత్రను జేయుటకైనను ప్రయోజనకరముగాదు. దేహయాత్ర చేయజాలనివా రాత్మయాత్రను చేయజాలరు. ఆత్మయాత్రను జేయుటకె గాంధిమహాత్ముడు పూనిన మహాదీక్షలో శతాంశమైనను భారతీయులు పూనినయెడల ముప్పదికోట్ల భారతీయులకు దుర్లభమైన కార్యము గనబడదు.

భౌతిక బలాభిమానధర్మముల కభ్యస్తమైన లోకమున కాత్మబలమునందు విశ్వాసము గలుగుట దుర్ఘటము. ప్రపంచ ప్రవృత్తియందాగ్రహము సులభము, నిగ్రహము దుర్లభము. ప్రవృత్తియందు కర్మ కనురూపమైన ఫలము గలుగుచున్నది. హింసకు ఫలము హింస. ప్రేమకు ఫలము ప్రేమ. ప్రపంచ నిలయమునకు మూలమైన హింసాధర్మమును లోకమారాధించి హింసాఫలము ననుభవించుచున్నది. గాంధి మహాత్ముడు త్రికరణశుద్ధిగను అహింసాధర్మము నారాధించుచున్న విధమును వారి జీవయాత్ర విశదము చేయుచున్నది. బుద్ధభగవానుడు 2500 ఏండ్లకు పూర్వము ప్రసాదించిన యుత్తమ ధర్మమును గాంధి మహాత్ముడు లోకకల్యాణమునకై పూరించుచున్నాడు. ఆ పవిత్ర ధర్మవ్యాపనమును జేసి ప్రపంచమునందు శాంతిని స్థాపించుట మహాభాగ్యము. ఇట్టి మహోదయ సమయమునందు జననమొందుటయును, లోకోత్తర పురుషుడైన గాంధి మహాత్ముని సాంగత్య సంభాషణ సంసేవన లాభములను బడయుటయును, లోకకల్యాణమునకై ఉడుతభక్తిచందాన గాంధి మహాత్ముని దీక్షను సఫలము చేయుటయును మహాభాగ్యముగ నున్నవి. ఈ మహోదయానందము ననుభవించుట కధికారమును బడయుటకు భారతీయులు ఖద్దరును సత్యమును అహింసాధర్మమును సేవించుటకు భగవదనుగ్రహము గలుగుగాత!

ఆ. దంతియడుగులోనం దక్కిన జంతు చ
యంబు నడుగులెల్ల నడగియుండు
నట్ల ధర్మకోటు లన్నియు లోవగు
విద్ధగుణ యహింస కింత నిజము:

సకల ధర్మములును అహింసా ధర్మమునం దిమిడియున్నవి. ఒరులు తనకెన్ని చెడుగులను జేసినను నితరులకు చెడుగు జేయకుండుట పరమధర్మము. ఇట్టి పరమధర్మమే అహింసాధర్మము. ఈపరమధర్మ స్వరూపము మహాత్ములకు ప్రత్యక్షమై సామాన్యులకు సులభగ్రాహ్య మగుచున్నది: ఉత్పన్నమైన ఆత్మ ధర్మమును నుద్ధరించి భరతవర్షమును, లోకమును నుద్ధరించుటకు గాంధి మహాత్ముడు చూపుచున్న మహాత్యాగము వారికమరత్వమును గల్పించు చున్నది. ఆత్మ మాహాత్మ్యమును ప్రత్యక్షముగ సందర్శించు చున్న వారైనను, ఆత్మప్రపత్తిని బడయుటకు గాంధి మహాత్ము డవలంబించిన దీక్షావిధానము నవలంబించి పురుషార్థమును సార్థకము చేయుదురుగాత!

---



# గ్రంథ విమర్శలు

## రాజమన్నారు నాటికలు

[అయిదు ఏకాంకికలు; రచన : డా. పి. వి. రాజమన్నారు; ప్రచురణ : ఎం. శేషాచలం అండ్ కంపెనీ—బందరు : సికింద్రాబాద్ : మద్రాసు; 110 పేజీలు; వెల రూ. 2—50]

ఏకాంకికారచయితలలో శ్రీ పాకాల వేంకట రాజమన్నారు సుప్రసిద్ధులు ఏకాంకికా రచన ప్రారంభమై శతాబ్దమైనా నిండకపోయినా విశ్వ నాథకవిరాజా, చింతా దీక్షితులు, శ్రీపాద సుబ్ర హ్మణ్యశాస్త్రి, ముద్దుకృష్ణ, ఆమంచర్ల గోపాలరావు, చలం, భమిడిపాటి కామేశ్వరరావు, పాలగుమ్మి పద్మ రాజు, శ్రీ శ్రీ, జి. వి. కృష్ణారావు, బుచ్చిబాబు, నార్ల వేంకటేశ్వరరావుగార్లవంటి రచయితలెందరో మన భాషలో అమూల్యమైన నాటికలను వ్రాశారు. హేతువాదభావనతో నాటికలు వ్రాసినవారి రచనలు మరింత రసవత్తరంగా ఉంటాయి. శ్రీపాద గోపాల కృష్ణమూర్తిగారు సంకలనం చేసిన 'నేటి ఉత్తమ నాటకలు,' శ్రీ ముద్దుకృష్ణ సాహిత్యఅకాడమీకోసం సంకలనం చేసిన నాటికలూ పాఠకులందరూ చదువ తగినవి. అన్నినాటికలూ ఉత్తమమైనవిగా వ్రాసిన నాటికా రచయితను పేర్కొనమంటే రాజమన్నారు గారి పేరే ముందు జ్ఞాపకం వస్తుంది. తర్వాత నార్ల వారి నాటికలు పేర్కొనదగినవి. రాజమన్నారుగారి నాటికలొక పెద్దసంపుటంగా యీ వరకే వచ్చాయి. వారి నాటికలలో అత్యుత్తమ కళాఖండాలని చెప్ప దగిన ఐదునాటికలు; 'ఏమి మగవాళ్ళు', నిష్ఫలం; విముక్తి; దెయ్యాలలంక; నాగుబాము 'రాజమన్నారు నాటికలు' అనే పేరుతో ఎం. శేషాచలం అండ్ కంపెనీ వారు ప్రచురించిన యీ సంపుటంలో ఉన్నాయి. సాహిత్యాభిమానులెల్లరూ యీ నాటికా సంపుటం అవశ్యంకొని చదువ తగినది. స్వంత గ్రంథాలయంలో చేర్చుకొని మాటిమాటికీ చదువు కొని ఆనందించదగినది.

'ఏమి మగవాళ్ళు' నాటికలో వేణు అనే యువకుడు కనకం అనే వేశ్యను సంస్కరణ వివాహం చేసుకొంటాడు. ఆమె సంగీత నాట్యాలలో ప్రావీణ్యం గల యువతి. వేణు ఛాందసబ్రాహ్మణకుటుంబానికి చెందినవాడు. సోమసుందరంగారు వేణు బాబాయి. ఆయన వృద్ధాప్యంలో రెండో పెళ్లి చేసుకున్నవాడు. ఆయనభార్య సుందరమ్మ అందమైనది. ఆమె విధిలేక సోమసుందరంగారిని వివాహం చేసుకొన్నప్పటికీ ఆయన తమ్ముడు కృష్ణమూర్తిపైన మరులు కొంటుంది. కృష్ణమూర్తి అందమైనవాడు. సౌందర్యా రాధకుడు. సంగీతమంటే తగనిపిచ్చి. వేణు కనకాన్ని వివాహం చేసుకొన్నాడని వినగానే సోమసుందరంగారు మండిపడి వేణూకు ఆస్తిని పంచియిచ్చి వేరుగా ఉంచాలనుకుంటాడు. తన యింటికి రాకుండాచెయ్యా లనుకుంటాడు. కాని టెలిగ్రామ్‌యిచ్చి, అది అందీ అందకముందే కనకంతో కలిసి నేరుగా యింటికి వచ్చేస్తాడు. సోమసుందరంగారు కనకం అందానికి వశుడైపోతాడు. ఆమె ఏకాంతంగా కూనిరాగం తీస్తూవుంటేవచ్చి జావళీ పాడమని వేపుకుతిని, ఆమె పాడుతూంటే తాళంవేస్తూ మధ్యలో ఆమె తొడపై చేయి వేస్తాడు. అంతలో అతడి మిత్రుడు శంకర శాస్త్రి అక్కడికి వస్తాడు. శంకరశాస్త్రి కనకానికి పూర్వపరిచితుడు కావటాన ఆమె సోమసుందరంగారి సంగతి బయటపెట్టేస్తుంది. కృష్ణమూర్తి అంతే! కనకం పాటను ఆనందిస్తున్నట్లుగా మొదలై చివరకు ఆమె చేయిపట్టుకుని విడువడు. అంతలో వేణు రానేవచ్చేస్తాడు. వేణూకు కనకం ప్రవర్తన నచ్చదు. సంస్కరణ వివాహంచేసుకొని నిభాయించ

లేని అందరిలాగే కనకాన్ని అనుమానిస్తాడు. 'నీలాంటి దాన్ని పెళ్ళిచేసుకోవడమే పొరపాటు' అనికూడ అంటాడు. కనకంమాత్రం ధైర్యంగా 'అవును, అన్నీ నా తప్పేగదూ? ముసలివాణ్ణి కట్టుకొని మీ పిన్ని మరిదిమీద మరులు కొనడం నా తప్పే. పిచ్చిబ్రహ్మచారి అందమైనపిల్ల కనబడగానే అవకతవకగా ప్రవర్తించడం నా తప్పే. మరిది నామీద కన్ను వేశాడని ఆవిడ ఉలికిపడితే నాదే తప్పు...50 ఏండ్ల ముసలివాడు—ధర్మశాస్త్రాలు తల్లక్రిందుగా చదివే మీ బాబయ్య—ఒంటరిగాచూచి, వద్దచేరి, వావివరసా లేకుండా, నా తొడమీద చేయివేస్తే నాదే తప్పు. ఎప్పుడో కాకినాడలో మా యింటి పక్కనున్న శాస్త్రులతో ఆ గొడవచెప్పుకొని నవ్వితే అదీ నా తప్పే'అని తిరగబడి మాట్లాడుతుంది. తన అందం చూచి ఎగబడిన మగవాళ్లను 'వెర్రికుక్కల్లాగ వాళ్లు మైనబడ్డా'రని యీసడిస్తుంది. కళ్లనీళ్ల తుడుచుకొని, నిరసనభావంతో పెదవి విరిచి, మంగళసూత్రం చేతితో తెంపిపారవేసి 'ఛీ! ఛీ! ఏమి మగవాళ్లు!' అంటుంది. 'ఎంతవారలైనా కాంతదాసులే' అనే త్యాగరాయకీర్తన కలిగించే అనుభూతికంటె, మానసికపరివర్తనకంటె, ఎక్కువ ప్రయోజనాన్ని యీనాటిక సాధిస్తున్నది. 'ఏమి మగవాళ్లు' నాటిక యితర భాషలలోకి కొన్నింటిలోనికి అనువదింపబడినది. ఇంకా ఎన్నోభాషలలోనికి అనువదింపబడాలి. మగవాడి నైజాన్ని బయటపెట్టే యీనాటిక చదివిన వాళ్లకు కలకాలమూ జ్ఞాపకముండేదీ, 'ఆడదంటే యేమిటి?'అని సమాజాన్ని ఎప్పుడూ ప్రశ్నించే నాటిక యిది. తెలుగులోని ఉత్తమ నాటికలలో రాజమన్నారు గారి నాటికలు గణింపదగినవి. 'ఏమి మగవాళ్లు' నాటిక వ్రేళ్లమీద లెక్కపెట్టదగిన వారి మంచి నాటికలలో నొకటి.

'విషఫలం' నాటికలో జమీందారు రంగారావు చిత్రరేఖ అనే వేశ్యను ఉంచుకొని విలాసమయ జీవితం గడుపుతూంటాడు. జూదరియై జమీందారు సంపదనంతా కోల్పోయి బీదరికానికి గురియౌతాడు. చిత్రరేఖ రంగారావునే నమ్ముకొని వృత్తికి స్వస్తి చెబుతుంది. చిత్రరేఖ తన ఆస్తినంతా కర్పూరంలాగా కరిగించి జమీందారుచేసిన అప్పులు తీరుస్తూంటుంది. రంగారావు ధర్మపత్ని సీతయ్యమ్మ నొకనాడు చిత్రరేఖ యింటికి వస్తానని వర్తమానం పంపుతుంది. రంగారావుకు ఆభిజాత్యం జాస్తి. తన భార్య వేశ్య యింటికి వస్తున్నందుకు మహా ఇదయి పోతాడు. తనను నమ్ముకొని, సర్వస్వంగా యెంచుకుంటున్న చిత్రరేఖ యెదుటనే 'ఎంతటి కార్యానికి పూనుకున్నదో...దేవాలయానికితప్ప ఇంకొక చోటికి వెళ్లదు...ఎంత త్యాగం...ఎంత ఉదారం!' అని తన భార్య త్యాగాన్నే మెచ్చుకుంటాడు. 'చిత్రరేఖ కండ్లలో నవ్వులేదు ఇప్పుడు; అంతా ఏడుపే' అని చెప్పి మగవాడి స్వభావం యెంత ఘోరమైనదో చూపిస్తుంది యీ నాటిక. సీతయ్యమ్మ చిత్రరేఖను శంకిస్తుంది. వేశ్య త్యాగం చేసిందంటే నమ్మలేక పోతుంది; కోరరాని కోర్కె కోరుతుంది. చిత్రరేఖ సౌందర్యాన్ని పణంగాపెట్టి డబ్బు సంపాదించి జమీందారు కిమ్మంటుంది. తన ప్రేమను శంకించినందుకు చిత్రరేఖ 'ఏమిటి మీ గొప్పతనం? మీ ప్రాతివ్రత్యం! వేరే గతిలేక స్వాతంత్ర్యంలేక, ధర్మమని, విధియని మీరు భర్తలమీద భక్తి; విశ్వాసం కనబరుస్తున్నారు, మా బోటి వాళ్లకు ఆ సంకెళ్లు లేవు. స్వచ్ఛందవృత్తి. ఈ కృత్రిమబంధాలు లేవు. బలవంతపు ప్రాతివ్రత్యం మీది. నాది స్వతంత్రమైనది. నాకు నిజంగా వారిమీద ప్రేమ, విశ్వాసం, విధియనిగాదు, ధర్మమనిగాదు, వేరేగతిలేకగాదు' అని మండిపడుతూ జవాబిస్తుంది. ఈ మాటకు ఎవరుమాత్రం జవాబు చెప్పగలరు. సంఘంలోని బలవంతపు ప్రాతివ్రత్యాన్ని నాటికా రచయిత ఎంతో కళాత్మకంగా దుయ్యబట్టారు. ఐతే ఏం లాభం? సీతయ్యమ్మలాగే యీ సమాజంకూడ 'సానిముండకు పాతివ్రత్యం!—నేతిబీరకాయ...' అని దుయ్యబడుతుంది. వేశ్యలలోనూ హృదయమున్న వాళ్లున్నారనీ, వాళ్లూ ప్రేమించగలరనీ, వాళ్లు మనుష్యులే

నని వొక వగ్నసత్యాన్ని ప్రదర్శిస్తుంది ఈ నాటిక. చింతామణి, మధురవాణులకు మల్లే చిత్రరేఖ కూడ చిరస్మరణీయమైనపాత్ర. మధురవాణి లోని వాక్చతురత్వంమాత్రం చిత్రరేఖలో కని పించదు. కాని శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు పేర్కొనినట్లు 'ఛెకోవ్ కోరస్‌గర్ల్'కంటె చిత్రరేఖ తెలివైనది'.

'విముక్తి'నాటికలో రాధఅనే అమాయిక బాల్య వితంతువు దుస్థితిని ప్రదర్శించారు. రాధకు బాల్యం లోనే వైధవ్యం ప్రాప్తించింది. సహజంగానే ఆమెకు యౌవనమూ, కోరికలూ, పెళ్లిచేసుకోవాలన్న వాంఛా కలిగాయి. ఆమె యౌవనోద్రేకాన్ని అవకాశంగా తీసి కొని, రాఘవరావుగారనే పెద్దమనిషి కుమారుడు మోసం చేస్తాడు. ఫలితంగా ఆమె గర్భవతి అవుతుంది. ఆమె వీధుల్లో పడవలసివచ్చి, తెలిసినవాళ్లుగదా ఆశ్రయమిస్తారేమోననే ఆశతో ఆమె వెంకట సుబ్బయ్యగారనే 'పెద్దమనిషి' యింటికి వస్తుంది. కాని ఆ యింట్లోవాళ్లు ఆమెను తూలనాడి అవ మానిస్తారు. మళ్లీ వాళ్లు పవిత్రులాఅంటే అదేమీ కాదు. వెంకటసుబ్బయ్య బావమరిది వెంకటేశ్వర్లుకు పనివాళ్ల యిళ్లల్లోనే కాలక్షేపం వెంకటసుబ్బయ్య కూతురు సుభద్ర బాలవితంతువైనా ఆలమూరివారి అబ్బాయితో చాటుమాటు ప్రేమకలాపం సాగిస్తూం టుంది. మళ్లీ వీళ్లుమాత్రం నమ్మిమోసపోయిన రాధను అవమానించి బాధిస్తారు. రాధ వాళ్ల వాకిటి లోనే ప్రసవవేదన పడుతుంది. వెంకటసుబ్బయ్య కుమారుడు సత్యం ధైర్యంగా ఆమెకు ఆశ్రయ మిస్తాడు. సత్యం ప్రదర్శించిన జాలి క్రమంగా ప్రేమగా మారుతుంది. రాధకూడ సత్యాన్ని ప్రేమి స్తుంది. సత్యం తండ్రి నెదిర్చి రాధతో వేరింటి కాపురం పెడతాడు. ఐనా సంఘం వేటాడటం మానదు. నిరుద్యోగంతో ఆకలితో వాళ్లిద్దరూ బాధ లకు గురియౌతారు. తండ్రికి జబ్బుగా ఉన్నదని కబురు తెలియటంతో సత్యం తిరిగి తండ్రియింటికి వెళ్తాడు. రాధ సంఘంపెట్టిన బాధలకు 'విముక్తి'గా దిగుడుబావిలోపడి చనిపోతుంది. ఈ నాటకం చదివి నప్పుడు తప్పకుండా కన్నీళ్లు వస్తాయి. ఈ నాటిక రేడియోలో ప్రసారం చెయ్యటానికి మిక్కిలి అను వైనది.

'దెయ్యాలలంక'అనే నాటిక రాజమన్నారుగారి నాటికలలో అత్యుత్తమకళాఖండం. దీన్లోనూ బాల వితంతువే నాయిక. సుధఅనే అమ్మాయి చిన్నప్పుడే వితంతువైనా చక్కని అందంతోనూ అందానికి తగ్గట్టు నేర్పుగా కవయిత్రివలె మాట్లాడటంలోనూ సాహిత్యజ్ఞానాన్ని బాగా పెంపొందించుకొని, ఆమె బావగారైన చలపతిని ఆకర్షిస్తుంది. చలపతికి సుధను చూస్తే ప్రాణసఖిని చూచినట్లుంటుంది. చలపతి భార్య కాంతం కుత్సితపు ఆలోచన లున్నది. ఓనాడు చలపతి సరదాగా కాంతాన్ని, సుధనూ, వాళ్లతండ్రి పంతుల్నీ రంగయ్యమామనూ బోటు షికారుకు బయల్దేర దీస్తాడు. చీకటి పడిపోతే ఒక లంకలో ఆగవలసివస్తుంది. ఆ లంక దెయ్యాలలంక అని తెలుస్తుంది. అక్కడ చలపతి సుధలకు ఏకాంతం లభిస్తుంది. వాళ్లు మనసులు విప్పి మాట్లాడు కుంటారు. చలపతి మేఘసందేశంలోని శ్లోకాలను చదువుతాడు. నిజానికి కాళిదాసు శ్లోకాలను ఎవ్వరూ నాటికలలో యింత చక్కగా ఉపయోగించుకోలేదేమో ననిపిస్తుంది, యీ సన్నివేశం చదువుతూంటే! దెయ్యాలలంకలో సుధ స్వేచ్ఛగా సంచరిస్తుంది.

తనను హీనంగాచూసే లోకాన్ని గురించి 'పూరిలో అందరూ! దెయ్యాలు...ఈ దెయ్యాలంటే నాకు ఆనందంగా వుంది' అంటుంది. తనను ప్రేమించే హృదయం పోతున్నదని తెలిసి ఆనందించి, తిరిగి అసలైన దెయ్యాలలంక అయిన పూళ్ళోకి వెళ్ళలేక గోదావరిలోపడి ఆత్మత్యాగం చేస్తుంది. మంచి నాటికలలో మొదటివేలు మడిచి లెక్కించదగ్గది యీ నాటిక.

'నాగుబాము' నాటికలో బౌద్ధయుగ వాతావరణమూ, నాగసుందరుడనే శిల్పి కథనూ చిత్రించి, ఆ నాగసుందరుని ప్రేమించి అతనికై తపించిన ఆంధ్రరాజపుత్రి జయశ్రీ అనురాగపూరిత హృదయాన్నీ, నాగసుందరుడు తెల్లనాగుబాము కాటుకు గురియైతే ఆ విషాన్ని తాను స్వీకరించి శిల్పిని బ్రదికించిన రాకుమారి త్యాగశీలతనూ గొప్పకళాత్మకంగా వ్రాశారు. భారతీయ భాషలన్నింటిలోనూ ఏక కాలంలో రేడియోద్వారా ప్రసారితమైన యీ నాటిక అందుకు అన్నివిధాలా తగిందే ననటానికెంతమాత్రమూ సందేహం అక్కరలేదు.

రాజమన్నారుగారి నాటికలలో అత్యుత్తమమైన వాటిని యెన్నికచేసి మిక్కిలి అందంగా ప్రచురించిన ఎం. శేషాచలం అండ్ కో వారు అభినందనీయులు. ఈ నాటికలను B. A. Detailed Study గా నిర్ణయించినందుకు మద్రాసువిశ్వవిద్యాలయం వారెంతైనా ప్రశంసింపదగినవారు. రాజమన్నారుగారి లేఖిని యింకా ఎందరో కనకం, చిత్రరేఖ, రాధ, సుధ, జయశ్రీల వంటి స్త్రీ రత్నాలను సృజిస్తుందని ఆశింపవచ్చు.

—శ్రీ రామమోహనరాయ్.

## 'శిశుపాలవధము'

(శ్రీ మాఘమహాకవి సంస్కృత కావ్యమున కాంధ్రానువాదము. రచన—కావ్యతీర్థ, కవితావతంస, శ్రీ గట్టి లక్ష్మీనరసింహశాస్త్రి 'సాహితీసమితి'. ప్రతులకు: కూచిభొట్ల వీరరాఘవశాస్త్రి, కళ్యాణి ప్రెస్; తెనాలి; కార్యదర్శి, సాహితీసమితి, రేపల్లె.)

సంస్కృత పంచకావ్యములుగా ప్రసిద్ధి వందిన వానిలో శిశుపాలవధ మొకటి. మాఘమహాకవికృతము గావున మాఘకావ్యమనియు నందురు. సంస్కృత వాఙ్మయములో నీకవి కాలదేశాదులగూర్చి అనిశ్చితముగా గలదు. తారానాథతర్కవాచస్పతి మాఘుని గూర్చి వ్రాయుచు వాచస్పత్యములో—

'తావద్భా భారవే ర్భాతి యావన్మాఘస్యనోదయః
ఉదితేచ పునర్మాఘే భారవేర్భారవేరివ'—

అను శ్లోకము నుదాహరించినారు. ఈ శ్లోకము నుదాహరించి—దీనిపై పూర్వాపరము లాలోచించి—'సంస్కృతకవిజీవితము'నందు మల్లాది వారు (141, 142 పుటలు) మాఘుని 'శా. శ 480 ప్రాంతము వాఁడగును'—అనినారు. భవతు.

మాఘుడు—శబ్ద తర్క వేదాంత శాస్త్రములలో నిష్ణాతుఁడు. చిత్ర యమక బంధ కవిత్వప్రియుడు—కవితాకలాభిజ్ఞుడు ఇట్టి కవికృతి చదివి రసికుడగు నొక యర్వాచీన విద్వాంసుడు—

ఉపమాకాళిదాసస్య, భారవే రర్థగౌరవమ్
దండినః పదలాలిత్యం, మాఘేసంతిత్రయోగుణాః

అనినాడు. కాళిదాస, భారవి, దండి—వీరి ముగ్గురి కవిత వేరివల్ల ప్రసిద్ధమో! ఆ మూడు గుణములును మాఘుని రచనలో నున్నవనికదా భావము.

పదవాక్యప్రమాణపారావారీణుడైన మల్లినాథుడు—
వ్యాఖ్యావములన్నచో నల్లేరుపై బండి నడకగలవాడు—
ఆయనే—'మేఘే మాఘే గతంవయః' అన్నాడు.

ఈ శిశుపాలవధము నందు నాయకుడు శ్రీ కృష్ణుడు. వీరరసప్రధానముగా— శృంగారాదులు తదంగములుగాగల దీ రచన—

చాలకాలము క్రితము—అనగా 1887 లో— గోపీనాథం వెంకటకవిగారు ప్రబంధముగా 'శిశుపాల వధ' తెనుగున వ్రాసినట్లు తెలియుచున్నది.

ప్రస్తుతము—'శిశుపాలవధము'అనుపేర అనువాదము చేసినవారు – సాహిత్యలోక సుపరిచితులు శ్రీ గట్టి లక్ష్మీనరసింహశాస్త్రిగారు. కొంతకాలము

క్రీతము వీరు — గాథాసప్తశతిని — ప్రాకృతమునుండి తెనుగుచేసినారు.

మాఘకావ్యమున ఇరువదిసర్గలు వీరు రస వంతముగా నాంధ్రీకరించినారు మూలమునకు దగ్గరిగానున్న యనువాద మిది.

సంస్కృతమునుండి తెనుగులోనికి ననువ దించుట సామాన్యముకాదు. అందులో మాఘుని రచన. మూలరచయితతో సమానమైన పాండితీప్రతిభలు కలవాడు కాకున్నను మూలకారుని మనస్సును చూడ గలిగినప్పుడు — మూలమంత మధురముగా నను వాద ముండగలదు — కావుననే భాషాంతరీకరణము దుస్సాధము —

పూర్వకవులు — వేదవేదాంగపారీణులు. తమ రచన లలో సందర్భానుసారముగా వారివారి పాండితీప్రతిభల చూపినారు. మాఘుడట్టి కార్యమును చేసినవారిలో అగ్రతాంబూలమందినవాఁడు. ఇతని రచనలో రెండవ సర్గ—రాజనీతి నింపినది. దీనిలోని శ్లోకములను 'ఏనుగుతేళ్ల'ందురు. పదునాల్గవ సర్గలో నాట్య, సంగీత శాస్త్రజ్ఞానము గోచరించును, బౌద్ధము నందు నితడు పరిజ్ఞాతుఁడు. ఉదయతి వితతోర్ధ్వ రశ్మిరజ్జా...' ఇత్యాది శ్లోకమువలన ఘంటా మాఘుఁడైనాఁడట. శాస్త్రిగారి యనువాదము యథా మూలముగా సాగినది. కొన్ని కొన్ని చోట్ల పెంచి నారు. మఱికొన్ని స్థలములలో కొంత సంక్షిప్తత చేకూర్చినారు. సీసములు, వనమంజరి, మానిని, వృత్తములను గూడా చేర్చినారు. కొన్ని స్థలములలో వచనమునందు తెల్పినారు. వీరి యనువాద సరణిని గూర్చి యింకను వ్రాసినచో మితిమీరును — మచ్చు నకు కొన్ని శ్లోకములను—వానికి శాస్త్రిగారి యను వాదము నొసంగుచున్నాను:

(1) 'సమత్క్షిపన్ యః పృథివీభృతాంవరం
వరప్రదానస్య చకార శూలినః
త్రసత్తుషారాద్రి సుతా ససంభ్రమ
స్వయంగ్రహాశ్లేష సుఖేన నిష్క్రయం' (1 – 50)

'కైలాసాచల మెత్తు నత్తతిని
దోర్గర్వంబు పొంగం ద్రస
త్ప్రాలేయాద్రిసుతాస్వయంగ్రహ
పరీరంభక్రియా సౌఖ్యలీ
లా లాలిత్యములోడఁ బ్రత్యుపకృతుల్
గావించి, భావించెనా
పాలిన్ శూలి వరప్రదానమున కా
పౌలస్త్యుఁడో మాధవా! (1 – 50)

(దోర్గర్వము, పాలి, అనునూత్న పదములతో మూలములోని సమాసమును తెలుగులో పలికినది).

(2) 'తేజః క్షమావా నైకాంతః
కాలజ్ఞస్య మహీపతేః
నైకమోజః ప్రసాదోవా
రసభావవిదః కవేః (2 – 83)

ద్వితీయసర్గలో 'ఏనుగుతేళ్లు' అందురుగదా! వానిలో నిది యొకటి గావచ్చును, మల్లినాథ వ్యాఖ్య 'కింతు తత్తదపానుగుణ్యేన యథాయోగ ముభయ మప్యుపాదేయమ్'అనుచున్నది.— అనువాదము.

గీ. 'కాలముం గుర్తెఱింగిన క్ష్మాధవునకు
క్ష్మాత్రమనిగాని, క్షమయనిగాని; లేదు;
కలదె రసభావవిదుఁడైన కవికి నోజ—
మా ప్రసాదమా యను నియమ మొక్కకండు'— (2 – 83)

(శ్లోకమునందలి యుత్తరార్థము—మల్లినాథీ యములో తెనుగున గూడినది.)

(3) మాఘుని కాలనిర్ణయమునకు ఆధారముగా కొంద రీ శ్లోకమును గైకొన్నారు —
'అనుత్సూత్రపదన్యాసా
సద్వృత్తి స్సన్నిబంధనా
శబ్దవిద్యేవ నోభాతి
రాజనీతి రపస్పశా' (2–112)

(దీనిలోని వృత్తి, న్యాస, పదములు వ్యాకరణ గ్రంథబోధకములుగా నున్నవని — జినేంద్రబుద్ధికృత న్యాసమే యిది యని—మల్లినాథు డభిప్రాయపడినాడు. జినేంద్రబుద్ధికన్న మాఘుడు పరుడని యూహించుట సముచితముగాదని 'సం. క. జీవితము'.)

వీరి యనువాదము —

సమనుత్సూత్రపదన్యా
సము, సక్రమవృత్తియుతము, సనిబంధన మ
య్యు మెఱయ దాస్పిష్టకి. ని
త్య మపస్పశవౌనయేని, వ్యాకరణమటుల్.

(2-112)

'మక్కికి మక్కి' ఈ పద్యము. కాని —కొంత పెరుగుదల యిట్టి పట్టులలో యవసరము. వృత్త భేదముగా చేసినచో ఇంకికొంత శోభవచ్చెడిదేమో?

(4) 'రతాంతరే యత్ర గృహాంతరేషు
వితర్ది నిర్యూహ విటంక నీడః
రుతాని శృణ్వన్వయసాంగణోంతే
వాసిత్వ మాప స్ఫుట మంగనానామ్'

(3-55)

అను:—

అలరున్ ద్వారకలో గృహాంతరములం
దచ్చంపు లీలా విత
ర్దుల నిర్వ్యూహ విటంకనీడముల
యందున్ జంటలైయున్న చి
ల్కలు గోర్వంకలు నంగనామణితముల్
పల్మాఱు నాలించి వ
న్నెలతోఁ బల్కుచుఁ బ్రస్ఫుటమ్ముగఁ
దదంతేవాసులై యెంతయున్

(3-55)

మూలమునకు కొద్దిదూరముగా నిచట రచన సాగినది. శ్రీనాథుఁడు—'స్మరకేళికాలము'ను—'శైశాఖ వేళలు' చేసినాడు,... వీరు—'రతాంతరే'—'మణితములు'గా మార్చిరేమో?—'వితర్దులు!—కన్న వితర్దికలంటే—చాలా బాగుగా నుండునది'. వితర్దులు అనియు వాడిన వారు కొందరు కలరు.

5. 5-50 శ్లోకము

శివృత్తం పురోవజ......ఇత్యాదిలో
'...స్వచ్ఛావిహార వనవాస మహోత్సవానాం'
అనుదానిని

'లీలా స్వైర విహార హారి సుఖపాళీ
క్రాంతకాంతార
వాసా లీలోత్సవ భాగ్యమే......' యని చక్కని సమాసరచన చేసినారు –

మొత్తముపై వీరి రచన సంస్కృతాంధ్ర భాషానిష్ణాతులై ఉభయ సారస్వతములను కరతలామలకము గావించుకొని చేసినట్లున్నది—

6-64 శ్లో. మూలం – 'మృత్పిండ'; తెలుగు 'పెంకము' (6-64)

'గడియ'—అనుదానిని 'గడె'యని వాడినారు.

(ఘటిక—ఘడియ—యని) — ఇది వాడుకలో బాగుగా గలదు. ఈ విధముగనే మరికొన్ని పదములు.

గ్రంథము చివర 'మాఘకవి వంశవర్ణనము' (పద్యములలో) వ్రాసినారు. అందులో

'అలరె శ్రీ వర్మలన్వపు...(మొదటి పద్యము) 'శ్రీ వర్మల'కు — పాఠాంతరముగా 'ధర్మనాభుని' సూచించినారు. ఈ రెండుగాక—ధర్మలాతుఁడు. వర్మనాముడు, వర్మనాభుడు— అను పేళ్లును గలవు. 19 సర్గలో అక్షరపునరావృత్తముగా కొన్నిశ్లోకములు గలవు—తెనుగునం దవి యథాతథముగా చేయఁబడినవి—ఒక్కటి.

దాదదుఁడు—దుద్దదుద్దాది, దూదదీద
దోః ప్రథితుఁడు, దాదాదుఁ డుఁదద్నపదుఁ
డదుఁ, డేదదదదదదుఁడు, మాధవుడు వింటఁ
దొడగి, దుద్దమ్ము వొకఁడేసె దుద్దునిపయి'

(19-101)

తప్పొప్పుల పట్టిక నిచ్చినారు—ఐనను—మరి కొన్ని దిద్దుబాట్లు చేయవలసియున్నవి.

వీరి కృతు లన్నిటివలె నిదియు - సాహిత్యపిపాసువులకు నానందము చేకూర్చకలుగును.

'ధన్యోమాఘ కవిర్వ్యయంచ కృతిన స్తత్సూక్తి సంసేవనాత్' (మల్లినాథుఁడు).

## 'ఆంధ్రకవితా సామ్రాజ్యము'

(కృతికర్త : శ్రీ నిష్ఠల సీతారామశాస్త్రి. వెల రు. 2—00. ప్రతులకు, నిష్ఠల సీతారామ శాస్త్రి, ఎస్.ఎం. పి. స్కూల్, బొబ్బిలి, శ్రీకాకుళంజిల్లా.)

ఆంధ్రసాహిత్యంలో కవుల జీవితాల గురించి కవుల చరిత్ర గురించి గురుజాడ శ్రీరామమూర్తి — కందుకూరి వీరేశలింగము — మొదలగు వారినుండి నేటివరకు ఆంధ్ర సాహిత్య చరిత్రను క్రొత్త క్రొత్త విషయాలతో చాలామంది వ్రాస్తున్నారు అవి వాటి వాటి విశేషాలకు తగినట్లు వ్యాప్తి చెందుతున్నాయి.

'ఆంధ్రకవితాసామ్రాజ్యము' అనే పేరుతో సుమారు 600 పద్యాలుగల తెలుగు సాహిత్య చరిత్రను వ్రాసినవారు శ్రీ నిష్ఠల సీతారామయ్యశాస్త్రి, ఈ గ్రంథము నన్నయనుండి నేటివరకుగల కవులను వారి రచనలను పరిచయము చేయునది. ఈ గ్రంథ కర్త 'గ్రంథ—విస్తర భీతి'చే కొందరు కవులను రచనలను వదలినారు. ఆంధ్ర సాహిత్యంలోవుండే రచయితలందరినీ గురించి వ్రాయాలంటే ఒక్క గ్రంథంకాదు—కొన్ని సంపుటాలు తయారవుతాయి.

విషయ ప్రధానాలైన చరిత్రలను గద్యరూపకంగానే వ్రాయడం చాలామంచిది. మన చరిత్రలలో అన్నీ చర్చలు నిర్ణయాలు ఉండి 'తీయరాని ముళ్ళగా' తయారయినాయి. ఈ పద్ధతిలో ఉండే వాటిని పద్యాలలో వ్రాయడం శ్రమతోకూడిన కార్యము.

ఆంధ్రపురాణము, ఆంధ్రసామ్రాజ్యము, అనే గ్రంథాలు చరిత్రను పద్యరూపకముగా తెల్పునవి. అవి ప్రసిద్ధములైనవి. ఆంధ్రవాఙ్మయ చరిత్రను పద్యరూపకముగా తెలుపున దీ గ్రంథము. వాఙ్మయ చరిత్రను సంక్షేపముగా త్వరలో అవగాహన మొనర్చుకొనదలచిన జిజ్ఞాసువులకు ఇది ఉపయోగపడుతుంది. వీరి ఈ రచన ఎంత సంగ్రహమైనా ముఖ్యమైన కవులు వదిలివేయబడటం పాఠకుని మనస్సుకు కొద్ది కష్టం కలిగిస్తుంది. 'మార్కండేయపురాణము' వ్రాసిన మారన, అభినవదండి కేతన, చక్కనికవితగల జక్కన, కేయూరబాహుచరిత్ర వ్రాసిన మంచన, యక్షగాన కవులేకాక, దక్షిణాంధ్రయుగంలోని కవయిత్రులు పేర్కొనబడలేదు. వీరు తెలిపిన కవులకన్నా తెలుపని వారిలో ముఖ్యులు ఎక్కువగా నున్నారేమో !

శ్రీనాథయుగంలో ఉండవలసిన గౌరన ఎక్కడో శంకరకవివద్ద పేర్కొనబడినాడు. విషయైకగ్రంథ రచయితలైన వీరు ఒకేదగ్గర ఉండవలెననుకున్నారు రచయిత. నాచనసోముడు—ఎఱ్ఱన వీరి కవిత్వాన్ని గూర్చి శాస్త్రిగారు ప్రశంసనీయముగా వ్రాసినారు. ఎంత ప్రాచీనసంప్రదాయవాసనావాసితులైనా ఆధునిక కవిత్వము—అందులో వచన కవిత్వము—వ్యావహారికభాష— వీటి విషయమై అంతగా వివరింపకుండుట మంచిది కాదేమో !

దక్షిణాంధ్రయుగమును అందరు క్షీణయుగము అనటం పరిపాటియైనది. ఈ గ్రంథకర్తయు ఆ అభిప్రాయము కలవాడే. 280 పద్యములో 'ఔచిత్యంబున కాస్పదంబయిన కావ్యశ్రేణి నిర్మించి వాచాచాతుర్యము గల్గువాఁడు గుణదోషజ్ఞానియై, సద్వచో వైచిత్ర్యంబున నొప్పునట్టి కవి కన్పట్టండో-కండున్' అనియు 'కవిత్వాచారము' 'ఉజ్వలైకపరతంత్ర'మైన దనియు వ్రాసిరి. కాని ఈ యుగములోనే—యక్షగానాలు, వచనరచన మొదలైన నూతన సాహిత్య ప్రక్రియలు — వెలువడినాయని వీరికి తెలిసికూడా పై విధముగా వ్రాయటం అంతమంచి అనిపించుకోదు. దక్షిణాంధ్రయుగం క్షీణయుగం అనటం సబబు కాదనిపిస్తుంది.

వైదికమతపునరుద్ధరణార్థమై నన్నయ భారత రచనచేసినాడు అని నమ్మేవారిలో వీరొకరు. నన్నయ తర్వాత తిక్కన–ఎఱ్ఱనలకు పూర్వం '......వాఙ్మయనందనమున కాకురాలుపు కాలమై యతిశయించె' అని 'ఆకురాలే కాలము' అనే సామె తను సందర్భోచితంగా చక్కగా ప్రయోగించినారు. ఈ సామ్యము ఎంతో నిజం.

గ్రంథకర్తృత్వ విషయాలలో వీరు చాలా నేర్పు జూపినారు. ఈ పద్ధతి ఏ కొద్దిమందికో వుంటుంది. కాని రంగనాథరామాయణాన్నిగూర్చి—

'కాని రంగనాథకవిశబ్దవాచ్యుండు
కలడటంచు నొక్క కవియు గూడ
బలుకకుంట వలన గోన కు
లీన బుద్ధారెడ్డి రచన యిద్ది (51 ప.)

అన్నారు. కొఱవి గోపరాజు స్తుతించిన కవులలో రంగనాథు డొకడున్నాడు. సాహిత్య రంగంలో రంగ నాథరామాయణ కర్తృత్వం పెద్దదుమారం లేపింది. ఈ గ్రంథకర్త పైవిధంగా వ్రాయడం ఆశ్చర్యం. 54 వ పద్యంలో 'ఏజియేమైనను రంగనాథమను పేరె దానికిన్ పాదిలెన్—' అని కొంత న్యాయం జెప్పడానికి ప్రయత్నించినారు.

ఈ గ్రంథంలో పద్యాలేగాక మధ్యమధ్య కొన్ని ద్విపదలు వాడబడినవి శైలి పాఠకుని త్వరగా నాకర్షించుకొని గ్రంథమంతయునూ ఒకేమారు చదివింప గలుగుతుంది.

కొందరు పూర్వకవుల పద్యాలలోని పాదాలకు పాదాలు ఈ పద్యాల్లో పొదిగింపబడ్డాయి 'మహిమున్ వాగను శాంతనుండు స్వకీయింపన్ గుండలీంద్రుండు తన్మహనీయస్థితి—' (64 ప.). 'అది దొడంగి మూఁడు కృతు లాంధ్రకవిత్వ విశారదుండు—' (74 ప.) 'దాక్షారామచళుక్య - భీమవర గంధ ద్విపప్రో భామినీ వక్షోజద్వయ కుంభి కుంభములపై' (120 ప.) 'సరసార్థబోధఘటనాహేలాపరిష్కార శారద నీ రూపము రామకృష్ణ కవిచంద్రా! సాంద్ర కీర్తీశ్వరా!' (248 ప.) ఈ విధంగా ఇంకా కొంద రివి కలవు. వీటివల్ల కవిగారి పద్యాలకు ఒకమాత్ర శోభ వచ్చింది.

నన్నయగారి 'అమలిన తారకాసముదయం బుల.........' ఇత్యాదిపద్యం చాలా ప్రసిద్ధమైంది. అదే అర్థాన్ని ఈ క్రింది పద్యంలో మంచిగా తెల్పినారు—

'గగనాభోగమునందునున్న
బహునక్షత్రంబులన్ లెక్కపె
ట్టగవచ్చున్, శ్రుతిశాస్త్రసారము
నిరాటంకంబుగా బోధసే
యఁగ వచ్చున్ మహనీయ భారతము నారా!
యాంధ్రమందున్ రచిం
పఁగ శక్యంబగునొక్కొ లోకమున
నా వ్యాసోక్తవహ పద్ధతిన్.' (31 ప.)

'హెచ్చిన, స్వేచ్ఛ' ఈ ప్రాస ఆలోచింప దగింది.

'అకటా! పింగళి సూరనార్యకవిచంద్రా! కూర్పు నీకే తగున్'. (224 ప.)

దీనిలో యతిసంతాపార్థకమో! ప్రశంసార్థ కమో! మరేమో? అనుటకన్న అసాంతవతిక్రమ అనిపించుచున్నది.

చివరిపద్యము 'కలదే నాదొక సద్గుణంబది రసజ్ఞశ్రేణి గైకోదగున్'. దీనిలో విశేషవళి గావచ్చును?

కొన్నిపదాలను రచయిత స్వతంత్రంగా ప్రయో గించినారు. అసాధురూపములు గూడ సాధువులుగా వాడబడుట సహజమైనది. శకటరేఫలు, సాధురేఫలు ప్రయోగించడం చాలా నేర్పుతో కూడనపని. వీరి రచనలో – ఆ నేర్పు తప్పింది.

శ్రీ దివాకర్ల వేంకటావధానిగారు, తూమాటి దొణప్పగారు స్వల్పంగా చాలా చక్కని తొలిపలుకులు వ్రాసి గ్రంథానికొక అందం చేకూర్చినారు.

'ఒకొక్క పట్టున నొక్కొక్క సుకవి రచన
మధురమధురానుభూతి సంపదలఁ గూర్చు
మఱియు నొక్కొక్క ఘట్టమం దరసి చూడ
నొక్కొకడు సిద్ధహస్తుఁడై యొప్పుచుండు'
(98)

ముద్రారాక్షసుల బారికి గురికాని గ్రంథాలు చాలా తక్కువ. ఈ గ్రంథంలో 'తప్పొప్పుల పట్టిక' ఉన్నందుకు విచారపడవలసిన అవసరం లేదు

ఆంధ్రవాఙ్మయ చరిత్రను పద్యరూపకంలో చదువాలనుకునేవారికి ఈ గ్రంథం సంతోషాన్ని కలిగిస్తుంది.

## 'మనోరమా శ్యావాశ్వము'

[గ్రంథకర్త— సూరంపూడి భాస్కరరావు: ఎం. ఏ.; సాహిత్యరత్న; సంస్కృతశాఖాధ్యక్షుడు; ప్రభుత్వ కళాశాల, రాజమహేంద్రవరము వెల—2—55 ]

అపౌరుషేయములైనవి వేదములు. మానవుడు సాంస్కృతిక ఆధ్యాత్మిక ప్రవృత్తులతో వృద్ధి చెందుచు మనుగడ సాగించుటకు వేదములు మూలకందములైనవి. 'సత్యం వద'— 'ధర్మం చర' ఇత్యాదిగా మానవులబోధించి సన్మార్గగాములుగా నొనరించును.

వేదములయందును - ఉపనిషత్తులయందును మధ్యమధ్య కొన్ని చిన్నకథలు వచ్చుచుండును. చతుర్వేదములలో మొదటిదైన ఋగ్వేదము అట్టికథలు కల్గినవానిలో నొకటి. ఈ ఋగ్వేదములో 5 వ మండలము అత్రిమండలము. అందర్చనానససూక్తములు రెండు (63–64), శ్యావాశ్వని సూక్తములు పన్నెండు (52-61; 81–82) ఈ 60 వ సూక్తమున శ్యావాశ్వని కథాంశము సూచింపబడినది ఇందే మరుత్తులు, శశీయసీ, తరంతవైదదశ్వి, పురుమీళ్హవైదదశ్వి, దార్భ్యుడగు రథవీతి, రాత్రిదేవత, గోమతీనదియు చెప్పబడినారు. సాయణభాష్యములో ఈకథ కొంత ఉదాహృతమైనది. 'వైదిక-కహానియాఁ' అను గ్రంథమునందు బలదేవ ఉపాధ్యాయులవారు 16 పుటలలో ఈ కథను వ్రాసిరట. ఇట్టి 'మనోరమాశ్యావాశ్వుల' కథను సూరంపూడి భాస్కరరావుగారు సుమారు 330 పద్యములలో తెల్పినారు. 'మున్నుడి'యందు దీనికి సంబంధించిన విషయమున్ వ్రాసి కథామూల శ్లోకములను గూడా తెల్పినారు. అవి 22 శ్లోకములు.

ఒక భాషనుండి మరియొక భాషకు ఏ విషయమునైనను పరివర్తనచేయుట యనునది ప్రతిభావంతుడైన కవి చేయవలసినపని. దానికితగిన పాండిత్యమున్నచో నట్టి కృషి సఫలమగును. అందులో వేదములయందుగల కథను గైకొని స్వకీయ ప్రతిభచే కొంత మెరుగులుపెట్టి సహృదయ హృదయాహ్లాద మొనర్చుట యనునది శ్రమైకసాధ్యమైన దుష్కరకార్యము.

భాస్కరరావుగారు ఈ గ్రంథమును రసవంతముగా రచించి 'మనోరమాశ్యావాశ్వుల'ను స్వతంత్ర కావ్యమా! అనునట్లు సాహిత్యలోకమునకు పరిచయము చేసినారు. వీరి కృషి అభినందనీయమైనది. వేదవినుతఖ్యాలు(33)— ఉపోషితవ్రతి (37) - వసతికత (45) అనుపదములు సంస్కృత వాసనను స్ఫూర్తిగా పుడికిపుచ్చుకొన్నవి. ఉభయభాషలయందు పాండిత్యముండువారు ఇట్టి పదములను ప్రయోగింతురు.

శ్యావాశ్వుడు ముని కుమారుడు. మనోరమ రాకుమారిక. ఈ యుభయుల వివాహము జరుగుట యన్నది దీనిలో ముఖ్యమైన కథ. మూల మతిస్వల్పముగానున్నను తెనుగుసేతలో సందర్భోచిత వర్ణనాయుక్తముగా పెరుగుట సంభవించినది

'ఆగమంబెఱుఁగు సదాచార మెఱుఁగును
ప్రభులచెంత మెలఁగు వాటమెఱుఁగు;
యజ్ఞవిధుల నెఱుఁగు నవనీశ! శ్యావాశ్వుఁ
డతఁడు—' (23) ఇది శ్యావాశ్వని కవి

పరిచయముచేయు పద్యము. ఇక మనోరమను ఆరు పద్యములలో వర్ణించినారు.

'అంత సర్వాంగసుందరియగుట నామె
యంగ ముపమాన సార్థక్య మాహరించె,
సహజవిద్యాగరిష్ఠ నిష్ఠాపరుండు
తక్కనన్యుఁడా పెంగాంచి తలఁగఁ గలఁడె.'(51)

ఉపమానసార్థక్యమును ఈమె యంగము ఆహరించెననిచెప్పి కవిగారు ఇంక నాల్గు పద్యములలో ఈమె అంగాంగములను ఆలంకారికుల కొలతతో—సాహిత్యమర్యాదలో వర్ణించినారు.

'సహజ విద్యాగరిష్ఠ నిష్ఠాపరుండు' అని చెప్పుట లోని అభిప్రాయము వేదాభ్యాసజడుడైన శ్యావాశ్వుని గూర్చికావచ్చును. ఆ మనోరమ 'పొగను జూచి మునులె సొక్కుదురో యన మేలిముసుగు దాల్చి'నదట. అయిన 'యజ్ఞవాటి నెవ్వ రంద మన్వేషింతు రతివ సిగ్గు లెత్తేఁగెనంతెగాక' యని వెంబడే కవిచెల్పుచున్నాడు. యజ్ఞవాటిలో నిజముగా ఎవ్వరును అంద మన్వేషింపరు. ఆ యువతి మాత్రము 'సిగ్గు' గాక 'సిగ్గు లెరిగినది'. ఇది చక్కని సామ్యముతో చెప్పబడినది.

మనోరమను శ్యావాశ్వునకిచ్చి వివాహముచేయుట తల్లికిష్టములేదు. రాజపుత్రికను రాజరాజునకో—వీర పుత్రునకో ఇచ్చుటపాడి. కాని 'వైదికునకు రాచపట్టి నిచ్చుట ద్రాక్షనురను జటికిఁ ద్రావఁ జూపుటెయగు' ననును. వైదికుడు—జటి శ్యావాశ్వుడు; ద్రాక్షనుర గలిగినది మనోరమ. ఈ విధమైన వర్ణనలు సంభాషణలు వీనితో రచన సాఫీగా సాగినది. సంస్కృత పదములను వీరు చక్కగా పద్యములలో అమర్చినారు. వానిలో 'మనోరథావాప్తిరస్తు—మాతే దుఃఖం' (133)అని శ్యావాశ్వుని ఆశీర్వదించు సందర్భము లోనిది. 'శుభాస్తేపంథానః' అని కొందరాశీర్వదించుట నేటికిని గమనింపదగినది. 'బ్రహ్మేయుర్భవనానామ్, బ్రహ్మప్రీయేత'. వేద పరిచయమున్నవారు ఉట్టంకించున దీ వాక్యము. శ్యావాశ్వుడు మిక్కిలి సంయమము గలవాడు. వారసతియు ఇతనికి వేసారి వెళ్ళిపోయెనట. ఇంక నెట్టివాఁడనగా జవరాలు వెంట దగిలి 'చలి చలిగా వాయువువీచె తమ్మ పాన్పునకు వయస్యుఁడ యన్న వినని కుమతియు బోలిన'వాడు. 186 పద్యమునుండి 196 వ పద్యమువరకు సందర్భమును చూచుకొని రచయిత ధర్మోపన్యాసముగా నాటి సంఘమును — రాజకీయములను కొద్ది చురుకుగా విమర్శించినారు. వానిలో ఒకటి—

'బాలనాయకత్వ బహునాయకత్వ ము
శ్చాలవేమొ? దేశసౌఖ్యమునకు?
అల్పనాయకత్వ మటపై వినా
యకత్వములు గూడ వెంటఁదగిలి నారు!'(193)

మనోరను వివాహము చేసినతర్వాత రాజు మనోరమాశ్యావాశ్వులను సాగనంపి—

'బరువు దింపుకొనిన భారవాహునిభంగి,
సఫలకార్యుఁడైన స్వామిభంగి,
క్రతువు దీరినట్టి కర్మనిష్ఠునిభంగి,
కూతునంపి తండ్రికుదుటబడియె'(318)నట.

(కణ్వుడు శకుంతలను దుష్యంతునివద్దకు పంపినతర్వాత—'ప్రత్యర్పితన్యాస ఇవాంతరాత్మ'వలె మన్నాడని కాళిదాసు అనును.)

ఈ గ్రంథములో 21, 42 పుటలలో 'వాంచి'అనే పదమును ఉపయోగించినారు. తల యొగ్గియను నర్థములో ఇది ప్రయోగింపబడినది. రచయిత 'శుద్ధిపత్రము' నొసంగినను కొన్నిఅచ్చు తప్పులు దొర్లినవి. 'ప్రూపు'లు జూచువారిశ్రద్ధ పెద్దయక్షరములపై పన్నగిల్లినట్లున్నది. మొదటి పుటలో గ్రంథకర్త పేరునందు 'స్క' బదులు 'స్క' పడుట కొంతబాధాకరమైన విషయము. (నా అనుభవములో కొన్నిగ్రంథములయందు ఆ గ్రంథముపేరే తప్పొప్పుల పట్టికలోనుండుట యెఱుగుదును.)

గ్రంథము అందముగా ముద్రింపబడినది. పీఠి

కలు అభిప్రాయములు అనలేలేక తప్పొప్పుల పట్టిక (హెచ్చుగా)లేక కావ్యకన్యక సంతోషముగా నున్నది. సహృదయుడైన ప్రతిపాఠకుడు చదివి ఆనందింప వలసిన ఈ గ్రంథములో ఆర్య, సంగతా, గురుహితా, రథ్యా, తరళిత, ద్రుతము, పూర్వా, సీసకము— మొదలైన అరుదగు వృత్తములు గలవు. ఈ కావ్యము వాటికగా 1964 లో ఆలిండియా రేడియోవారిచే ప్రసారము చేయబడినట్లు రచయిత వ్రాసుకున్నారు. 1959 డిసెంబరు 'భారతి'లో 'మధూలావృత్తాంతము' ఈ గ్రంథకర్తది గలదు.

—శ్రీ రంగాచార్య

## వ్యాసావళి

[గ్రంథకర్త: శివశ్రీ బండారు తమ్మయ్య; ప్రకాశకులు: శ్రీ నిర్మల శైవసాహితీ గ్రంథమాలిక; నండూరివారివీథి, గాంధీనగరము, కాకినాడ—4. మూల్యము: రు 4-50 లు],

విమర్శకాగ్రేసర శివశ్రీ బండారు తమ్మయ్య గారి వ్యాస సంపుటములలో నిది రెండవది. ఆయన ఈ వ్యాసముల నింతకు ముందెప్పుడో వ్రాసెను. అప్పటి పత్రికలలో అవి అచ్చయినవికూడ. ఇప్పుడు వాటి నన్నింటిని సేకరించి సంపుటములుగా శ్రీ నిర్మల శైవసాహితీగ్రంథమాలికవారు ప్రకటించుచున్నారు. ఈ ద్వితీయ సంపుటమునందు మొత్తము పది శీర్షికలతో వ్యాసములున్నవి. ఇందు సగము గ్రంథము అనగా మొదటి అయిదువ్యాసములును శ్రీ బసవేశ్వరునకు సంబంధించినవి. మిగిలిన వ్యాసములలో ఆచార్యపండితు డన్న వ్యాసము గొప్పది. ఇంత గొప్పవి కాకపోయినను చిన్న వ్యాసములొక నాలుగు కలవు. పిడుపర్తి సోమనాథుని ద్విపదములు, ప్రభులింగలీలలు, మాయావిలాసమనుపేర సంస్కృతీకరింపబడినవను వాస్తవ విషయమును సోపపత్తికముగా నిరూపించు వ్యాసమొకటి, శ్రీశైల మల్లికార్జునుని సేవించి అతనిపేర కృతులను వెలయించిన మహా శివభక్త కవులను శ్రీ తమ్మయ్యగారు శ్రీశైల మల్లి మల్లికార్జున స్వామివారి ఆస్థాన కవులుగా చమత్కరించి, అట్టి మల్లికార్జున పండితారాధ్యుడు, పాలకురికి సోమనాథుడు, నాగులూటి శేషనారాధ్యుడు అను మువ్వురను గురించియు, వారి కృతులను గురించియు పరిచయము చేయుచు విపులమైన వ్యాసము నొకదానిని వ్రాసిరి. పండితారాధ్య చరిత్రము మహిమప్రకరణమున గణసహస్రమాలికా స్తవము కలదు. అమరావతి అమరేశ్వరలింగము సన్నిధిని పండితుడు స్మరించి స్తుతించిన గణసహస్ర మాలిక యది. పాల్కురికి సోమనాథుడు తావే స్వయముగా ఈ గణమాలికను కన్నడమున కూర్చినాడు. సంస్కృతమునను ఈ గణమాలికాస్తవము కలదు. దానిని పండితారాధ్యుడే రచించియుండునని కర్ణాటక పండితులు కొందరభిప్రాయపడిరి. దానిని త్రోసిపుచ్చుచు అది గురురాజకవియనువాని అనువాదమని శ్రీ తమ్మయ్యగారు సహేతుకముగా గణసహస్రమాలికా వ్యాసమున నిరూపించిరి. శివకవి గౌరనమంత్రి కృతులను రెండింటిని హరిశ్చంద్రోపాఖ్యానమును, నవనాథ చరిత్రమును రేఖామాత్రముగా పరిచయము చేయుచు వ్రాసిన చివరి వ్యాసము మరియు చిన్నది.

(1) బసవేశ్వరుని శీలము—జీవితతత్త్వము, (2) బసవేశ్వరుడు—బిజ్జలుడు. (3) బసవేశ్వరుని గూర్చిన శాసనసామగ్రి. (4) బసవచరిత్ర — సోమనాథహరీశ్వరకవుల కథనభేద పరిశీలన. (5) బసవేశ్వరునిగూర్చిన ఆంధ్రవాఙ్మయము—ఈ యైదును బసవేశ్వరునకు సంబంధించినవి. బసవేశ్వరుడు పశ్చిమ చాళుక్య చక్రవర్తి వద్ద మంత్రిగానున్న చారిత్రక వ్యక్తి యనుటను కొందరు సందేహించుచుండగా శ్రీ తమ్మయ్యగారు అట్టి సందేహములను పేర్కొని సోపపత్తికముగా ఖండించి బసవేశ్వరుడు చారిత్రక వ్యక్తియని నిరూపించిరి. బసవేశ్వరుడు చారిత్రక వ్యక్తి యగుచో అతనినిగూర్చి చెప్పు శాసనములు లేవను వాదమును త్రోసిపుచ్చుచు

శ్రీ తమ్మయ్యగారు అర్జునవాడ శాసన మాధారముగా బసవేశ్వరుని చారిత్రకతను నిశ్చయము చేసి చూసిరి. పాల్కురికి సోమనాథుడు బసవ పురాణము వ్రాసి బసవేశ్వరునిగూర్చి అనేక విషయములను తెలియజేసెను. ఈ తెలుగు కృతి ననుసరించి కన్నడమున భీమకవి బసవపురాణమును రచించెను. కన్నడమున మరియొక కవి హరీశ్వరుడను వాడు పూర్వ శివభక్తుల చరిత్రములను వ్రాయుచు అందులో బసవేశ్వరుని గురించియు వ్రాసినాడు. ఈ హరిహరుడు 12 వ శతాబ్దము చివరనున్నవాడు. పాల్కురికి సోమనాథుడను ఆ శతాబ్దమువాడే. ఈ యిరువురును పరస్పరము తెలియకుండనే శివభక్తి విశేషము కలిమిని బసవ చరిత్రమును వ్రాసిరి. శ్రీ తమ్మయ్యగారు పాల్కురికి సోమనాథుడు, హరీశ్వరుడు—ఈ ఇరువురును బసవని చరిత్రమును చెప్పుటలో ఏమి నడకలు నడచిరో కూలంకషముగా పరిశీలించి వ్రాసిరి. ప్రసిద్ధములైన సోమనాథుని కృతులుగాక యక్షగానములుగా ఇతరులచేత కూర్పబడిన కృతులనుకూడ ప్రశంసించుచు శ్రీ తమ్మయ్యగారు వ్రాసి బసవేశ్వరుని గూర్చిన వాఙ్మయమాంధ్రమున ఎంతగలదో ఒక అంచనా వెలయించినారు.

వీరశైవమత మూలాచార్య పంచకములో పండితారాధ్యు లొకరు కందు. అతడే మల్లికార్జున పండితారాధ్యుడని కొందరొక పెద్దవాదమును నిలబెట్టిరి. దానిని నిర్మూలము చేయుచు శ్రీ తమ్మయ్యగా రాచార్య పండితులగూర్చి అనేకములయిన ఉపపత్తులను జూపుచు చాల పెద్ద వ్యాసమును వ్రాసిరి—ఇంతగా విశేష పరిశోధనచేసి అనేక నూత్న విషయములను సోపపత్తికముగా నిరూపించుచున్న ఈ వ్యాసములు సాహిత్య విద్యార్థుల కవశ్య పఠనీయములు.

—క్షేమేంద్ర.

---

Printed and Published For Nageswara Rao Estates (Private) Ltd., by Radhakrishna
at the Andhra Patrika Press, 6 & 7, Thambu chetty Street, Madras-1,
Editor: S. Sambhu Prasad.